ఓం

# జాతక మార్తాండము






ప్రకాశకులు:

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి


[illegible]　　　　　　[రూ. [illegible]

శ్రీరస్తు

# జ్యోతిశ్శాస్త్రము

ఈ శాస్త్రము నిజమని కొందరు అబద్ధమని కొందరు కొంత నిజము కొంత అబద్ధము అని కొందరు యీరీతిగా పలుకుచున్నారు. ఈశాస్త్రము 1 సిద్ధాంతభాగము 2 ముహూర్తభాగము 3 జాతకభాగము 4 ప్రశ్నభాగము 5 శాంతి భాగము అని 5 విధములు. వీనిలో సిద్ధాంతభాగము నిజమని అనేకమంది యొప్పుకొనుచు తక్కినభాగముల నంతగా నమ్ముట లేదు. అట్టి అపనమ్మకము కలుగుటకు తగిన కారణములను కొన్నిటిని వ్రాయుచున్నాము.

1. కాలము:—కాలముకంటె విలువగలది మరియొకటి లేదు. అట్టి కాలము ఈశాస్త్రమునకు మొదటియాధారము. ఆ కాలమును బట్టియే లగ్నములను భావములను రాసులను ఏర్పరచి ఫలములను చెప్పవలసియున్నది. అట్టి జననకాలమును [illegible]సాధనమువలన సరిగా కనిపెట్టకపోయినను జాతకుడు జన్మించినప్పుడు లగ్నసంధి కలిగినను చెప్పినఫలము భేదించును.

2. శాస్త్రము:—పై 5 భాగములలో సిద్ధాంతభాగమునుపూర్తిగా చదివినగాని తక్కిన భాగములయందు ఎంతప్రవేశముండినను లాభములేదు. సిద్ధాంతభాగము ననుసరించిజాతక భాగమునకు కావలసిన ముఖ్యమైన యంశము 1 లగ్నస్ఫుటము 2 భావస్ఫుటము 3 గ్రహస్ఫుటము 4 షడ్బలసాధనము 5 [illegible]లు. ఇవి జాతకభాగమునకు చాలాముఖ్యము. ఉదాహరణము: [illegible] జాతకములో గురుడు సప్తమస్థానమందున్నప్పుడు కళత్ర[illegible] [illegible]సంపత్తియు ఆయుర్భాగ్యములు [illegible] [illegible]ని ఫలములను చెప్పుచుందురుగాని యిది సిద్ధాంతభాగరీత్యా

భావస్ఫుటముజేసి చూచినయెడల యీగురుడు సప్తమభావము నందుండక షష్ఠభావమునందుగాని అష్టమభావమునందుగాని ఉన్నయెడలపైనచెప్పిన ఫలములన్నియు తప్పిపోవును. గనుక రాశిచక్రము వలెనే భావచక్రము గూడ యేర్పరచి ఆభావచక్ర మునుబట్టి ద్వాదశభావఫలములు చెప్పవలెను. కాని, రాశి చక్రమునుబట్టి యెప్పుడును భావఫలములు చెప్పగూడదు. అట్లు చెప్పుట వ్యర్థము అనేకమంది భావచక్రమును విడిచిపెట్టి రాశి చక్రమును బట్టియే ఫలములను చెప్పుచున్నారు. ఇదిగొప్ప పొరపాటు. కనుక, గ్రహము భావము లగ్నముయివి స్ఫుటము చేయనిదే జాతకఫలములను చెప్పగూడదు. అట్లు చెప్పుట వ్యర్థము. అట్లు స్ఫుటముచేయుటకు సమర్థతలేనివారిచేత జాత కములను వ్రాయించుకొనుటకూడ వ్యర్థమని కనబడుచున్నది. అట్లుస్ఫుటము చేసిన తరువాత గ్రహములయొక్క మధ్యబలములు షోడశవర్గు అష్టకవర్గు సమయావస్థలు ఉచ్చనీచలు మొదలగు అంశములన్నియు సిద్ధాంతభాగమువలన పూర్తిగా గణితము చేసి అటుపిమ్మట జాతకఫలములను చెప్పినయెడల మిక్కిలిరుజు వుగా నుండును కనుక పైనవ్రాసిన అంశములన్నియు చదువరు లకు సులభముగా తెలియునటుల దీనియందు వ్రాయబడినది. ఇంకను మిగిలినలోపములన్నియు ౨ వ భాగములో సంపూర్ణ ముగా వ్రాయబడును. ౨వ భాగముతో యీగ్రంథముపూర్తి యగును. చదువరులందరును దీని యందుండు దోషములను మన్నించి గుణములను గ్రహించెదరని నమ్ముచున్నాను.

ఇట్లు విధేయుడు,

ఆకెళ్ళ వేంకటశాస్త్రి

గోపాలపురం, కొత్తపోష్టు, తూర్పు గోదావరిజిల్లా

శ్రీ ర స్తు

# జా త క మా ర్తాం డ ము

---

## ద్వి తీ య భా గ ము

---

## సం జ్ఞా ధ్యా య ము

శ్లో. రక్తాంబుజరుచిం దేవం సర్వారంభేషుసర్వదా
ప్రణమంతిచయం దేవా స్తన్నమామిగజాననం

శ్లో. వాగ్విభూతిప్రదాదేవీ యాశ్వేతాంబురుహాస్థితా
కర్పూరధవళాకారా స్వాయంనృత్యతువాచిమే.

శ్లో. మేషాదిరాశయస్సర్వేదినేశప్రముఖాగ్రహాః
యేచలోకోపకర్తారః పాంతుమామిహతేసదా.

శ్లో. యశ్చకర్తాజగతాంభర్తానంహర్తామహసాంనిధిః
ప్రణమామితమాదిత్యం బహిరంత స్తమోపహం.

### గ్రహములకు రాసులయొక్క విభజన

దినకరుడగు సూర్యుడును, నిశాకరుడగు చంద్రుడును మొదట యాకాశచక్రము యావత్తును రెండుభాగములుగా తమలోదాముపంచుకొనిరి. అప్పుడు సూర్యునికి సింహాము

మొదలు మకరము వరకు వచ్చెను. చంద్రునకు కుంభము మొదలు కర్కాటకమువరకు వచ్చెను. అంతట తక్కిన గ్రహములు కూడ గృహదానము చేయుమని వేడుకొన సూర్యచంద్రులు సింహ కర్కాటకములు మాత్ర ముంచుకొనిరి. వాటి ప్రక్కనుండు మిధునకన్యలను తన సమీపమునందుండు బుధున కర్పించిరి. ఆయన ప్రక్కనుండు శుక్రుడువేడుకొన వాని ప్రక్కనుండు వృషభ తులల నర్పించిరి. అంతట కుజుడు వేడుకొన వాటి ప్రక్కనుండు మేషవృశ్చికములనిచ్చిరి. ఇదివిని తనవంతు వచ్చెనని బృహస్పతి వేడుకొననాయనకు ధనుర్మీనముల నిచ్చిరి. తుదకు దూరముననున్న శని విని యాతనివంతు దయ చేయుమనివేడ మిగిలిన మకరకుంభముల నాతని కర్పించిరి. ఈ విధముననే యేడుగ్రహములును 12 రాసులను తమలో దాము పంచుకొన్నట్లువిని గుండెలు కొట్టుకొనుచు రాహు కేతువులు పరుగిడుచువచ్చి, యనేకవిధముల సూర్యచంద్రులను వేడుకొన నవకాశములేదని చెప్పుటయేగాక యితరులకు రెండేసి గృహముల నిచ్చి తా మిరువురును ఒక్కొక్క గృహమునేయాక్రమించుకొంటిమని యానతిచ్చిరి. అప్పటికిని వీరు వదలక రవిచంద్రులను పట్టుకొని యనేకవిధముల బ్రతిమాలుకొన, తుదకు కాళ్ళబడ్డబాము కరవకమానదనియు, రాహువు తన పట్టువదలడనియు, ననుగ్రహముతో సూర్యుడు తనగృహమునే రాహువున కిచ్చెను. ఇది చూచి చంద్రుడు గూడ తన గృహమైన కర్కాటకమునుగూడ రాహువును వాడుకొమ్మని యనుగ్రహించెను. పొరుగువారైన బుధశుక్రులు గూడ కన్యా

వృషభముల నిచ్చిరి. వారిప్రక్కనుండు బృహస్పతిగూడ సదయుడై రాహువునకు మీనమొసంగెను. రొట్టెలమ్మువాని కన్న ముక్కలవాడే మెరుగన్నట్లు రాహువునకు సింహము, వృషభము, కన్య, కటకము, మీనము, యీ 5 గృహముల లో స్వాతంత్ర్యము కలిగెను. అనగా యీ 5 గృహములలో నుండు రాహువు శుభఫలము నిచ్చును.

అంతట తనస్వభావమున కేతువు రాహువుయొక్క సప్తమస్థానములలో నుండవలసివచ్చెను. కాని శనిమాత్రము తనస్వగృహములగు మకరకుంభములలో కొంచమైనను జోటు నివ్వలేదు గనుక మకరకుంభములలోనుండు రాహువు స్వతంత్రముగా శుభఫలము నివ్వజాలడు.

## శీర్షోదయ పృష్ఠోదయరాశులు

మిథునము, సింహము, కన్య, తుల, వృశ్చికము, కుంభము, యీ 6 రాసులు శీర్షోదయరాసులు. మేషము వృషభము, కర్కాటకము, ధనుస్సు, మకరము, యీ 5. దున్ను పృష్ఠోదయరాసులు; మీనము, ఉభయోదయరాసి.

శ్లో. శీర్షోదయగాః ఖేటః పాకాదౌ ఫలదోభవేత్ ।
పృష్ఠోదయస్థ పాకాంతే సదాచోభయరాశిగః.

శీర్షోదయరాశియందలి గ్రహముదశాదియందు ఫలము నిచ్చును. పృష్ఠోదయరాశియందున్న గ్రహము దశాంతమందు ఫలము నిచ్చును. ఉభయోదయరాశియందలి గ్రహము సర్వ కాలములయందును ఫలము నిచ్చును.

## గ్రహములయొక్క అవస్థలు

శ్లో. దీప్తస్స్వస్థస్సముదితశ్శాంతశ్శక్తః ప్రపీడితః
దీనఃఖలస్తువికలో భీతోవస్థాదశక్రమాత్.

తా. దీప్తావస్థ స్వస్థావస్థ ముదితావస్థ శాంతావస్థ శక్తావస్థ పీడితావస్థ దీనావస్థ ఖలావస్థ వికలావస్థ భీతావస్థ యని గ్రహములకు పదియవస్థలుగలవు.

శ్లో. స్వోచ్చత్రికోణోపగతః ప్రదీప్తస్స్వస్థస్స్వగేహే ముదితస్సుహృద్భేశాంతస్తు సౌమ్యగ్రహవర్గయాతః శక్తోతిశుద్ధ స్ఫుటరశ్మిజాలైః గ్రహాభిభూత స్త్వతిపీడితస్స్యాదరాతిరాశ్యంశ గతోతిదీనః ఖలస్తుపాపగ్రహవర్గయోగాన్నీ చేతిభీతో వికలో స్తయాతః॥

తా. స్వోచ్చమూలత్రికోణములయందున్న గ్రహము దీప్తావస్థను పొందును. ఇది వాహనము ఐశ్వర్యము రాజపూజ్యత గౌరవము ఆయుర్దాయము నిచ్చును.

2. స్వక్షేత్రమందున్న గ్రహము స్వస్థావస్థను పొందును. ఇది ఖ్యాతి సుఖము విద్య సంతానము ధనము నిచ్చును.

3. మిత్రక్షేత్రమందున్న గ్రహము ముదితావస్థను పొందును. ఇదిసంగీతసాహిత్యపుత్ర సంతోషాతిశయములనిచ్చును.

4. శుభగ్రహములయొక్క వర్గులయందున్న గ్రహము శాంతావస్థను పొందును. ఇది శాంతము వినయము విద్యా సంపత్తుల నిచ్చును.

5. వక్రించియుండు గ్రహము శక్తావస్థను పొందును. శుభగ్రహము వక్రించియున్నప్పుడు శుభఫలమును పాపగ్రహము వక్రించియున్నప్పుడు పాపఫలమును ఇచ్చును.

6. గ్రహాభిభూతుడు అనగా రాశియొక్క చివర నవాంశయందున్నవాడు పీడావస్థను పొందును. ఇది బంధుమిత్ర విరోధము బంధనము దాస్యము నిచ్చును.

7. శత్రుక్షేత్రమందున్న గ్రహము దీనావస్థను పొందును. శత్రువృద్ధి, రోగము అనాచారము ఇచ్చును.

8. పాపగ్రహవర్గములయందున్న గ్రహ ముఖలావస్థను పొందును. ఇది స్త్రీకలహము నష్టము అశుభమునిచ్చును.

9. నీచయందున్న గ్రహము భీతావస్థనుపొందును. ఇది అశుభము ధననాశనము కలుగచేయును.

10. అస్తంగతమైన గ్రహము వికలావస్థను పొందును. ఇది రోగము శత్రువృద్ధియు నిచ్చును.

గ్రహముల సమయములు

మేషాది జన్మలగ్నమువరకు లెక్కించి, సంఖ్యను కనుగొని, యేగ్రహమునకు సమయము కనుగొనవలెనో, ఆగ్రహముమేషము లగాయతు యెన్నవరాశియందున్నదో ఆసంఖ్యను పై సంఖ్యచేతనుగుణించి, ఆలబ్ధమును, ఆగ్రహముయొక్క దశా సంవత్సర సంఖ్యచేత గుణించి దానిని 27 చేత భాగించగావచ్చిన శేషము సమయమగును.

1. స్థానసమయము:—మంచికుటుంబము సంతానము మర్యాద జయము గొప్పస్థితి కలుగును.

2. వస్త్రధారణసమయము:—రత్నము ధనము అధికారము వస్త్రములు కలుగును.

3. పుండ్రధారణసమయము :—జనప్రియత్వము పరదేశమునందు లాభము పాటుపడుట మర్యాద కలుగును.

4. ఉపదేశసమయము:—భూమి వాహనములాభము సౌఖ్యము గలుగును.

5. శివపూజాసమయము :— భూములయందు ప్రీతి రాజకోపము ధనవ్యయము వ్యాజ్యములు గలుగును.

6. అపోశనసమయము :— ధనము జనప్రియత్వము క్రూరుల కిష్టుడునగును.

7. విష్ణ్వర్చనసమయము:—పిత్తముదుఃఖము విద్యాప్రావీణ్యము గలుగును.

9. విప్రారాధనసమయము:—భాగ్యము భూములలో లాభము శత్రువులకపజయముధనవంతులగుబంధువులుకలుగును.

10. నమస్కారసమయము:—మృదువాక్కు మంచి వాహనము ఉభయపక్షవాది అగును.

11. అద్రిప్రదక్షిణసమయము:—పైత్యరోగము అతిసారము మేజస్ట్రీటు కేసులు జరిమానాలు గలుగును.

12. వైశ్యదేవసమయము:— రాచకార్యములయందధికారమునుంచి కుటుంబము దినదినవర్ధమానజీవనము గలుగును.

12. అతిథిసత్కారసమయము:— మోసము గారడి విద్య నిధి లాభము కలుగును.

13. భోజనసమయము:—మోసగాడు రోగిష్ఠి కుల భ్రష్టుడు నగును.

14. అంభఃపానసమయము:— చెడుభోజనము నీచ కృత్యము కలుగును.

15, అహంకారసమయము:—జనవిరోధి అన్నియు తనకే తెలియుననుట గలుగును.

16. తాంబూలసమయము:— గొప్పఉద్యోగము విద్యా ప్రావీణ్యత విశేష ధనముఖ్యాతి గలుగును.

17. నృపాలాపసమయము:— మర్యాద గంగిగోవు దైవగుణానుభవము గలుగును.

18. కిరీటధారణసమయము:—గొప్పసేనాధికారి విద్యా ప్రావీణ్యత ధనము గలుగును.

19. ఏకాంతసంభాషణసమయము:—సోమరి మృదు వాక్కు ఉభయపక్షవాదియు నగును.

20. ఆలస్యసమయము:— విద్యాధిక్యము సోమరి మాంద్యము అజాగ్రత గలుగును.

21. శయనసమయము:—అతికోపము రోగము కుటుంబముతో పోట్లాటయు గలుగును.

22. అమృతపానసమయము:—అవివేకము స్నేహితు లకు కీడుచేయుట పెద్దలను దూషించుటవినాశనము కలుగును.

23. మధుపానసమయము:—ఆరోగ్యము మంచి సంతానము, చక్కనిభార్య బంధువులతో మర్యాద మృష్టాన్నము కలుగును.

24. ధనార్జనసమయము:—మర్యాద విశేష ధనలాభము కార్యధురంధరత్వము గలుగును

25. భిక్షాటనసమయము:—కార్యనష్టము దుర్బోధ కలుగును.

26. నిద్రసమయము:— దీర్ఘరోగము రాజకోపము మధుపానము గలుగును.

27. సంభోగసమయము:—నీచస్త్రీలోలత్వము దురాలోచన విచారము కపటము అనుమానము పగదీర్చుకొనుట కలుగును.

గ్రహములకు పడ్బలములు

దిగ్బలము

శ్లో. విలగ్న పాతాళవధూనభోగా
బుధామరేజ్యౌభృగుసూనుచంద్రా
మందోధరాసూనుదివాకరోచే
త్క్రమేణతేదగ్బలశాలినస్యుః.

లగ్నమున బుధగురువులును చతుర్థస్థానమున శుక్ర చంద్రులు సప్తమమున శనియును పదియవస్థానమున నంగార

కుడును సూర్యుకును బలవంతులనియు నీ విధమున నున్న వారు దిగ్బలముగలవారనియు తెలియునది.

## కాలబలము

శ్లో. నిశేందుమందావనిజాః పరేహానిస్వకీయహోరాసమ
మాసవాసరాః । సితాదిపక్షద్వయగాశ్శుభాశుభాబుధ
స్సదాకాలజవీర్యశాలిన.

శనికుజచంద్రులు ముగ్గురును రాత్రికాలమున బలవంతులనియు రవిగురుశుక్రులు పగటియందు బలవంతులనియు బుధుడు రాత్రి-బవళులను భేదములేక సర్వకాలమును బలవంతుడనియు శుక్లపక్షమున శుభగ్రహములును కృష్ణపక్షమున పాపులును, బలవంతులనియు అబ్ద్యోహోరా సం॥ర మాస వాసరములయందు అబ్ద్యోహోరాధిపతులు బలవంతులనియు తాత్పర్యము.

## స్థానబలము.

శ్లో. స్వోచ్చత్రికోణస్వసుహృద్దృగాణరాశ్యంశవైశేషికవర్గవంతః
ఆరోహవీర్యాధికబిందుకాస్తేఖేచారిణస్థానబలాధికాస్స్యుః

ఉచ్చ మూలత్రికోణము స్వక్షేత్రము మిత్రద్రేక్కాణము వైశేషికాంశ అను వర్గములుగలవారును నీచనుండి తమ యుచ్చస్థానమువరకు బోవువారును అనగా ఆరోహణగ్రహములును అధికవీర్యముగలవారును అష్టకవర్గులోని యధిక బిందువులు గలవారును స్థానబలాధికులని తాత్పర్యము.

## దృగ్బలము.

శుభగ్రహముల వీక్షణము గలుగుటయే దృగ్బలము.

## చేష్టాబలము.

రవిచంద్రులు ఉత్తరాయణమునందు బలముగలవారు తక్కుంగల 5 గ్రహములు వక్రించినపుడును గ్రహయుద్ధమందు సూర్యసిద్ధాంతప్రకారము గెలిచినపుడును మరియును పూర్ణచంద్రునితో గూడినపుడును చేష్టాబలము గలవారగును.

## నైసర్గికబలము

ద్వాదశభావములయందును సూర్యుడు పూర్ణబలవంతుడు; చంద్రుడు ముప్పాతిక బలవంతుడు; రాహుకేతువులు శుభగ్రహసంబంధమున బలవంతులు ఈగ్రహములు "శత్రునీచ పరమనీచక్షేత్రములయందుండునపుడు తగినభావఫలము నెరుంగ వలయును" గురుబుధశుక్రులర్ధబలవంతులు శనికుజులు పాతిక బలవంతులు ఈషడ్బలసాధనము సిద్ధాంతభాగరీత్యా మిక్కిలి వివరముగా మూడవభాగమునందు వ్రాయబడును.

## అష్టక వర్గాధ్యాయము.

జననకాలమందు సూర్యాదిసప్తగ్రహములును, లగ్నములు యీ యెనిమిదియు యేయే రాశియందుండునో, ఆయా రాశి మొదలుకొని చారవశంబున రాసులయందు సంచరించుచున్న నొక్కొక్క గ్రహముయొక్క శుభాశుభ ఫలములను నీ యధ్యాయమున వివరింపబడును.

## సూర్యాష్టకవర్గ.

జన్మకాలముననే గ్రహము యే రాశియందుండునో, యా గ్రహమున కారాశి స్వస్థానమని యీ యధ్యాయమునం దూహింపవలయును.

సూర్యుడు జన్మకాలమున దానున్న

రాశిమొదలుకొని 1,2,4,7,8,9,10,11 స్థానములలో శుభుడు.
అంగారకుడున్న రాశిమొదలు 1,2,4,7,8,9,10,11 ,,
శనియున్నరాశిమొదలు 1, 2, 4, 7, 8, 9, 10, 11 ,,
శుక్రుడున్న రాశిమొదలు 6, 7, 12 ,,
గురుడున్న రాశిమొదలు 5, 6, 9, 11 ,,
చంద్రుడున్న రాశిమొదలు 3, 6, 10, 11 ,,
బుధుడున్న రాశిమొదలు 3, 5, 6, 9, 10, 11, 12 ,,
లగ్నము మొదలు 3, 4, 6, 10, 11, 12 ,,

## చంద్రాష్టకవర్గ.

చంద్రుడు లగ్నము మొదలు 3, 6, 10, 11 ,,
కుజుని రాశిమొదలు 2, 3, 5, 6, 9, 10, 11 ,,
తానున్నరాశిమొదలు 1, 3, 6, 7, 10, 11 ,,
రవి రాశిమొదలు 3, 6, 7, 8, 10, 11 ,,
శని రాశిమొదలు 3, 5, 6, 11 ,,
బుధుని రాశిమొదలు 1, 3, 4, 5, 7, 8, 10, 11 ,,

గురుడున్న రాశిమొదలు 1, 4, 7, 8, 10, 11, 12 ,,
శుక్రుని రాశిమొదలు 3, 4, 5, 7, 9, 10, 11 ,,

## కుజాష్టకవర్గ

కుజుడు సూర్యునిరాశిమొదలు 3, 5, 6, 10, 11 ,,
లగ్నరాశిమొదలు 1, 3, 6, 10, 11 ,,
చంద్రుని రాశిమొదలు 3, 6, 11 ,,
తానున్న రాశిమొదలు 1, 2, 4, 7, 8, 10, 11 ,,
శని స్థానముమొదలు 1, 4, 7, 8, 9, 10, 11 ,,
బుధుని రాశిమొదలు 3, 5, 6, 11 ,,
శుక్రుని రాశిమొదలు 6, 8, 11, 12 ,,
గురుని రాశిమొదలు 6, 10, 11, 12 ,,

## బుధాష్టకవర్గ

బుధుడు శుక్రునిరాశిమొదలు 1,2,3,4,5,8,9,11 ,,
శనిరాశిమొదలు 1, 2, 4, 7, 8, 9, 10, 11 ,,
గురువున్న రాశిమొదలు 6, 8, 11, 12 ,,
సూర్యునిరాశిమొదలు 5, 6, 9, 11, 12 ,,
తానున్నరాశిమొదలు 2, 3, 5, 6, 9, 10, 11, 12 ,,
చంద్రునిరాశిమొదలు 2, 4, 6, 8, 10, 11 ,,
లగ్నమునకు 1, 2, 4, 6, 8, 10, 11 ,,
కుజునిరాశిమొదలు 1, 2, 4, 7, 8, 9, 10, 11 ,,

## గు ర్వ ష్ట క వ ర్గ

గురువు కుజునిరాశి మొదలు 1, 2, 4, 7, 8, 10, 11 ,,
తానున్న రాశి మొదలు 1, 2, 3, 4, 7, 8, 10, 11 ,,
సూర్యుడున్న రాశి మొదలు 1, 2, 3, 4, 7, 8, 9, 10, 11 ,,
శుక్రుని రాశి మొదలు 2, 5, 7, 9, 10, 11 ,,
చంద్రుని రాశి మొదలు 2, 5, 7, 9, 11 ,,
శనియున్న రాశి మొదలు 3, 5, 6, 12 ,,
బుధుని రాశి మొదలు 1, 2, 4, 5, 6, 9, 10, 11 ,,
లగ్నము మొదలు 1, 2, 4, 5, 7, 9, 10, 11 ,,

## శు క్రా ష్ట క వ ర్గ

శుక్రుడు లగ్నము మొదలు 1, 2, 3, 4, 5, 8, 9, 11 ,,
చంద్రుని రాశి మొదలు 1, 2, 3, 4, 5, 8, 9, 11, 12 ,,
తానున్న రాశి మొదలు 1, 2, 3, 4, 5, 8, 9, 10, 11 ,,
శని రాశి మొదలు 3, 4, 5, 8, 9, 10, 11 ,,
సూర్యుని రాశి మొదలు 8, 11, 12 ,,
గురుని రాశి మొదలు 5, 8, 9, 10, 11 ,,
బుధుని రాశి మొదలు 3, 5, 6, 9, 11 ,,
కుజుని రాశి మొదలు 3, 5, 6, 9, 11, 12 ,,

## శ న్య ష్ట క వ ర్గ

శని తానున్న రాశి మొదలు 3, 5, 6, 12 ,,
కుజుని రాశి మొదలు 5, 6, 10, 11, 12 ,,

సూర్యుని రాశిమొదలు 1, 2, 4, 7, 8, 10, 11 ,,
లగ్నము మొదలు 1, 3, 4, 6, 10, 11 ,,
బుధుని రాశిమొదలు 6, 8, 9, 10, 11, 12 ,,
చంద్రుని రాశిమొదలు 3, 6, 11 ,,
శుక్రుని రాశిమొదలు 5, 6, 11, 12 ,,

ఈ అష్టకవర్గు యీ క్రిందిజాతకమునిూద పనిచేసి గ్రహములయొక్క బలాబలములను విచారింతము. ఖరనామ సం॥ర ఆశ్వయుజ శుద్ధ చతుర్దశి శుక్రవారము రాత్రి ఘ 13-45 విఘడియలకు రేవతీనక్షత్ర ప్రథమచరణ మిథునలగ్నమందు జననం.

జననకాలబుధమహాదశ శేషం 14 సం॥ 0 మా॥ 28 రోజుల

| | | | |
|---|---|---|---|
| చం | | రా | ల |
| గు | రాశి | | |
| | | | |
| | కే | రశు | బు కు. శ |

మొత్తము రవియొక్క బిందువులు 48

| | | | |
|---|---|---|---|
| oo<br>oo | ooo<br>oo | ooo<br>ooo | ooo<br>oo |
| o | రవ్యష్టకవర్గు | | oo<br>oo |
| oo<br>o | | | ooo<br>o |
| oo<br>oo | oo<br>o | oo<br>oo | ooo<br>oo |

మొత్తం చంద్రునియొక్క బిందువులు 49

| | | | |
|---|---|---|---|
| oo<br>oo | oo<br>oo | oo<br>oo | oo<br>o |
| oo<br>oo | చంద్రాష్టకవర్గు | | ooo<br>oo |
| ooo<br>ooo | | | ooo<br>oo |
| ooo<br>oo | o | ooo<br>oo | ooo |

| | | | |
|---|---|---|---|
| ○○○<br>○○ | ○○<br>○ | ○○<br>○○ | ○○<br>○ |
| ○○○ | కుజాష్టకవర్గ | | ○○○<br>○○ |
| ○○<br>○ | | | ○○<br>○ |
| ○○<br>○○ | ○○<br>○ | ○ | ○○<br>○ |

కుజునియొక్క బిందువులు 39

| | | | |
|---|---|---|---|
| ○○○ | ○○<br>○○ | ○○<br>○○ | ○○○<br>○○○ |
| ○○○ | బుధాష్టకవర్గ | | ○○○<br>○○ |
| ○○○<br>○ | | | ○○○<br>○ |
| ○○○<br>○○ | ○○<br>○ | ○○<br>○○ | ○○○○<br>○○ |

బుధునియొక్క బిందువులు 54

| | | | |
|---|---|---|---|
| ○○<br>○○ | ○○○<br>○○ | ○○○ | ○○○<br>○○ |
| ○○○<br>○○ | గుర్వష్టకవర్గ | | ○○○<br>○○○ |
| ○○<br>○○ | | | ○○<br>○○ |
| ○○○<br>○○ | ○○○<br>○○○ | ○○<br>○○ | ○○○<br>○○ |

గురునియొక్క బిందువులు 56

శుక్రునియొక్క బిందువులు 52

| | | | |
|---|---|---|---|
| 00 | 000 | 0000<br>00 | 0000<br>0 |
| 00<br>000 | | | 00<br>000 |
| 000<br>000 | శుక్రాష్టక వర్గము | | 00<br>00 |
| 00<br>0 | 000<br>000 | 00<br>00 | 00<br>0 |

శనియొక్క బిందువులు 39

| | | | |
|---|---|---|---|
| 00 | 000 | 00<br>0 | 00<br>00 |
| 00<br>00 | | | 000<br>00 |
| 000<br>00 | శన్యష్టక వర్గ | | 0000<br>000 |
| 0 | 00<br>00 | 0 | 00 |

సముదాయాష్టకవర్గు

| | మే | వృ | మి | క | సిం | క | తు | వృ | ధ | మ | కుం | మీ | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ర | 5 | 6 | 5 | 5 | 4 | 4 | 4 | 3 | 4 | 3 | 1 | 4 | 48 |
| చం | 4 | 4 | 3 | 5 | 5 | 3 | 1 | 5 | 5 | 6 | 4 | 4 | 49 |
| శు | 3 | 3 | 3 | 5 | 4 | 3 | 1 | 3 | 4 | 3 | 2 | 5 | 39 |
| బు | 4 | 4 | 7 | 5 | 4 | 6 | 4 | 3 | 5 | 5 | 3 | 4 | 54 |
| గు | 5 | 3 | 5 | 6 | 4 | 5 | 4 | 6 | 5 | 4 | 5 | 4 | 56 |
| శు | 3 | 6 | 5 | 5 | 4 | 3 | 4 | 6 | 3 | 6 | 5 | 2 | 52 |
| శ | 3 | 3 | 4 | 5 | 6 | 2 | 1 | 4 | 1 | | | 2 | 39 |
| | 27 | 29 | 32 | 36 | 31 | 26 | 19 | 30 | 27 | 32 | 23 | 25 | 337 |

మొత్తము సముదాయాష్టక బిందువులు—337

## అ ష్ట మ వ ర్గ చే యు వి ధ ము.

రాశిచక్రమునందు జన్మకాలగ్రహస్థితిని ఏర్పరచుకొని పైనవ్రాసిన సూర్యాద్యష్టకవర్గులలో వ్రాసిన అంకెలయొక్క గుర్తుననుసరించి ఆయాగ్రహములులగాయితు అన్నిటికినిబిందువులు ఏర్పరచుకొనవలెను. ఈప్రకారముగాబిందువుల నేర్పరచగా 1. సూర్యాష్టకవర్గు 2. చంద్రాష్టకవర్గు 3. కుజాష్టకవర్గు 4. బుధాష్టకవర్గు 5. గుర్వష్టకవర్గు 6. శుక్రాష్టకవర్గు 7. శన్యష్టకవర్గు అని 7 వర్గులు వేర్వేరుగా ఏర్పడును. అటుపిమ్మట మేషాదిమీనపర్యంతము 12 రాసులలోను ఒక్కొక్కరాశిలో నెన్నెన్నిబిందువులు వచ్చునో యేర్పఱచుకొనవలెను.

## ఉ దా హ ర ణ ము.

ఈపైన మిథునలగ్న జాతకమువ్రాయబడినది. ఈజాతకములో రవి తులయందున్నాడు గనుక యీరవిలగాయితు బిందువులను లెక్కపెట్టవలెను. సూర్యాష్టకవర్గులోసూర్యుడు జన్మకాలమున తానున్నరాశిమొదలుకొని 1, 2, 4, 7, 8, 9, 10, 11 అని అంకెలు వ్రాయబడియున్నవి. అనగా యీజాతకములో తులయందున్న వ్రాయబడియున్నవి. అనగా యీజాతకములో తులయందున్న రవిలగాయితుయీపై అంకెలయొక్క గుర్తుప్రకారము తులయందున్ను వృశ్చికమందున్ను మకరమందున్ను మేషమందున్ను వృషభమందున్ను మిథునమందున్ను కర్కటకమందున్ను సింహమందును యీ 8 రాసులలోను అంకెలు చెప్పబడియున్నవి గనుక ఆయా యంకెలప్రకారము

ఒకొక్కబిందువు చొ॥న యేర్పఱచుకొనవలయును. ఈ ప్రకారముగా యొకొక్కఅష్టవర్గునకు 8 పర్యాయముల చొ॥న రవిలగాయతు శనిఆఖరువరకు 7 గ్రహములకు 7 × 8=56 పర్యాయములు లెక్కపెట్టి బిందువుల నేర్పఱచవలయును. ఆప్రకారముగా బిందువులతో 7 వర్గులుగను 7 చక్రములు వేరు వేరుగా ఏర్పడును. మేముపైన ఉదాహరణము వ్రాసినచక్రములు గమనించవలెను అటుపిమ్మట ప్రతివర్గుననుసరించి మేషాదిమీనపర్యంతము మేముపైని ఉదహరించినప్రకారము గ్రహములకు రాసులకు సరిపడుపట్టికను (Table) యేర్పఱచి ఆయారాసులయందువచ్చు బిందువులనువరుసగా వేయువలెను. అట్లుపూర్తిగా బిందువుల నేర్పఱచినతరువాత రెండువైపుల నుంచియు బిందువులనుకూడగా 337 బిందువులగును. ఏరాశి యందు బిందువు లెక్కువగానుండునో ఆభావము మిక్కిలి బలముగానుండును. ఈజాతకమునందు కర్కటక రాశియందు 36 బిందువులున్నవి. లగ్నమందు 32 బిందువులున్నవిగనుక తనుభావము ధనభావము మిక్కిలి బలముగానున్నవని చెప్ప వలెను. 25 బిందువులకు తక్కువగానున్న రాశికి బలములేదు. ముప్పదిగాని ముప్పదికంటె యెక్కువబిందువు లున్నయెడల పూర్తిగా ఆయుర్భాగ్యములుగలవాడు అగును.

## గ్రహబలములు.

శ్లో. బింద్వష్టకంతుయద్రాశౌ తద్భావేపుష్టిమాదిశేత్
శుభంవట్సప్తసహితం పంచకించిత్సుభంస్మృతం.

చతుష్కే సమతాజ్ఞేయా నశుభాహీనబిందవః ।
బింద్వభావే భావనాశో విజ్ఞాతవ్యోమనీషిభిః.

8 బిందువులుగల గ్రహము సంపూర్ణ ఫలమునిచ్చును. 7, లేక 6, బిందువులుగల గ్రహము, శుభ ఫలముల నిచ్చును 5 బిందువులుగల గ్రహము మిశ్రమఫలము నిచ్చును. 4 కంటె తక్కువగానున్న యెడల చెడుఫలమునిచ్చును. ఒక్కబిందువైన ను లేనియెడల ఆభావమున్ను ఆభావమందున్న గ్రహమున్ను పూర్ణముగా చెడిపోవును.

శ్లో. బింద్వేకత్వే మహారోగోమనస్తాపోద్విబిందుకే
త్రిబిందుకే ప్రవాసస్తు చతుష్కేతు క్వచిద్ధనం
పంచబిందుసమాయోగే శుభంస్యాద్యోగ్యతాధికం
బిందుషట్కేమహత్సౌఖ్యం సౌభాగ్యం సప్తబిందుకే
బిన్వష్టకేతుసామ్రాజ్యంపూర్ణం భావఫలం స్మృతం
శుభంవాప్యశుభంవాపిరాశిభావానుసారతః.

1 బిందువున్నయెడల మహారోగము 2 బిందువులవల్ల మనస్తాపము 3 ప్రవాసము 4 స్వల్పధనము 5 సౌఖ్యమున్ను మంచియోగ్యతయు, 6 మిక్కిలిసౌఖ్యము 7 సౌభాగ్యము 8 ప్రభుత్వమును ఇచ్చును. ఏ గ్రహమునకు మునకు బిందువులు కావలెనో ఆయాఅష్టకవర్గులో ఆగ్రహమున్న భావమందు ఎన్ని బిందువులున్నవో ఆ బిందువులే ఆ గ్రహముయొక్క బిందువులని

తెలుసుకొనవలెను. యీపైనవ్రాసిన జాతకములో రవి కెన్ని బిందువులు వచ్చినవో కనుగొందము. రవి తులారాశియందున్నాడు రవ్యష్టకవర్గులో యీ రవియున్నచోట అనగా తులయందు 4 బిందువులు మాత్రమే వచ్చినవి. శుక్రునకు శుక్రాష్టకవర్గులో తులయందున్న శుక్రునకుగూడ 4 బిందువులే వచ్చినవి. గనుక, రవిశుక్రులు సమానఫలము నిచ్చెదరు అనగా కొంచెము శుభఫలమునిచ్చును.

ఏమహాదశయొక్క వర్తమానఫలము మనకు కావలయునో ఆగ్రహముయొక్కదశకు బిందువులుస్వల్పముగా నున్నయెడల మహాదశలో చెడుఫలమును 4 కంటె అధికముగా నున్నయెడల శుభఫలమును చెప్పవలెను ఈఉదాహరణ జాతకమునందు వర్తమానమున శుక్రమహాదశయే జరుగుచున్నది. యీశుక్రునకు 4 బిందువులుమాత్రమున్నవి. గనుక యీశుక్రమహాదశలో స్వల్పధనమును మాత్రమిచ్చును యీ జాతకములో బుధాష్టకవర్గులో బుధునకు 6 బిందువులు వచ్చినవి గనుక బుధమహాదశలోను, బుధునియొక్క అంతర్దశలోను, పూర్తిగా మంచిఫలమునిచ్చుచుండును అదిగాక గోచారవశంబున ఆ యాగ్రహము ఆయారాసులకు వచ్చినప్పుడు అనగా బిందువులు విశేషముగానున్నరాశియందున్నపుడు మంచిఫలమును, తదితరచోట్ల చెడుఫలమును ఇచ్చుచుండును. వీని

కావల త్రికోణాధిపత్యశోధనయు నేకాధిపత్యశోధనయుగూడ గలవు వీనిని గురించి వివరముగా మూడవభాగమునందు వ్రాయబడును.

## గ్రహస్ఫుటముచేయువిధము.

ఇదిస్థూలమార్గముచేతను, సూక్ష్మమార్గము చేతను రెండువిధములుగా చేయవచ్చును. సిద్ధాంతశాస్త్రప్రకారము, పంచాఙ్గముగొక్క అవసరములేకయే గ్రహములను స్ఫుట ముచేయుట సూక్ష్మమార్గమనబడును; ఇది మిక్కిలి కష్టముగా నుండును పంచాఙ్గరీత్యాల సహాయముచేత గ్రహస్ఫుటము చేయువిధము స్థూలమార్గమనబడును. ఈ రెంటికిని భేదము బహుస్వల్పముగా నుండును. అనగా లిప్తలు మాత్రము భేదించును. జాతకభాగమునకు స్థూలమార్గముచేత పంచాఙ్గ రీత్యాగ్రహస్ఫుటము చేసినచాలును కనుక స్థూలమార్గము చేత గ్రహస్ఫుటము చేయుపద్ధతి దిగువ వ్రాయుచున్నాము. ముందుగా దీనికి కావలసినమానమును వ్రాయుచున్నాను.

రాశి 1కి 30 భాగలు, 9 పాదములు.

భాగ 1కి 60 లిప్తలు.

రాశి 1కి 9 పాదములు=30 భాగములు=1800 లిప్తలు.

4 పాదములకు 13; 13-భాగలు 800 లిప్తలు

1 పాదమునకు=3, 1/3 భాగలు=200 లిప్తలు.

12 రాసులు=60 ఘడియలు=360 భాగలు

1 ఘడియకు 6 భాగలు. !

## గ్ర హ స్ఫు ట ము.

మనము యేదినమున, యేవేళకు, నేగ్రహమును, స్ఫుటముచేయవలెనో, ఆకాలమునకు, ఆగ్రహము, అశ్వని మొదలు యెన్నవ నక్షత్రమందుండునో ఆ నక్షత్రముగాక తక్కిన నక్షత్రములను అశ్వని మొదలుకొని లెక్కపెట్టి ఆ సంఖ్యను 4 చేతగుణించగా పాదములగును, ఆపాదములను 9 చేతభాగించగా వచ్చినలబ్ధము రాసులగును. మిగిలిన పాదములను భాగలలోనికి మార్చుకొనవలెను. పాదం 1కి 3, 1/3 భాగలు అనగా 3 భాగల 20 లిప్తలు; గనుక యీప్రకారముగా, శేషించిన పాదముల నన్నిటిని భాగలలోనికి, లిప్తలలోనికిని, మార్చుకొనవలెను. ఈప్రకారముచేయగా మొట్టమొదట రాసులు, తరువాత భాగలు, అటుపిమ్మట లిప్తలుయేర్పడును. ఈ 3 న్నూ వరుసగా నొకచోట వ్రాసికొని యుంచుకొనవలెను. అటుపిమ్మట పైనవ్రాసినగ్రహము అప్పుడు యేనక్షత్రమందున్నదో ఆనక్షత్రమందు ఆగ్రహము యేరోజున ప్రవేశించినదో ఆప్ర

వేశించిన ఘడియలు మొదలుకొని తిరుగా నాగ్రహము దాని పై నక్షత్రమందు యెప్పుడు ప్రవేశించునో, యీ రెండింటిమధ్య ను యెన్ని దినములు, యెన్ని ఘడియలు, యెన్ని విఘడియలు అగునో ఆమొత్తమును ఆగ్రహముయొక్క ఋక్షాద్యంతము గా తెలుసుకొనవలెను. దీనికి ప్రమాణముగ గూడ సంజ్ఞవ్రాసి కొనవలెను.

అటుపిమ్మట ఆగ్రహము, ఆనక్షత్రమందు, ప్రవేశించి నది మొదలు జాతకునియొక్క జననకాలఘడియలవరకు యెన్ని దినములు యెన్ని ఘడియలువచ్చునో అదియొకచోట వేరుగా నుంచుకొనవలెను. దానికి భుక్తి యని పేరు. అటు తరువాత పై నవ్రాసిన ఋక్షాద్యంతమున్నూ తరువాత వ్రాసినభుక్తినిన్నీ దేనికదివేరువేరుగా విఘడియలలోనికి మార్చుకొనవలెను. అట్లు మార్చుకొని భుక్తియొక్క విఘడియలను 800 చేత గుణించి ఋక్షాద్యంతము యొక్క విఘడియలచేత భాగించినయెడల ఆవచ్చినలబ్ధము లిప్తలగును. ఆలిప్తలను 60 చేత భాగించగా వచ్చినలబ్ధము, భాగలును, ఆశేషము లిప్తలును అగును. అటుపిమ్మట మొట్టమొదట మనము వ్రాసియుంచుకొనిన రాసులు, భాగలు, లిప్తలలో యిప్పుడు వచ్చినభాగలు, లిప్తలు దేనికది సరిగా కూడవలెను. దీనికే రాశ్యాదిగ్రహస్ఫుటమని పేరు. గ్రహస్ఫుటమనగా ఆగ్రహము జననకాలమునకు ఆరా శిలో యెన్నవభాగయందున్నదో అది సరిగా కనుగొనుటయే

గ్రహస్ఫుటమని పేరు. వక్రించిన గ్రహమునకు వక్రగతి మొదలు ఋజుగతి వరకు తీసివేయవలెను.

గ్రహస్ఫుటమునకు ఉదాహరణము.

బ్రహ్మశ్రీ పిడపర్తి పెదపూర్ణయ్యసిద్ధాంతిగారి పంచాంగరీత్యా యీదుందుభినామ సం॥ర చైత్రశుద్ధపంచమి ఆదివారంరోజున సూర్యోదయాది ఘు ॥-33 విఘుడియలకు ఒక జాతకునియొక్క జననము. ఈ జననకాలఘుడియలకు రవియొక్క గ్రహస్ఫుటమును చేయుచున్నాము. అనగా యీజనన కాలఘుడియలకు రవి యేరాశియందు యెన్నవభాగియందుండెనో అది కనుగొనుచున్నాము. పైనవ్రాసిన పంచాంగమును బట్టి అప్పుడు రవి రేవతీనక్షత్రమందుండెను. మొట్టమొదట వ్రాసిన ప్రకారము అశ్వినిలగాయతు యీరేవతీనక్షత్రమువరకు అనగా ఉత్తరాభాద్రానక్షత్రము ఆఖరువరకు లెక్కపెట్టగా 26 నక్షత్రములయినవి. నక్షత్రము 1 కి 4 పాదములు చొ॥ యీ 26 నక్షత్రములకు 26 × 4=104 పాదములు వచ్చినవి. వీనిని రాసులలోనికిమార్చగా అనగా 9 చేతభాగించగా 11 రాసులు 5 పాదములు అగును. ఈ 5 పాదములను భాగలలోనికి మార్చవలెను. పాదము 1కి 3⅓ భాగములు అవగా 3 భాగల 20 లిప్తలు గనుక 5 పాదములకు 16 భాగల 40 లిప్తలు వచ్చినవి. పైనవచ్చిన 11 రాసులున్ను యిప్పుడు వచ్చిన

16 భాగల 40 లిప్తలున్ను కలిసి 11 రాసుల 16 భాగల 40 లిప్తలు అయినవి. ఇవి వేరుగా నొకచోట నుంచుకొనవలెను.

ఇప్పటికి ఉత్తరభాద్రానక్షత్రము ఆఖరువరకు యీ రవికి 11 రాసుల 16 భాగల 40 లిప్తలు గతించినవి ఇక రేవతీనక్షత్రమందు యీజననకాల ఘడియలకు రవి సంచారములో ఎన్నిభాగములు ఎన్నిలిప్తలు గతించినవో కనుగొనవలెను. పైన వ్రాసిన పంచాగమునుబట్టి యీరవి చైత్ర శుద్ధ విదియాగురువారం రోజున ఘ 46-5 విఘడియలకు రేవతీనక్షత్ర ప్రథమపాదమందు ప్రవేశించెను. అనగా ఆరోజున రేవతీ 1 అర్క ఘ46-5 అని వ్రాయబడియున్నది. తిరుగా యీరవి యీచైత్ర బహుళపదియ గురువారంరోజున సూర్యోదయాది 20 ఘడియల 14 విఘడియలకు అశ్విని నక్షత్రప్రథమపాదమందు ప్రవేశించెను. ఈరవి రేవతీనక్షత్రమందు ప్రవేశించినది. లగాయతు అశ్వినీనక్షత్రమందు ప్రవేశించువరకు యీ 2 రోజుల మధ్యను ఉన్నరోజులు ఘడియలు విఘడియలు లెక్కచూడగా 13 రోజులు 34 ఘడియలు 9 విఘడియలు వచ్చినవి. దీనికి ప్రమాణమని పేరు. ఇక భుక్తిని కనుగొనవలెను. ఈరవి యీరేవతీనక్షత్రమందు ప్రవేశించినది లగాయతు జాతకునియొక్క జననకాలఘడియలవరకు భుక్తిఅయిన

రోజులు ఘడియలు విఘడియలు లెక్కచూడగా 2 రోజులు 23 ఘడియలు 34 విఘడియలు వచ్చినవి. దీనికి భుక్తియనిపేరు. అటుపిమ్మట పైన వ్రాసిన ప్రమాణమును భుక్తిని వేరువేరుగా విఘడియలలోనికి మార్చుకొనవలెను. అట్లు విఘడియలచే యగా ప్రమాణము 48849 విఘడియలును భుక్తి 8614 విఘ డియలును వచ్చినవి. ఈరవి సంచారములో 48849 విఘడియ లకు 4 పాదములు అనగా 800 లిప్తలు గతించినయెడల 8614 విఘడియలకు ఎన్నిలిప్తలు గతించినవో త్రయరాశికమువలన కనుగొనవలెను. అట్లుత్రయరాశికముచేయుటకు భుక్తిని అనగా 8614 విఘడియలను 800 లిప్తలచేత గుణించి, ప్రమాణముచేత అనగా 48849 విఘడియలచేత భాగించవలెను.

8614 విఘడియలు
800 లిప్తలు.

---

48849)6891200(141 లిప్తలు.
48849

---

200630

200630 (బ్రాటోవరు)
195396

52340
43889

3491

ఈ 141 లిప్తలను భాగలలోనికి మార్చగ అనగా 60 చేత భాగించగా 2 భాగల 21 లిప్తలువచ్చినవి. అనగా యీ రవి రేవతీనక్షత్రమందు ప్రవేశించినది లగాయతు జననకాల ఘడియలవరకు సంచారముచేయగా 2 భాగల 21 లిప్తలు అయినవి అని యర్థము. మొట్టమొదట మనము వ్రాసియుంచు కొనిన ప్రకారము అశ్వనిలగాయతు ఉత్తరాభాద్ర ఆఖరువరకు ఈ రవి సంచారముచేయగా గతించిన 11 రాసుల- 16 భాగల 40 లిప్తలలో ఈపైనవచ్చిన 2 భాగల 21 లిప్తలుకలుపవలెను. అట్లుచేయగా 11 రాసులు 19 భాగలు 1 లిప్తవచ్చినది. దీనికే రవిస్ఫుటమనియు స్ఫుటరవిరాస్యాదియనియు పేరు 1 గ్రహా స్ఫుట మెప్పుడును మేషాదిగాలెఖవచ్చుచుండును. గనుక ఈ రవి ఈజాతకునియొక్క జననకాలమునను మేషాది 11 రాసులు

గతించిన 12 వరాశియయిన మీనరాశియందు 19 భాగలు దాటి 20 వ భాగలో 2 వ లిప్తయందున్నాడని యర్థము. దీనికే గ్రహస్ఫుటమనిపేరు. పంచాంగముయొక్క అవసరము లేకయే గ్రహస్ఫుటము చేయుపద్ధతి మరియొకటిగలదు కాని అదిమిక్కిలిక్లిష్టమగుటచేతను చదువరులకు సులభముగా తెలియుటకై ఈప్రకారముగా వ్రాయబడినది. తక్కినగ్రహములను గూడ ఈవిధముగానే స్ఫుటముచేసికొనవచ్చును. ఈ గ్రహస్ఫుటము మిక్కిలి ముఖ్యము. దీనివలననే భావస్ఫుటము, షడ్బలసాధనము, షోడశవర్గు మొదలగునవి. సాధించవలసియున్నది గనుక ఇది మిక్కిలి అవసరము గనుక అన్ని గ్రహములను స్ఫుటముచేసియుంచుకొనవలెను.

అంశచక్రములో లగ్నము నేర్పరచు విధము.

ముందుజన్మలగ్నభుక్తిని కనుగొనవలెను.

జన్మలగ్నప్రమాణమును 9 చే భాగించవలెను. అట్లు భాగించగావచ్చిన విభక్తముచేతను, జన్మలగ్నభుక్తప్రమాణమును భాగించవలెను. అట్లు భాగించగావచ్చిన విభక్తమునొకచోటనుంచుకొనుము. ఈభాగించుటలో శేష మెంతమిగిలినను నదిగూడ యొకటిగా భావించుకొని పై విభక్తములో కలుపుకొనుము. శేషము మిగలని యెడల విభక్తమునే చూచుకొనవలెను.

1. మేష, సింహ, ధనుస్సులలో, నేదిజన్మలగ్నమైనను మేషమునుండియు.

2. వృషభకన్యామకరములలో నేదియైన జన్మలగ్నమైన యెడల మకరమునుండియు.

3. మిథునతులాకుంభములలో నేదయిన జన్మలగ్నమైన యెడల తులనుండియు.

4. కర్కటవృశ్చిక మీనములలో నేదియైన జన్మలగ్నమైనయెడల కర్కటకమునుండియు అంశలగ్నమును ఆ అంకె ప్రకారము సరిగా నేయవలెను.

### పణఫరములు.

జన్మలగ్నమునకు 2, 5, 8, 11 రాసులు పణఫరము లనబడును.

### ఆపోక్లీమములు.

జన్మలగ్నమునకు, 3, 6, 9, 12, రాసులు ఆపోక్లీమము లనబడును.

### ఉపచయములు.

జన్మలగ్నములగాయతు 3, 6, 10, 11 రాసులు ఉపచయములనబడును. ఈస్థానములయందు గ్రహములుండుట మంచిది.

### షోడశవర్గులు.

1. క్షేత్రము 2, హోర, 3, ద్రేక్కాణము, 4, చతుర్థాంశ 5, సప్తమాంశ, 6, నవమాంశ, 7, దశమాంశ 8,

ద్వాదశాంశ, 9, షోడశాంశ 10, వింశాంశ, 11 సిద్ధాంశ 12 భాంశ, 13, త్రింశాంశ, 14, ఖవేదాంశ 15, అక్షవేదాంశ, 16, షష్ట్యంశఅని 16 వర్గులుగలవు. ఇవిగూడ మిక్కిలి ఉప యోగము. దీనిని గురించి మూడవభాగమునందు వివరముగా వ్రాయబడును.

## షష్టాష్టకదోషములు.

సాధారణముగా 2 గ్రహములు షష్టాష్టకములయం దున్నప్పుడు ఒకమహాదశలో మరియొక అంతర్దశవచ్చినప్పుడు ఈరెంటికిని షష్టాష్టకమువచ్చినయెడల అనగా 2 గ్రహములు ఒకదానికొకటి 6, 8 స్థానములయందున్న యెడల ఈఅంతర్దశ శలలో చెడుఫలములనిచ్చును. పాపగ్రహములైనయెడలమిక్కిలి చెడుఫలముల నిచ్చును.

శ్లో. మేషేచకన్యా ధనుషీకఝష్మాౙ్క తౌల్యాతిమిః కుంభభృతం
కుళిరః। సింహేచనక్రోన్మృయుగేచకార్పిః షష్టాష్టకేచా
పిశుభాయుయోగః

అను శ్లోకమునుబట్టి మేషకన్యలు, వృషభధనుస్సులు తులా మీనములు, కుంభకర్కటకములు, సింహమకరములు, మిధునవృశ్చికములు ఈరాసులయందున్న గ్రహములకు అన్యో న్య షష్టాష్టకమున్నప్పటికి యీ అంతర్దశలలో శుభమును ఆయుర్దాయమును ఇచ్చును. తక్కినవాటికి పూర్తిగా షష్టాష్టక దోషములు గలవు.

# తనుభావము

శ్లో. దేహాధీశ శ్శుభై ర్యుక్తో యది కేంద్ర త్రికోణగః
స్వోచ్ఛ స్వక్షేత్ర సంయుక్తో జాతో దీర్ఘాయురుచ్యతే.

లగ్నాధిపతి శుభగ్రహములతో కలసి కేంద్రమందుగాని కోణమందుగాని ఉచ్ఛయందుగాని స్వక్షేత్రమందుగాని బలముగానున్న యెడల అజాతకుడు పూర్ణాయుర్దాయము గలవాడును శరీర సౌఖ్యముగలవాడును భాగ్యవంతుడును యోగ్యుడును అగును.

శ్లో. శుభదృష్టయుతే లగ్నే లగ్నేశే శుభసంయుతే
చంద్రేచ స బలే తస్య తనుసౌఖ్యంవినిర్దిశేత్.

లగ్నమును శుభగ్రహము చూచుచున్నను లగ్నాధిపతి శుభగ్రహముతో కలసినను చంద్రుడు బలవంతుడై యున్నను జాతకుడు దేహసౌఖ్యముగలవాడగును.

శ్లో. లగ్నలగ్నేశచంద్రాణాం శుభత్వే తనుపుష్టిమాన్
సుందరో భోగవాంశ్చైవవర్చస్వ్యవికలోనరః.

లగ్నము, లగ్నాధిపతి, చంద్రుడు, ఇవిమూడున్ను శుభగ్రహముతో కలిసి బలముగానున్న యెడల జాతకుడు బలమైన శరీరముగలవాడును అందమైనవాడును, భోగియును మంచివర్చస్సుగలవాడును అగును.

శ్లో. కేంద్రేత్రికోణేశుభ సంయుతేవా లగ్నాధిపే దేవగు
రౌచ కేంద్రే। సుఖానిభుక్త్వావివిధానిజాతఃపుణ్యైన
జీవేచ్ఛరదాంశతంసః.

లగ్నాధిపతి కేంద్రకోణములయందుండి శుభగ్రహ
ముతో కలసియుండగా గురుడు కేంద్రమందున్న యెడల అట్టి
జాతకుడు సమస్తసౌఖ్యములు అనుభవించి పుణ్యాత్ముడై నూరు
సంవత్సరములు జీవించును.

శ్లో. లగ్నేశుభగ్రహోపేతే లగ్నాత్కేంద్రేశుభాన్వితే
ధర్మకర్మాధిపౌ యుక్తౌజాతస్స్యాద్రాజసన్నిభః.

లగ్నమందు శుభగ్రహముండి లగ్నమున కేంద్రమందు
శుభగ్రహముండి, భాగ్యరాజ్యాధిపతులు కలిసియున్న యెడల
ఆజాతకుడు రాజలక్షణములు గలవాడై రాజసమాను
డగును.

శ్లో. వర్గోత్తమాంశే యది లగ్ననాథే స్వోచ్చాంశగేవా
స్వసుహృద్గ్రహాంశే। శుభాన్వితేవా శుభదృష్టియుక్తే
నరో భవేద్రాజసమానభోగః.

లగ్నాధిపతి, వర్గోత్తమాంశ యందున్నను, తనయొక్క
ఉచ్చాంశయందున్నను, మిత్రాంశయందున్నను, శుభగ్రహ
ముతో కలసినను, శుభగ్రహదృష్టిగలవాడైనను ఆజాతకుడు
రాజతుల్యుడగును.

శ్లో. లగ్నేశే బలసంయుక్తే కేంద్రకోణగతే శుభే
పాపగ్రహైరసందృష్టే దేహసౌఖ్యం వదే ద్బుధః.

లగ్నాధిపతి బలవంతుడై యుండి కేంద్రమందుగాని కోణమందుగాని శుభగ్రహముంచి పాపగ్రహదృష్టి లేనియెడల దేహసౌఖ్యముగలవాడగును.

శ్లో. దేహాధిపతిః పాపయుతః షష్ఠాష్టవ్యయభావగః
దేహసౌఖ్యవిహీనస్స్యా త్తత్ర జాతో నసంశయః.

లగ్నాధిపతి పాపునితో కలసి షష్ఠాష్టమవ్యయస్థానము లందెక్కడనున్నను అట్టి జాతకునకు శరీరసౌఖ్యముండదు.

శ్లో. షష్ఠాష్టవ్యయభావేశా లగ్నస్థాయది తేక్రమాత్
శుభయుక్తేక్షితోభిన్నో బలహీనోపిరోగకృత్.

షష్ఠాష్టమవ్యయస్థానాధిపతులలో నెవరైనను ఒకరు లగ్నమందుండి శుభగ్రహదృష్టి లేనియెడల ఆజాతకుడు బలము లేనివాడును రోగముచే బాధపడువాడును అగును.

శ్లో. లగ్నేశే నీచరాశిస్థే నీచగ్రహసమన్వితే
నీచాంశే పాపవర్గేవా దుశ్శీలో రోగవాన్ భవేత్.

లగ్నాధిపతినీచయందున్నను నీచగ్రహముతో కలిసినను నీచాంశయందున్నను పాపగ్రహవర్గుయందున్నను ఆజాతకుడు దుష్టస్వభావముగలవాడును రోగియును అగును.

శ్లో. లగ్నాధిపోతిబలవాన్ శుభవర్గయుక్తస్సోచ్చేసుహృ
ద్గ్రహయుతస్స్వనవాంశకేవా । లగ్నాధినాధసహితే

యది కేంద్రనాథేనదృష్టాభాగ్యకీర్తిధనధాన్యచిరాయుశ్చేతి.

లగ్నాధిపతి బలవంతుండై శుభవర్గులయందున్నను ఉచ్ఛయందున్నను మిత్రగ్రహముతో కలిసినను స్వనవాంశ యందున్నను లగ్నాధిపతి కేంద్రాధిపతితో కలిసినను అట్టిజాతకుడు మిక్కిలి భాగ్యవంతుడును కీర్తిగలవాడును ధనధాన్య వృద్ధిగలవాడును పూర్ణాయువుగలవాడును అగును.

శ్లో. లగ్నే జలర్క్షే శుభఖేచరేంద్రై ర్యుక్తేంతనుస్థౌల్యము
దాహరంతి। లగ్నాధిపస్తోయఖగో బలాఢ్యస్తా
మ్యాన్వితశ్చేత్తనుపుష్టిమాహుః.

శ్లో. లగ్నాధిపశ్చేజ్జలరాశిసంస్థశ్శుభాన్వితస్తోయఖగేనదృష్టః
లగ్నే శుభక్షేత్రగతేపి చైవంలగ్నేశ్వరస్థాంశపతౌ జలర్క్షే.

లగ్నము జలరాశియైయుండి శుభగ్రహములు లగ్నమందున్నను లగ్నాధిపతి జలరాశియందుండి శుభగ్రహములతో కలిసినను జలగ్రహములచే చూడబడినను లగ్నము శుభక్షేత్రమైనను లగ్నాధిపతియున్న నవాంశాధిపతి జలరాశియందున్నను జాతకుడు స్థూలముగానుండును.

శ్లో. లగ్నేశ్వరేభూమిసుతేతనుస్థే పాపాన్వితేపాపవిలోకితేవా
శిలాప్రహారై ర్వ్రణముత్తమాంగే ఖడ్గాదిభిర్వా కథయంతి
తద్జ్ఞాః.

లగ్నాధిపతి కుజుడై లగ్నమందుండినను పాపగ్రహములతో కలసినను చూడబడినను రాళ్ళచేతను ఖడ్గాదులచేతను వ్రణములచేతను బాధనుపొందును.

శ్లో. పాపై ర్విలగ్నే గుళి కే త్రికోణె లగ్నేహినాథె గుళికేన యుక్తే। లగ్నేశ్వరే పాపయుతేథలగ్నే రాహకాయదాఎం చనచోరభీతిః.

పాపగ్రహము లగ్నమందుండి గుళికుడు త్రికోణముల యందుండుటచేతను లగ్నాధిపతి గుళికునితో కూడినను లగ్నాధిపతి పాపగ్రహములతో కలసినను, వంచకులవల్లను చోరుల వల్లను భయముకలవాడగును.

శ్లో. కేంద్రత్రికోణనిధనేషునయస్యపాపాఃలగ్నాధిపస్సురగురుశ్చ చతుష్టయస్థా, భుక్త్వాసుఖాని వివిధానిసుపుణ్య కర్మాజీవే చ్ఛ వత్సరశతం సవిముక్తరోగః.

కేంద్రకోణములయందు పాపగ్రహములు లేక లగ్నాధిపతిగాని గురుడుగాని చతుర్థమందున్నయెడల సమస్తసుఖంబులును అనుభవించుచు పుణ్యకార్యములు చేయుచు నిరోగియై నూరు వత్సరములు ఆయుర్దాయము గలవాడగును.

శ్లో. లగ్నేవా రవిభౌమసౌమ్యఖచరైర్యుక్తై ధవావీక్షితే జాత స్సుందరమూర్తిరేవ శనిరాహూ భ్యాంచ కృష్ణాంగకః। త్రైర్మిశ్రై శ్శుభగ స్సదా సురుచిరశ్యామాంగకో జాయతే శ్లేష్మాశుక్రగురూ నిశాకర శనీవాతశ్చ పిత్తం పరే.

లగ్నము రవి చంద్ర కుజులు బుధ గురు శుక్రులతో కూడినను చూడబడినను జాతకుడు సుందరదేహుడగును. శని

రాహువులు చూచినను చేరినను కృష్ణగాత్రుండగును. సుందర కృష్ణమిశ్రగ్రహములు చూచినను కూడినను శ్యామసుందరాంగకు డగును. గురు శుక్రులచే శ్లేష్మమును శని చంద్రులతో వాతంబును అన్యగ్రహములతో పిత్తంబును జాతకుని దేహ ప్రకృతినిగా నెరుగవలయును.

శ్లో. ఛాయాపుత్రగురూచ సత్వగుణకో భౌమోరగౌ తామసః
కేతుర్జ్ఞానబలోన్య ఖేచరయుతౌ దృష్టౌబలేద్రాజసః
స్థూలాంగశ్శనిచంద్రకౌ యదిరవిజ్ఞారౌ స్తు మధ్యాంగకశ్చాన్యైరల్ప తనుర్భవేద్యుతీవ శాల్లగ్నస్య
సంయోగతః.

శని గురులలో నెవరైనను లగ్నమందుండినను చూచినను ఆ జాతకుడు సాత్వికుడగును. అట్లు కుజ రాహులచే తామసుడగును. (కేతువుచే జ్ఞానబలము గలవాడగును.) ఇతర గ్రహములచే రాజసుండగును. శని చంద్రులతో లగ్నము కూడినను చూడబడినను జాతకుడు స్థూలాంగుడగును. అట్లు అర్క సౌమ్య గురువులచే మధ్యమదేహు డగును. ఇతర గ్రహములచే కృశాంగుడగును.

శ్లో. లగ్నేశే యది కేంద్రకోణసహితే మిత్రాలయేస్వోచ్ఛభే
జాతఃకీర్తియుతోజ కర్కిమృగకీటేష్వస్తభేలగ్నభే
జీవచ్ఛేద్యదిసంస్థితశ్చకరు తేచారామసంస్థాపనం
దేవాగారతటాకశిల్పరచనాం ప్రాజ్యశ్చభూమీతలే.

లగ్నాధిపతి కేంద్రత్రికోణములయందు కాని స్వోచ్చ మిత్రక్షేత్రములయందు కాని ఉండెనేని జాతకుడు యశోవంతు డగును. గురుండు మేషకర్కాట వృశ్చికమకరములలో గాని లగ్న సప్తమములలో గాని ఉండెనేని జాతకుడు దేవళమును, చెరువును కట్టించును. లోకపూజ్యుడు నగును.

శ్లో. లగ్నేశ్వరేణాపియుతేచ సౌమ్యే సౌమ్యోథవాప
శ్యతిలగ్న భావం,
కేంద్రత్రికోణోచ్చగతేతదీశే శరీరసౌఖ్యం
లభతేహిజాతః.

లగ్నాధిపతి శుభగ్రహయుక్తుడైనను, శుభగ్రహము లగ్నమును జూచినను లగ్నేశుడు కేంద్రత్రికోణోచ్చస్థానముల యందుండినను జాతకుడు దేహసౌఖ్యమును జెందును.

శ్లో. లగ్నస్థితే త్వర్కిణిదుర్బలాంగో నవాతరు క్చాన్యవధూ
విలోలః, కుజేథవాశస్త్రకృవ్రణశ్చ హుతాశనస్ఫోటక మేహ
రోగవాన్.

లగ్నమున శనియున్నను చూచినను జాతకుడు వాత రోగియును, దుర్బలుండును స్త్రీలోలుండు నగును. కుజుండు లగ్నగతుడైనను చూచినను జాతకుడు ఆయుధవ్రణస్ఫోటకాగ్ని భీతుడును మేహరోగియునగు.

శ్లో. శనిద్రేక్కాణగేలగ్నే శసౌత్తైవసంస్థితే,
యుక్తేచకుజరాహుభ్యాం జాతఃపంగుర్భవేద్ధ్రువమ్.

లగ్నమున శని ద్రేక్కాణమై అచట శనియుండి కుజునితో గాని రాహువుతో గాని కూడియున్న జాతకుఁడు కుంటివాడగును.

శ్లో. సుఖారిరంధ్రవ్యయభేషుకుత్రచి చ్చంద్రార్కభౌమా
యదిసంయుతాస్యుః పాపేక్షి తాహారిపువీక్షి తావాజాతస్తు
బాధిర్యముపై తినూనమ్.

4-6-8-1 ః ఈ భావములలో నెచ్చటనైనను సూర్యచంద్రాంగారకులు చేరియుండి పాపులచేగాని శత్రుగ్రహములచే గాని చూడబడిరేని జాతకుడు చెవిటివాడగును.

శ్లో. ఆయుస్థానగతేభామే శవ్యర్కఫణిసంయుతే,
నాసికాచ్ఛేదనం ప్రోక్తమితి కేరళనిర్ణయం.

అష్టమంబున కుజశనిరాహువులు చేరియుండిరేని జాతకునికి నాసికాభంగము కలుగును.

శ్లో. ఆయుఃస్థానగతేభామే భానుజేనయుతేక్షితే,
శిరచ్ఛేదనయోగోవా రణేవామరణం భవేత్.

అష్టమమందు కుజుడుండి శనిచేత చూడబడినను కూడినను, జాతకుడు కలహమున శిరచ్ఛేదనము నొందును.

శ్లో. శనిక్షేత్రగతే రాహౌ సింహగేరవినందనే,
తాస్వేవజన్మలగ్నాని యదిశీర్షంరణేహతమ్.

సింహమకర కుంభములు జన్మలగ్నములై మకరకుంభములలో రాహువును, సింహమున శనియుండిన యుద్ధమున తల కొట్టబడును.

శ్లో. సప్తమేచాష్టమేవాపిశనిజీవౌసమన్వితౌ
రక్తకాసోరవిస్తత్ర, క్షయరోగోనసంశయః

సప్తమమునగాని అష్టమునగాని శనిగురువులుచేరి యున్న రక్తకాసరోగమువచ్చును వారితో సూర్యుడుకూడిన క్షయముకల్గును.

శ్లో. లగ్నస్థితేరవౌరాహుశ్శిరోల్పంచోన్నతా తనుః
భవేదాయుర్దశనాదీర్ఘాజాతస్యతురగాద్భయమ్

లగ్నమున రవిరాహువులుండినేని జాతకుని తల చిన్నది. శరీరము నిడుపు, పండ్లుపొడుగు, అశ్వగండము గలుగును.

శ్లో. కుటుంబపేగీవ్మతినావయుక్తే చంద్రేణయుక్తేప్యథవా
తృతీయగే। షష్ఠాష్టమద్వాదశనీచగేచజాతస్తుమూకో,
భవితానసంశయః.

ద్వితీయాధిపతి గురువుతోగాని చంద్రునితో గాని కూడి 6-8-12 భాగములయందు నీచుడయియుండిన జాతకుడు మూగవాడగును.

శ్లో. కుజార్కిఫణినష్టేగురు రాహూచలగ్నగౌ
కుర్యాద్రాతస్యాండరోగం స్వకాలే నాత్రసంశయః.

షష్ఠమున శనికుజరాహువులుగాని లగ్నమున గురురాహువులుగాని చేరియున్న జాతకునికి వారి దశాభుక్తికాలంబున అండరోగము కల్గును.

శ్లో. కుజరాహుద్వయం లగ్నే జాతః కుబ్జోభవేన్నరః
కుజార్కిఫణినః త్రిస్థాః అండరోగకరాస్మృతా.

కుజరాహువులు లగ్నమందున్నయెడల జాతకుడు పొట్టి వాడగును. శని కుజరాహువులు మూడింటనున్నయెడల జాతకునికి అండరోగము వచ్చును.

శ్లో. తృతీయాధిపలగ్నేశావేక రాశిగతౌయది
రాహుదృగ్యోగమాత్రేణభవితా యమళోదయః

లగ్నతృతీయాధిపతు లొక రాశియందుండి రాహుయుక్తులయిన కవలజాతకమనగా జంటశిశువులు పుట్టెదరు.

శ్లో. లగ్నే ఫణీ తదీశస్తుమానే పాపయుతో యది
చత్వారఃకుత్రచిద్యుక్తాద్విత్రాగర్భ ప్రసూతయః.

రాహువు లగ్నగతుడయి లగ్నాధిపతి దశమమందు పాపగ్రహయుతుడయి తక్కిన ఏరాశియందైనను నాలుగు గ్రహములుచేరి యుండిరేని ఒకగర్భమున 2, 3 శిశువులు పుట్టెదరు.

శ్లో. రాహుణా కేతునావాపి, యుతస్సూర్యోష్టమేయుతః.
జాతస్యావమతిఃకుర్యాచ్ఛిరోముండనమేనవా.

సూర్యుడు రాహువుతోగాని కేతువుతోగాని అష్టమమందుండెనేని జాతకునికి తలగొరిగింపబడి అవమానము జరుగును.

శ్లో. దేహేశౌచంద్రసౌమ్యౌచేత్ ఫణినాకేతునాయుతౌ
ఛాయానందనసందృష్టౌ శ్వేతకుష్ట ప్రదాస్మృతౌ

చంద్రుడుగాని బుధుడుగాని లగ్నాధిపతియై రాహుకేతు

యుక్తుడయి శనిచే చూపబడిన జాతకునికి శ్వేతకుష్ఠురోగము సంభవించును. మిథునకర్కటక కన్యాలగ్నములకు ఈయోగము సంభవింపవచ్చును.

శ్లో. లగ్నే శేనకుజస్స్వామ్యః కన్యామిథున సంస్థితః
సారోలగ్నే శ్వరస్స్వామ్య దృష్టోవాఆసనామయః.

లగ్నాధిపతితో బుధుడుగాని కుజుడుగాని కూడి కన్యా మిథునములయం దుండినను లగ్నాధిపతి కుజయుక్తుడయి బుధునిచేత చూడబడినను జాతకునికి ఆసనరోగము గలుగును.

లగ్నే రవ్యాది గ్రహస్థితిఫలం.

శ్లో. లగ్నస్థె ర్కే వికలనయనోనిర్దయః పారకీయో
కార్యేప్రీతః పరమకుశలో జాయ తైజాతకోసౌ
మెషెసార్థ స్తిమిరనయనో లేయగే ర్కే నిశాంధ
స్తౌళిస్థె ర్కే విధననయనః పుష్పితాక్షశ్చకర్కే.

లగ్నమందు రవియున్న యెడల హీనదృష్టిగలవాడును దయారహితుడును స్వకార్యదురంధరుడును మిక్కిలి నేర్పరియు అగును. మేషము లగ్నమై లగ్నమందు రవియున్న యెడల ధనవంతుడును చీకటికన్నులు గలవాడును అగును. సింహము లగ్నమై లగ్నమందు రవియున్న యెడల రేజీకటి కలవాడగును. తులాలగ్నమై అందు రవియున్న యెడ దరిద్రుడును గ్రుడ్డి

వాడును అగును. కర్కాటకము లగ్నమై లగ్నమందు రవి యున్నయెడల పూవుకంటివా డగును. మరిన్ని లగ్నమందు రవియున్నయెడల ఎఱ్ఱని శరీరముగలవాడును, మేషాశరీరము గలవాడును సాత్వికుడును స్వల్పశరీరదారుఢ్యము గలవాడును గొప్పగొప్ప ఆలోచనలు గలవాడును పైత్యశరీరము గలవాడును అగును.

శ్లో. దాక్షిణ్యరూపధనభోగ గుణైర్వరేణ్య శ్చంద్రేకు
ళీరవృషభాజగతేవిలగ్నే, ఉన్మత్తనీచబధిరోవికలోథ
మూకః శేషేషునా భవతిహీనతనుర్విశేషాత్.

మేషముగాని వృషభముగాని కర్కాటకముగాని లగ్నమై అందు చంద్రుడున్నయెడల దాక్షిణ్యముగలవాడును రూపవంతుడును ధనవంతుడును భోగియును మంచిగుణములు గలవాడును అగును. ఇవిగాక తక్కిన లగ్నములయందు చంద్రుడున్నయెడల ఉన్మత్తుడును నీచకృత్యములు చేయువాడును చెవిటివాడును వికలాంగుడును మూగవాడును గాని అగును. దుర్బలశరీరముగలవాడు కూడ అగును. క్షీణచంద్రుడుగాని నీచచంద్రుడుగాని లగ్నమం దున్నయెడల యూదోషగుణములు కలుగును. మరిన్ని లగ్నమందు పూర్ణచంద్రుడున్నయెడల జాతకుడు మంచి దేహదారుఢ్యముగలవాడును మంచి స్వభావముగలవాడును సుందరమైనవాడును వాతశరీరము గలవాడును విద్యావినయసంపన్నుడును అగును.

శ్లో. అతిమతిభ్రమతాంచకళేబరం క్షతయుతం
బహుసాహసముగ్రతాం తనుభృతాంకురుతే
తనుసంస్థితోఽవనిసుతోగమనాగమనానిచ.

లగ్నమందు కుజుడున్నయెడల మతిభ్రమణము గలవాడునుగాయములుగల్గిన శరీరముగలవాడును మిక్కిలి సాహసముగలవాడును ఉగ్రత్వముగలవాడును అగును.

శ్లో. తదనుదశనరోగీ లగ్నగేభూమిపుత్రే కృశతనురతి
పిత్తశ్లేష్మలఃకృష్ణరక్తః భవతిచపలచిత్తః క్రూరవృత్తిః
కుచేలస్సకలసుఖవిహీనస్సర్వదాపాపశీలః.

కుజుడు లగ్నమందున్నయెడల దంతరోగముగలవాడును కృశించినశరీరముగలవాడును పైత్యశ్లేష్మతత్వము గలవాడును నల్లనిరక్తముగలవాడును చపలస్వభావముగలవాడును దుర్మార్గుడును. మలినవస్త్రములు ధరించువాడును సౌఖ్యములేనివాడును చెడ్డస్వభావముగలవాడును అగును. మరిన్ని లగ్నమందు కుజుడున్న యెడల ఎరుపుగాను పొడవుగాను ఉండును. మేహాశరీరమై యుండును. చెడ్డస్వభావముగలవాడగును.

శ్లో. శాంతోవినీతస్సుతరాముదారో నరస్సదాచారప
రోతిధీరః విద్వాన్కళాజ్ఞో విపులాత్మజశ్చశీతాంశ
సూనోజననేతనుస్థే.

లగ్నమందు బుధుడున్నయెడల నమ్రత్వముగలవాడును ఉదారబుద్ధిగలవాడును అత్యంతము ఆచారముగలవాడును

బుద్ధిమంతుడును విద్వాంసుడును కళాశాస్త్రము తెలిసిన వాడును విశేష సంతానము గలవాడును అగును. మరిన్ని లగ్నమందు బుధుడున్న యెడల ఎరుపురంగుగలవాడును పొట్టి వాడును పైత్యశరీరముగలవాడును మంచిస్వభావముగల వాడును అగును.

శ్లో. వివిధశాస్త్రరహస్యవిచక్షణ సుఖసుజీవనపుణ్యసమ న్వితః సకలవల్లభవంద్యచరిత్రవాన్ భవతిదేవగురౌ తనుగేనరః.

లగ్నమందు గురుడున్న యెడల అనేక శాస్త్రములు తెలిసినవాడును సుఖమైనటువంటిన్ని యోగ్యమైనటువంటిన్ని జీవనముగలవాడును పుణ్యాత్ముడును రాజపూజ్యతకలవాడును అగును. మరిన్ని గురుడులగ్నమందున్న యెడలసుందరశరీరము కలవాడును దేహదారుఢ్యముగలవాడును బహుయోగ్యుడును వాతశరీరముగలవాడును, స్థూలశరీరము గలవాడును ధనవంతు డును పండితుడును అగును.

శ్లో. బహుకళాకుశలోవిమలోక్తికృత్సువదనామదనానుభ వఃపుమాన్ అవనినాయకమానధనాన్వితో భృగుసుతే తనుభావగతేసతి,

లగ్నమందు శుక్రుడున్న యెడల రెండుమూడువిద్యల యందు సాహిత్యముగలవాడును యుక్తిప్రయుక్తులుగలవాడును మంచిముఖముగలవాడును కామాతురుడును రాజులవల్ల మంచి

పూజ్యతయు ధనలాభము గలవాడును అగును. మరిన్ని శుక్రుడు లగ్నమందున్న యెడల అందమయినవాడు పొట్టివాడు శాస్త్రజ్ఞుడునుకవియు మేహముగలవాడును సంగీతసాహిత్యములయందు ప్రవేశముగలవాడును పండితుడును అగును.

శ్లో. అదృష్టార్థో రోగీమదన వశగోత్యంతమలినః
శిశుత్వేపీడా ర్తస్సవితృసుతలగ్నే త్యలసవాక్
గురుస్వర్షో చ్ఛస్థేన్నృపతి సదృశో గ్రామపురప
స్సువిద్వాంశ్చార్వంగో దినకరసమోన్యత్ర కథితః.

శనిలగ్నమందుండెనేని నిత్యదరిద్రుండును రోగియును మన్మథ పరతంత్రుడును బాల్యమునందు వ్యాధిపీడితుండును నీచసంభాషణముచేయువాడును మలినుడు నగును.

తులాధనుర్మకరకుంభమీనరాసులలో నొకటిలగ్నమై అందుశనియున్న యెడల రాజతుల్యుడును గ్రామపురాధీశుడును పండితుడును సుందరాంగుడును అగును.

మరిన్ని పైనవ్రాసిన లగ్నములందుగాక తక్కినలగ్నములయందు శనియున్నయెడల నిత్యరోగియు నల్లనిశరీరముగలవాడును, దుర్జనుడును, అనాచారప్రవర్తకుడును వాతశరీరము గలవాడును, నిర్దయుడును, దరిద్రుడును, పొడుగైన శరీరము గలవాడును, డాంబికుడును నగును.

శ్లో. రోగీసదాచంద్రరిపౌతనుస్థే దర్పోద్ధతాత్మాకపటఃకుచేలః.
రక్తోథనేపాపయుతో మనుష్యః। సదామహాసాహసకర్మయుక్తః.

లగ్నమందు రాహువున్న యెడల గాంభీర్యముగలవాడును ఔద్ధత్యముగలవాడును మలినవస్త్రమును ధరించువాడును ధనమందు ఆసక్తిగలవాడును దుస్సహవాసముచేయువాడును సాహసకార్యములుచేయువాడునుఅగును. మరిన్ని లగ్నమందు రాహువున్నయెడల కృష్ణవర్ణముగలవాడును పొడుగైనవాడును పట్టుదలగలవాడును అగును.

శ్లో. మహోదరోమాతృహీనః కులనాశకర స్తథా
హృద్రోగేనభవేద్దుఃఖీ తనుయుక్తేన కేతునా.

లగ్నమందు కేతువున్నయెడల తల్లిలేనివాడును కులమును నశింపచేయువాడును హృదయరోగముచే బాధపడువాడును అగును. మరిన్ని, లగ్నమందు కేతువున్నయెడల చిత్రవర్ణముగలవాడును కొంచెము పొట్టిఅయినవాడును మంచి స్వభావము గలవాడును పరమార్థచింత కలవాడును అగును.

తనుభావస్సమాప్తః

---

# 2 ధ న భా వ ము.

---

శ్లో. ధనాధిపతివాగీశౌ స్వాచ్ఛస్వక్షేత్రకేంద్రగౌ
త్రికోణే శుభసంయుక్తౌ జాతౌ బహుధనీ భవేత్.

ధనస్థానాధిపతి గురునితో ఉచ్ఛయందుగాని స్వక్షేత్ర మందుగాని కేంద్రకోణముల యందుగాని కలిసినయెడల జాతకుడు మిక్కిలి ధనవంతుఁడగును.

శ్లో. ధనేశే లాభరాశిస్థె లాభేశే ధనరాశిగే తౌ ఉభౌ
కేంద్రరాశిస్థౌ ధనదేనసమన్వితః.

ధనాధిపతి లాభమందున్నను లాభాధిపతి ధనమందున్నను ధనలాభాధిపతులు కేంద్రమందున్నను జాతకుడు కుబేరునితో సమానుడగును.

శ్లో. లగ్నేశే ధనరాశిస్థే ధనేశే లాభరాశిగే లాభేశే
వాపిలగ్నస్థే బహుధాన్యాధికం భవేత్.

లగ్నాధిపతి ధనస్థానమందుండి ధనాధిపతి లాభరాశియందుండి లాభాధిపతి లగ్నమం దున్నయెడల జాతకుని విశేష ధనము నిల్వచేయువాడగును.

శ్లో. లక్షద్వయం ధనంయాతి చతుష్కేంద్రె శుభాన్వితే
సింహాంశగే ధనేశేపి యద పారావతాంశగే లక్ష
త్రయాధికారీ స్యాల్లాభలగ్నే ధనాధిపే.

నాలుగు కేంద్రములయందు శుభగ్రహములున్నయెడల రెండులక్షల ద్రవ్యముండును. ధనాధిపతి సింహాంశయందున్నను పారావతాంశ యందున్నను మూడులక్షల ధనవంతు డగును. ద్వితీయాధిపతి లాభమందును లాభాధిపతి ద్వితీయమందును ఉన్నయెడల ధనముగలవాడగును.

శ్లో. విద్యేశ బుధజీవేషు త్రిషడష్ట వ్యయేషుచేత్
రిక్తేశగురూపదుస్థా ధనీ కేంద్రత్రికోణగా.

ధనాధిపతియు గురుడును బుధుడును 3, 6, 8, 12 స్థానములయందు లేకుండగా నుండి కేంద్ర త్రికోణములయందున్న యెడల జాతకుడు మిక్కిలి ధనవంతుడగును.

శ్లో ధనేశే కేంద్రభావస్థే స్వోచస్వర్క్షగతే గురౌ ప్ర.
భుస్సహస్రనిష్కాణాం జాతో భవతిచాధికః.

ధనాధిపతి కేంద్రమందుండి గురుడు స్వక్షేత్రమందుగాని ఉచ్చయందుగాని ఉన్నయెడల వేలకొలది ధనము నిల్వయుండును.

శ్లో. ధనేశే లాభసంస్థేతు లాభేశే ధనసంస్థితే భాగ్యేశశ్చ
ధనస్థానే జాతో లక్షధనో భవేత్.

ధనాధిపతి లాభమందుండి లాభాధిపతి ధనమందుండి భాగ్యాధిపతి ధనస్థానమందున్న జాతకుడు లక్షాధికారి అగును.

శ్లో. కుటుంబనాథే పరముచ్చభాగే దేవేంద్రపూజ్యేన

యుతేసమిాంక్షితే। తథావిధే తద్భవనేతు జాతః సహస్ర విత్తాధిపతిః ప్రతాపీ.

ధనాధిపతి పరమోచ్చయందుండి గురునితోకూడినను చూడబడినను ఆ జాతకునిగృహమందు వేలకొలదిధనమునిల్వయుండును. ప్రతాపవంతు డగును.

శ్లో. లగ్న బంధ్వర్థ భాగ్యేశాః పరమోచ్చేన సంయుతాః
వైశేషికాంశే లాభేశేజాతః కోటీశ్వరో భవేత్.

లగ్నాధిపతియు చతుర్థాధిపతియు ధనాధిపతియు భాగ్యాధిపతియు ఉచ్చయందుండి లాభాధిపతి వైశేషికాంశ యందున్న యెడల జాతకుడు కోటీశ్వరు డగును.

శ్లో. ధనద్రష్టుర్ధనస్థస్య ధనేశస్య దశాస్సుభాః ధనకారక
సంయోగే ధనం బహుళ మశ్నుతే॥

ధనస్థానమును చూచువానియొక్కయు ద్వితీయమందున్న వానియొక్కయు ధనాధిపతియొక్కయు దశలలో ధనకారకు డగుగురుసంబంధమున్న యెడల జాతకుడు మిక్కిలి ధనవంతు డగును.

శ్లో. లాభాధిప ధనాధీశౌ లగ్నరాశి ముపాగతౌ। పర
స్పరం మిత్రభూతౌ ధనం బహుళ మశ్నుతే.

లాభాధిపతియు ధనాధిపతియు లగ్నమందున్నను ధన లాభాధిపతులు మిత్రులైనను జాతకుడు మిక్కిలి ధనవంతు డగును.

శ్లో. చరలగ్నే తదీశేవా చరఖేచరవీక్షితే ధనం దేశాం
తరే తస్మిన్ స్వదేశస్థిగఖేరపి.

చరలగ్నమై లగ్నాధిపతి చరరాశియందుండి చరరాశ్యధిపతిచే చూడబడినయెడల దేశాంతరమువల్ల ధనలాభము కలుగును.

శ్లో. ధనేశో ధనసంస్థశ్చ ధనద్రష్టాచ కారకః। చత్వారో
ఖలినో యస్యబహుళం ధనమశ్నుతే॥

ధనస్థానాధిపతియు ధనస్థానమందున్నవారును ధనస్థానమును చూచువారున్ను ధనకారకుడున్ను బలముగానున్న యెడల జాతకుడు మిక్కిలి ధనవంతుడగును.

శ్లో. లగ్నాధీశ ధనాధీశౌ బలినౌ కేంద్రకోణగౌ। లగ్నే
విత్తేశుభైర్దృష్టే సంజాతో ధనవాన్భవేత్.

లగ్నాధిపతియు ధనాధిపతియు బలవంతులై కేంద్రకోణములందు బలముగానుండి లగ్నమును ధనస్థానమును శుభగ్రహములు చూచినయెడల జాతకుడు మిక్కిలి ధనవంతుడగును.

శ్లో. లగ్నవిత్తాయనాధాస్తు స్వోచ్చమిత్రగృహస్థితాః
యది కేంద్రత్రికోణేషు విత్తలాభ ముదీరయేత్.

లగ్నధనలాభాధిపతులు ఉచ్చయందుగాని మిత్రక్షేత్రమందుగాని కేంద్రకోణములయందుగాని వున్నయెడల జాతకుడు ధనవంతుడగును.

శ్లో. తృతీయరాశౌ ధనలగ్ననాథౌ బలాన్వితౌ పుంగ్రహదృష్టియుక్తౌ తదీశ్వరేణాపి యుతౌ ప్రదృష్టౌ భ్రాతుర్ధనంయాతి విశేషికాంశే.

ధనలగ్నాధిపతులు తృతీయస్థానమందు బలముగానుండి పురుషగ్రహములచే చూడబడినను సోదర స్థానాధిపతితో కలసినను జూడబడినను జాతకునకు సోదరసంబంధమగు ధనలాభము కలుగును.

శ్లో. తృతీయభావాధిపతౌ ధనస్థే తత్రస్థితే కారక ఖేచరేంద్రే
దృష్టేయుతే వాతనువేనజాతో భ్రాతుర్ధనం యాతి విశేష
కాంక్షే.

తృతీయాధిపతి ధనస్థాన మందుండి ధనస్థానమందు కుజుడున్నను లగ్నాధిపతితో కలిసినను చూడబడినను సోదరధనము కలవాడు అగును.

శ్లో. దృష్టేయుతే విత్తపతౌ బలాఢ్యే సుఖేశ్వరేణాపి ధనం జన
న్యాః బంధోస్సకాశా దథవాకృషేశ్చధనం ప్రయాత్యత్ర
విశేషితాంశే.

ధనాధిపతి చతుర్థస్థానాధిపతితో కలిసినను చూడబడినను బలముగానున్నయెడల తల్లివల్లనుంచిగాని, బంధువులవల్లనుంచిగాని, వ్యవసాయమువల్లనుంచిగాని విశేషధనవంతుడగును.

శ్లో. ధనేశే పాపసంయుక్తే ధనే పాపసమన్వితే
అసత్యవాదీ పిశునః పాపద్రవ్యయుతో భవేత్.

ధనాధిపతి పాపగ్రహములతో కలసినను ధనస్థానము పాపగ్రహాయుక్తమైనను అన్యాయముగా ధనార్జనచేయువాడును లుబ్ధుడును పాపద్రవ్యముతో కూడుకొన్నవాడును అగును.

శ్లో. ధనస్థానగతే పాపే తదీశే బలవర్జితే లాభేశేనాశ
గేవాపి ధనహీనో భవేన్నరః.

ధనస్థానమందు పాపగ్రహ మున్నను ధనస్థానాధిపతి బల హీనముగా నున్నను లాభాధిపతి వ్యయమందున్నను జాతకుడు దరిద్రుడగును.

శ్లో. ధనలాభాధిపౌ యస్య పాపఖేచరసంయుతౌ
జన్మప్రభృతి దారిద్ర్యం భిక్షాన్నం ప్రాప్నుయాన్నరః.

ధనాధిపతియు లాభాధిపతియు పాపగ్రహములతో కలిసినయెడల జన్మించినది లగాయితు దారిద్ర్యమును అనుభవించుటయు భిక్షాన్నభోజనమును సంభవించును.

శ్లో. షష్టాష్టమవ్యయస్థానే ధనలాభాధిపౌ యది
లాభే కుజే ధనే రాహూ ధనం ప్రాప్యాపి నిర్ధనః.

ధనలాభాధిపతులు షష్టాష్టవ్యయములయందుండి లాభమందు కుజుడును ధనమందు రాహువును ఉన్నయెడల ధనలాభముగలవాడై నప్పటికి ధనములేనివాడగును. అసగా వచ్చినధనమంతయు నష్టమగును.

శ్లో. విత్తేశే వ్యయభావస్థే వ్యయేశే విత్తరాశిగే
లాభరాశిపతౌ దుస్థే మహాన్స్యాద్ధనవ్యయః.

ధనాధిపతి వ్యయమందును, వ్యయాధిపతి ధనమందును, లాభాధిపతి షష్టాష్టమవ్యయస్థానములయందున్ను ఉన్నయెడల విశేషముగా ధనవ్యయము చేయువాడగును.

శ్లో. వ్యయభావగతౌ జీవే విత్తేశే బలవర్జితే। శుభై
రవీక్షితే లగ్నే లాభశ్చాల్పోవ్యయాధికః.

వ్యయమందు గురుడుండి వ్యయాధిపతి దుర్బలముగా నుండి లగ్నము శుభగ్రహములచే చూడబడనియెడల లాభము కంటె ఖర్చుని శేషముగా నుండును.

శ్లో. సహితోఽవిత్తపష్షష్టే వ్యయపేన వ్యయేపివా।
పాపక్షేత్రే పాపదృష్టః స్వల్పవిత్తో భవేన్నరః.

ధనాధిపతి షష్ఠమమందుగాని వ్యయమందుగాని వ్యయాధిపతితో కలిసినను పాపక్షేత్రమందున్నను పాపగ్రహములతో కలసినను స్వల్పధనముగలవాడగు.

శ్లో. కేంద్రేబుధే వాగధిపేబలాఢ్యేశుక్రే ధనభ్రాతృగతేస
సౌమ్యే। స్వోచ్చేధనే దానవపూజితేనా జ్యోతిర్విదాం
శ్రేష్ఠతమోనరస్స్యాత్.

బుధుడు కేంద్రమందుండి వాక్స్థానాధిపతి బలముగా నున్నను, శుక్రుడు చతుర్థమందుండి బుధునితో కూడికొనినను శుక్రుడు ధనమందు ఉచ్ఛయందున్నయెడల జ్యోతిషము తెలిసినవాడగును.

శ్లో. గణితజ్ఞోభవేజ్జాతో వాగ్భావే భూమినందనే। ససో
మే బుధసంద్రుష్టే కేంద్రేవా సోమనందనే.

ద్వితీయమందు కుజుడుండి చంద్రునితోకూడి బుధునిచే

చూడబడినను బుధుడు కేంద్రమందున్నను జాతకుడు గణిత శాస్త్రము తెలిసినవాడగును.

శ్లో. వాగ్భావపే బుధే స్వోచ్చే లగ్నే దేవేంద్రపూజితే
శనావష్టమసంయుక్తే గణితజ్ఞోభవేన్నరః.

ద్వితీయాధిపతియై బుధుడు ఉచ్ఛయందుండి లగ్నమందు గురుడుండి అష్టమమందు శనియున్న యెడల జాతకుడు గణితశాస్త్రము తెలిసినవాడగును.

శ్లో. కేంద్రత్రికోణగేజీవే శుక్రేస్వోచ్ఛగతేసతి వాగ్భావ
పేందుపుత్రేవా గణితజ్ఞో భవేన్నరః

గురుడు కేంద్రకోణములయందుండి శుక్రుడు ఉచ్ఛయందుండి ద్వితీయమున బుధుడున్న యెడల గణితశాస్త్రజ్ఞుడగును.

శ్లో. వాగ్భావపేరవౌ భౌమే గురుశుక్ర నిరీక్షితే పారావ
తాంశగే సౌమ్యే తత్తద్యుక్తిపరాయణః.

వాక్స్థానాధిపతి యగురవిగాని కుజుడుగాని గురుశుక్రులచే చూడబడుచుండి బుధుడు పారావతాంశయందున్న యెడల యుక్తి ప్రతియుక్తులు గలవాడగును.

శ్లో. గురుశుక్రౌధనేశౌ చేత్ రవిభౌమనిరీక్షితౌ। మూలత్రికో
ణ తుంగేనా తర్కశాస్త్రవిశారదః.

గురుశుక్రులు ధనాధిపతులై రవికుజులచే చూడబడుచు మూలత్రికోణమందుగాని, ఉచ్ఛయందుగాని, యున్న యెడల తర్కశాస్త్రజ్ఞుడగును.

శ్లో. సంపూర్ణబలసంయుక్తే గురౌ తద్భవనేశ్వరే
దినేశ భృగుసంద్రుష్టే శబ్దశాస్త్రపరాయణః.

ద్వితీయాధిపతియున్ను గురుడున్ను పూర్ణబలవంతులై యుండి రవిశుక్రులచే చూడబడినయెడల వ్యాకరణశాస్త్రము తెలిసినవా డగును.

శ్లో. వాగ్భావపే బుధే స్వోచ్ఛే గోపురాంతరగతేశనౌ
సింహాసనే గురౌ వాపి వేదాంతజ్ఞో భవేన్నరః.

ద్వితీయాధిపతియగు బుధుడు ఉచ్చయందుండి శని గోపురాంశయం దుండి గురుడు సింహాసనాంశయం దుండిన యెడల వేదాంతశాస్త్రజ్ఞు డగును.

శ్లో. ఉత్తమాంశే భృగౌలగ్నే కేంద్రేవా తద్విధే భృగౌ
దేవలోకగతే చంద్రే వేదాంతజ్ఞాన పారగః.

శుక్రుడు ఉత్తమాంశయందుండి కేంద్రమం దున్నను చంద్రుడు దేవలోకాంశయందున్నను వేదాంతశాస్త్రజ్ఞుడగును.

శ్లో. వేదాంతపరిశీలస్స్యాత్కేంద్రకోణే గురౌసతి
బుధేన గురుణాదృష్టే శనౌ పారావతాంశగే.

గురుడు కేంద్రమందుగాని కోణమందుగాని వుండి శని పారావతాంశ యందుండి బుధునిచేతగాని గురునిచేతగాని చూడబడినయెడల వేదాంతశాస్త్రజ్ఞు డగును.

శ్లో. షష్ఠ్యాస్త్రవల్లభః కేంద్రే జీవే దానవపూజితే
సింహాసనే గోపురాంశే వాగ్భావస్థాంశకే బుధే.

గురుశుక్రు లుభయులు కేంద్రమందున్నను బుధుడు ద్వితీయాధిపతియొక్క నవాంశయం దున్నను సింహాసనాంశయం దును గోపురాంశయందును వున్నయెడల ఆరుశాస్త్రముల యందు ప్రవేశము కలవా డగును.

శ్లో. నేత్రే శుభే తద్భవనేశ్వరేవా సౌమ్యాన్వితే కారకఖేచ రేంద్రే। లగ్నేశ్వరేణాపి యుతేథదృష్టే విశాలదృష్టి స్సన రో విశేషాత్.

నేత్రస్థానమందు శుభగ్రహ మున్నను నేత్రస్థానాధిపతి యున్నా కారకుడున్నా శుభగ్రహముతో కలిసియున్నను లగ్నాధిపతితో కలిసియున్నను చూడబడినను మంచినేత్రములు గలవా డగును.

శ్లో. శన్యార్క యోగే గుళికేనయుక్తే నేత్రేశ్వరే తత్రతునేత్ర రోగః। నేత్రేయదా పాపబహుత్వయోగే యమేనదృష్టే సతి నేత్రరోగః.

నేత్రస్థానాధిపతి శనితో గాని కుజునితో గాని గుళికునితో గాని ద్వితీయమందు కలిసియున్నయెడల నేత్రరోగములు గలుగును. పాపస్థానమందు పాపగ్రహములుండి శని చూచిన యెడల నేత్రరోగము కలుగును.

శ్లో. వాక్స్థానపే సౌమ్యయుతే త్రికోణే కేంద్రస్థితే తుంగన మన్వితేవా। శుభేక్షితే పుంగ్రహయోగయుక్తే [illegible] భవే ద్యుక్తినమన్వితోసౌ.

వాక్స్థానాధిపతి బుధునితో కలిసి కేంద్రమందు గాని కోణ మందు గాని యుండి పురుషగ్రహముచేతగాని శుభగ్రహము లచే గాని చూడబడినగాని కూడుకొనిగాని వున్నయెడల వాచాలకుడును యుక్తిప్రయుక్తులుగలవాడును అగును.

ధనస్థానే రవ్యాది గ్రహస్థితిఫలం

శ్లో. ధనస్థానగతే సూర్యే ధనవాన్ సౌఖ్యహీనవాక్
అసత్యనాదీ కుజనో నేత్రరోగీ భవేన్నరః.

ధనస్థానమందు సూర్యుడున్నయెడల ముఖదంత రోగ ముగలవాడును రాజులచే నపహరించబడిన ధనము గలవాడును స్వల్ప సంతానము గలవాడు కళత్రసౌఖ్యము లేనివాడును అగును.

మరిన్ని ధనస్థానమందు రవి యున్నయెడల ముఖదంత రోగముగలవాడును రాజులచే నపహరింపబడిన ధనము గల వాడును స్వల్పసంతానముగలవాడు కళత్రసౌఖ్యము లేని వాడును అగును.

శ్లో. ధనగతిహరిణాంక స్త్యాగశీలంమతిజ్ఞం।
జనయతినిధిపూర్ణం చంచలాక్షం సుదృష్టిం
బహుధనసుఖపుష్టం కీర్తిసంపత్సమృద్ధం
కమలముఖవిలాసం చంద్రతుల్యస్వరూపం.

ధనస్థానమందు చంద్రు డున్నయెడల దాతయును బుద్ధి మంతుడును విశేషధనవంతుడును మంచినేత్రములుగలవాడును సౌఖ్యవంతుడును యశోవంతుడును అందమైన ముఖముగల వాడును తేజోవంతుడును అగును మరిన్ని ధనస్థానమందు

చంద్రుడున్నయెడల కుటుంబవృద్ధికలవాడును ధనవంతుడును విశాలనేత్రములుగలవాడును మంచివాక్కు గలవాడును యోగ్యుడును అగును. ఆధనస్థానమందు నీచచంద్రుడుగాని క్షీణచంద్రుడుగాని యున్నయెడల యీపైనవ్రాసిన ఫలములుజరుగవు.

శ్లో. అధనతాం కుజవాశ్రయతాం తథా
విమతితాం కృపయాతివిహీనతాం
తనుభృతో విదధాతి విరోధతాం
ధననికేతనగోఽవనినందనః.

కుజుడు ధనస్థానమందున్నయెడల ధనము లేనివాడును చెడ్డబుద్ధిగలవాడును దయాదాక్షిణ్యములు లేనివాడును జనులతో విరోధము పొందువాడును దుర్మార్గులతో సహవాసము చేయువాడును అగును. మరిన్ని కుజుడు ధనస్థానమందున్నయెడల ధనములేనివాడును దారపుత్రసౌఖ్యము లేనివాడును దీర్ఘకోపముగలవాడును కుత్సితాన్నమును భుజించువాడును నేత్రరోగము గలవాడును అగును.

శ్లో. ధనగతశశిజేనస్యాత్సదా సత్యవాదీ
బహుతరసుఖభోగి సర్వకాలప్రవాసః
భవతి చ పితృభక్తః పుత్రదారైస్సమేతో
బహుధనసుఖభోగీ దీర్ఘకేశోఽతిగౌరః.

బుధుడు ధనస్థానమందున్న యెడల యెల్లప్పుడును సత్యము పలుకువాడును అత్యంతము సౌఖ్యపడువాడును సర్వకాల

ములయందు ప్రవాసముచేయువాడును పితృభక్తిగలవాడును దారాపుత్రాదిసౌఖ్యముగలవాడును విశేషధనవంతుడును భోగియునుపొడుగైన కేశములుగలవాడును అగును. మరిన్ని బుధుడు ధనస్థానమందున్న యెడల ధనవంతుడును వాచాలకుడును విద్యావంతుడును కుటుంబసౌఖ్యముగలవాడును అగును.

శ్లో. సద్రూపవిద్యా గుణకీర్తియుక్త
స్సంత్యక్తవైరోపి నరోగరీయాన్
త్యాగీ సుశీలో ద్రవిణేన పూర్ణో
గీర్వాణవంద్యే ద్రవిణోపయాతే.

ద్వితీయమందు గురుడున్న యెడల రూపవంతుడును విద్యావంతుడును గుణవంతుడును కీర్తివంతుడును విరోధము లేనివాడును గొప్పవాడు దాతయును మంచిస్వభావముగలవాడును ధనవంతుడును అగును.

మరిన్ని ధనస్థానమందు గురుడున్నయెడల దారాపుత్ర సౌఖ్యము గలవాడును సంపూర్ణవిద్యాధనవంతుడును తేస్య వంతుడును అగును.

శ్లో. సదన్న పానాభిరతం నితాంతం
సద్వస్త్రభూషాధనవాహనాఢ్యం
గీర్వాణవిద్యాం మనుజం ప్రకుర్యా
ద్ధనోపపన్నో భృగునందనోయం.

ధనస్థానమందు శుక్రుడున్న యెడల యెల్లప్పుడుయోగ్యమైన అన్నపానీయములుగలవాడును మంచివస్త్రాలంకారములు

గలవాడును ధనవంతుడును వాహనవంతుడును సంస్కృత విద్యాప్రవీణుడును స్త్రీధనము గలవాడును అగును.

మరిన్ని శుక్రుడు ద్వితీయమందున్న యెడల మంచినేత్రములు కలవాడును కావ్యనాటకాలంకారవిద్యాప్రావీణుడును ధనవంతుడును నేర్పుగలవాడును పుణ్యకార్యాలోచనగలవాడును కుటుంబవృద్ధికలవాడును కవియును అగును.

శ్లో. అన్యాలయస్థోవ్యసనాభితప్తో
జనో జితస్స్యాన్మనుజశ్చపశ్చాత్
దేశాంతరే వాహనరాజమాన్యో
ధనాభిధానే భవనేర్కసూనౌ.

ద్వితీయమందు శనియున్నయెడల యిల్లప్పుడును పరగృహవాసుడున్ను విచారగ్రస్తుడున్ను స్వజనులవల్ల విడిచిపెట్టబడ్డవాడును అగును. (ఆశని స్వక్షేత్రమందున్న చోరాజపూజ్యుడును పరదేశమందు వాహనసౌఖ్యముగలవాడును ధనవంతుడును అగును.)

మరిన్ని శనిద్వితీయ మందున్న యెడల ఋణమున్ను నేత్రరోగమునుసంతానవిచారముగలవాడును కళత్రసౌఖ్యము లేనివాడును అగును.

శ్లో. రాహౌగతే సద్మధనస్యహీనో
బలేన దంభాదతిదుఃఖభాగీ
మాత్స్యేనమాంసేన సదాధనీచ
నిత్యం వశేన్నీచగృహే మనుష్యః.

రాహువు ద్వితీయమందున్న యెడల ధనము లేనివాడును బలమువల్లను దంభమువల్లనుదుఃఖప్రాప్తియున్ను మత్స్యమాంసాదులవల్ల ధనలాభమును పొందువాడును నిత్యము నీచగృహమందు నివాసము చేయువాడును అగును.

శ్లో. శూరః కలహశీలశ్చ కులవైరీ జడాంగకః
విదూషకః పాపశీలో ధనస్థానగతే ధ్వజే.

ద్వితీయమందు కేతువున్న యెడల శూరుడున్ను కలహమందు నేర్పుగలవాడును జడస్వభావుడును విదూషకుడును పారవ్యాపారముగలవాడును అగును.

# సోదరభావము

శ్లో. భ్రాతృస్థానే శుభైర్యుక్తే శోభనగ్రహవీక్షితే
భావనాథే బలాఢ్యే తు భ్రాతృలాభముదీరయేత్.

భ్రాతృస్థానమందుశుభగ్రహములున్నను భ్రాతృస్థానము శుభగ్రహములచే చూడబడినను సోదరస్థానాధిపతిబలముగానున్నను జాతకునకు సోదరవృద్ధిగలుగును.

శ్లో. భ్రాతృపే కారకేవాపి శుభయోగే శుభేక్షితే
భావేపి బలసంపన్నే భ్రాతౄణాం వర్ధనం భవేత్.

భ్రాతృస్థానాధిపతిగాని సోదరకారకుడుగాని శుభగ్రహములతో కలసినను శుభగ్రహములచే చూడబడినను సోదరస్థానము శుభగ్రహయుక్తమై యున్నను జాతకునకు సోదరసోదరీవృద్ధి కలుగును.

శ్లో. కేంద్రత్రికోణగేవాపి స్వోచ్చమిత్రస్వవర్గగే
నాథేవా కారకేవాపి భ్రాతృలాభము దీరయేత్.

సోదరస్థానాధిపతిగాని కుజుడుగాని కేంద్రత్రికోణముల యందున్నను స్వక్షేత్రములయందున్నను మిత్రక్షేత్రమందున్నను స్వవర్గయందున్నను సోదరసోదరీలు విశేషముగా నుందురు.

శ్లో. సౌమ్యగ్రహాన్వితేవాపి సౌమ్యనామాంశకే యది
నాథేవా కారకేవాపి భావే సోదరవర్ధనం

సోదరస్థానాధిపతిగాని కుజుడుగాని శుభగ్రహములతో కలసినను శుభాంశలయందున్నను జాతకునకు సోదర సోదరీవృద్ధి కలుగును.

శ్లో. భ్రాతృనాథే స్వతుంగేవా స్వర్క్షే మూలత్రికోణగే
బలాఢ్యే భావనాథే స్యాత్సోదరోత్పత్తిమాదిశేత్

సోదరస్థానాధిపతి ఉచ్చయందుగాని మూలత్రికోణమందుగాని బలముగానున్నయెడల సోదరసోదరీలు విశేషముగా నుందురు.

శ్లో. భ్రాతృపే దేహసంస్థేతు దేహపే భ్రాతృసంస్థితే
ఉభావుభయరాశ్యంశే భూయాద్యమళసంభవః.

సోదరస్థానాధిపతి లగ్నమందుండి లగ్నాధిపతి సోదర స్థానమందుండి లగ్నసోదరస్థానాధిపతులు స్వాంశలయందున్న యెడల కవలసోదర్లు కలిగెదరు.

శ్లో. తృతీయాధిపతిర్దేవా నాయకేనసమన్వితః
పరస్పరం సోదరాణాం యావజ్జీవంచ మిత్రతా.

సోదరస్థానాధిపతియు లగ్నాధిపతియు కలిసినయెడల యెల్లప్పుడును సోదరులతో మైత్రికలవాడగును.

శ్లో. జీవేన సహితస్స్వోచ్చే సంఖ్యా ద్వాదశసోదరాః.

సోదరస్థానాధిపతి గురునితో కలసి బలముగానున్న యెడల 12 గురు సోదరసోదరీలు కలిగెదరు.

శ్లో. నాశస్థితౌ సోదరనాథభౌమౌ పాపేక్షితౌ సోదరనాశ మాహుః। పాపర్క్షగౌ పాపసమాగమౌవా భ్రాతౄన్ సముత్పాద్యవినాశ హేతుః.

సోదరస్థానాధిపతిగాని కుజుడుగాని పాపులచేచూడబడి నను పాపులతోకూడినను పాపగ్రహక్షేత్రముల యందున్నను సోదర సోదరీలు కలిగి నశించెదరు.

శ్లో. నీచర్క్షగౌ సోదరకారకాఖ్యౌ నీచాంశగౌ పాపసమాగ మౌవా క్రూరాది షష్ట్యంశయుతౌ తదానీం భ్రాతౄన్ సముత్పాద్యవినాశహేతుః.

సోదరకారకుడు కుజుడు నీచయందున్నను నీచాంశ యందున్నను పాపగ్రహములతో కూడినను పాపషష్ట్యంశల యందున్నను సోదరసోదరీలు కలిగి నశించెదరు.

శ్లో. పాపగ్రహేసోదరభావయుక్తే స్వోచ్చేథవా పాపనిరీక్షితే స్యాత్ తదీశ్వరే పాపఖగాంతరస్థే సహోదరాణాం కథ యంతినాశం.

సోదరస్థానమందు పాపగ్రహములున్నను సోదరస్థానాధిపతిపాపగ్రహమైనస్వక్షేత్రమందున్నను సోదరస్థానాధిపతి పాపగ్రహములచే చూడబడినను సోదరస్థానాధిపతి పాపగ్రహమధ్యయందున్నను సోదర్లు వుండరు.

శ్లో. పాపాంతరేపాపనిరీక్షితే వాపాపాన్వితేనీచగృహాన్వితేవా
తృతీయభావేశుభఖేచరేంద్రైర్నవీక్షితేసోదరనాశమాహుః

సోదరస్థానముపాపగ్రహమధ్యనున్నను సోదరస్థానమందు పాపగ్రహములున్నను తృతీయస్థానమును శుభగ్రహములు చూడకపోయినను సోదరనష్టము కలుగును.

తృతీయస్థానేరవ్యాదిగ్రహస్థితిఫలం

శ్లో. సహజభవనసంస్థేభాస్కరేవిక్రమీస్యాత్
సుమతిరహితవాదోద్యోగకారిబలాఢ్యః
అపిచధనసమేతో ధైర్యవాన్ఖ్యాతకీర్తిః
బహుజనకృతపూజ్యోభాగ్యవాన్భక్తియుక్తః

తృతీయమందు సూర్యుడున్నయెడల పరాక్రమవంతుడున్ను దుష్టబుద్ధికలవాడును బలవంతుడును ధనవంతుడును ధైర్యవంతుడును. ఖ్యాతిగల పురుషుడును అనేకమందిచే పూజింపబడువాడును భక్తిగలవాడును అగును. మరిన్ని తృతీయస్థానమందు రవియున్నయెడల ధనవంతుడును స్వల్పసోదర్లు కలవాడును పరాక్రమశాలియును అగును.

శ్లో. హింస్రస్సగర్వః కృపణోల్పబుద్ధిర్భవేజ్జనో బంధుజనాశ్ర

యశ్చ।దయాభయాభ్యాంపరివర్జితశ్చద్విజాధిరాజే సహజే ప్రసూతా.

తృతీయమందు చంద్రుడున్న యెడల హింసచేయువాడును గర్వముగలవాడును నేర్పరియును అల్పబుద్ధికలవాడును బంధుజనులను ఆశ్రయించువాడును దయలేనివాడును భయములేనివాడును అగును మరిన్ని చంద్రుడు తృతీయమందున్న యెడల సోదరీవృద్ధిగలవాడును పిరికితనముగలవాడును అగును.

శ్లో. భూపప్రసాదోత్తమ సౌఖ్యముచ్చైరుదారతాచారుపరాక్రమశ్చధనానిచ భ్రాతృసుఖంచస్వల్పం భవేన్నరాణాం సహజేమహీజే.

తృతీయమందు కుజుడున్న యెడల రాజానుగ్రహమువల్ల మిక్కిలి సౌఖ్యమును ఉదారసాహసముగలవాడును విశేషధనవంతుడును స్వల్పభ్రాతృసౌఖ్యముగలవాడును అగును. మరిన్ని కుజుడు తృతీయమందున్న యెడల ధైర్యసాహసములుగలవాడును స్వల్పసోదర్లుగలవాడును అగును.

శ్లో. బహుళితధనపూర్ణో భ్రాతృహంతాతిపాపోబహుతరసుతపత్నీపూర్ణగేహశ్చతుంగే। తరళమతిరలజ్జః క్షీణజంఘః కృశాంగః శిశువయసిచరోగీభ్రాతృసంస్థేకుమారే.

బుధుడు తృతీయమందున్న యెడల విశేషధనవంతుడును సోదరనష్టముగలవాడును పాపుడును కుటుంబవృద్ధికలవాడును మంచిగృహముగలవాడును మంచిబుద్ధిగలవాడును

లజ్జలేనివాడును సన్ననిపిక్కలుగలవాడును కృశించిన శరీరము గలవాడును అగును. బాల్యమందు రోగముగలవాడునుఅగును. మరిన్ని సోదరీవృద్ధిగలవాడును పిరికివాడునుదుర్జనుడునుఅగును.

శ్లో. సహజమందిరగేబృహస్పతీ భవతిసోదర పీడనకృత్సదా
కృపణతాముపగచ్ఛతికుత్సితో ధనయుతోపినసౌఖ్యము
పైష్యతి.

తృతీయమందు గురుడున్నయెడల సోదరనష్టముగల వాడును నేర్పుగలవాడును కుత్సితస్వభావముగలవాడును ధనముగలవాడై నప్పటికి ధనమువల్ల సౌఖ్యములేనివాడును అగును. మరిన్ని గురుడు తృతీయమందున్నయెడల నేర్పుగలవాడును స్వల్పసాహసముగలవాడును స్వల్పసోదర్లుగలవాడును అగును.

శ్లో. సహజమందిరవర్తినిభార్గవేబహుసహోదరవాన్మగిసీయుతః
భవతిలోచనరోగసమాకులోధనయుతఃకృపణశ్చపగానరః.

తృతీయమందు శుక్రుడున్నయెడల సోదరసోదరీవృద్ధిగల వాడును నేత్రరోగముచే వ్యాకులమొందువాడును నేర్పుగల వాడును అగును. మరిన్ని తృతీయమందు శుక్రుడుండెనేని నేర్పుగలవాడును సోదరీవృద్ధి విశేషముగలవాడును మంచి ఆలోచన చేయువాడును అగును.

శ్లో. సహసపద్మగతస్తపనాత్మజః కలయతిస్వసహోదరవర్జితం
రుచిరకాంతియుతం నృపవల్లభంశుభకళత్రసుపుత్రసమన్వితః
తృతీయమందు శనియుండెనేని సోదరులతో కలహించు

వారును సోదరులను వర్జించువారును మంచికాంతిగలవారును మంచికళత్రముగలవారును యోగ్యమగు పుత్రులుగలవారును అగుదురు. మరియు, తృతీయమందు శనియుండెనేని పిరికివాడును సోదరీవృద్ధి విశేషముగా గలవాడును అగును.

శ్లో॥ భ్రాతుర్వినాశంవిదధాతిరాహుస్తృతీయగశ్చేన్మనుజస్యకోపసౌఖ్యంధనంపుత్రకళత్రయోగందదాతితుంగేగవాజిభృత్యాన్

తృతీయమందు రాహువుండెనేని సోదరనష్టముగలవాడును కోపము విశేషముగలవాడును ధనవంతుడును సౌఖ్యవంతుడును పుత్రవంతుడును సత్కళత్రముగలవాడును అగును. రాహువు తృతీయమందు ఉచ్చయందున్నయెడల గజాశ్వాది లాభము గలవాడగును మరియు, రాహువు తృతీయమందున్న యెడల మిక్కిలి ఐశ్వర్యవంతుడును పట్టుదలగలవాడును అగును.

శ్లో॥ శ్రీమాన్ బంధుప్రియస్త్యాగీధర్మబుద్ధియుతస్తథా
యోద్ధాతృతీయగే కేతౌ జాతోభవతిమానవః.

తృతీయమందు కేతువుండెనేని శ్రీమంతుడును బంధుప్రియుడును దాతృత్వముగలవాడును బుద్ధిమంతుడును వీరుడును అగును.

కేతువు తృతీయమందున్నయెడల పుణ్యకార్యములు చేయువాడును స్వల్పముగాకోపముగలవాడును పరాక్రమవంతుడును అగును.

తృతీయస్థానమందు గురుడు బలముగా నున్నను తృతీయస్థానాధిపతి కేంద్రకోణములందుండి గురునితో కలసివున్నను

ఆజాతకునకు 5 లగాయితు 9 గురువరకు సోదరీసోదరులు వుందురు. ఆసోదరస్థానాధిపతి కుజునితో కలిసినయెడల 3 గురు సోదరులుమాత్రము వుందురు. శుక్రునితో కలిసినయెడల 5, 6 గురు సోదరీలు వుందురు. రవితో కలిసినయెడల ఒక్క సోదరుడు వుండును. శనితో కలిసినయెడల సోదరులు ఉండరు. సోదరస్థానమందు చంద్రుడున్నను స్థానాధిపతి చంద్రునితో కలిసియున్నను, సోదరిమాత్ర ముండును. రాహువు సోదర స్థానమం దున్నను సోదరవృద్ధియు, కేతువు సోదరస్థానమం దున్నయెడల సోదరీవృద్ధియు కలుగును. బుధుడు సోదరస్థాన మం దున్నయెడల సోదరీలు స్వల్పముగా నుందురు.

గురుడు సోదరస్థానాధిపతియై కేంద్రకోణములయందున్న యెడల, 5 లగాయితు 8 వరకు, సోదరవృద్ధియు, శుక్రుడు, సోదరస్థానాధిపతియై కేంద్రకోణములయందుగాని ఉచ్ఛయం దుగాని వున్నయెడల. 5, 6 గురువరకు సోదరీవృద్ధియు కలుగును. శుభపాపమిశ్రమైనయెడల సోదరసోదరీలు కలిగి నష్ట పోదురు. పైన వ్రాసినప్రకారము సోదరస్థానమందున్న గ్రహ మును బట్టి గూడ సోదర, సోదరీవృద్ధి తెలసికొనవలెను.

శ్లో. మాతృస్థానే శుభయుతే కారకే శుభసంయుతే
తద్భావపే బలాఢ్యేవాఽమాతురాయుష్య మాదిశేత్.
మాతృస్థానమందు శుభగ్రహమున్నను మాతృకారకుడు

శుభగ్రహముతో కలిసినను మాతృస్థానాధిపతి బలముగానున్నను తల్లికి పూర్ణాయుర్దాయము పట్టును.

శ్లో. చంద్రేబలిష్టేయదివాభృగౌవాసౌమ్యే క్షితేశోభనభావయుక్తే। చతుష్టయేమాతృగృహేచ్చభాఢ్యే మాతుశ్చ దీర్ఘాయురుదాహరంతి.

చంద్రుడుగాని, శుక్రుడుగాని, బలముగానున్నను శుభగ్రహములతో కూడినను చూడబడినను మాతృస్థానము లగాయతు కేంద్రములయందు శుభగ్రహములున్నను తల్లికి పూర్ణాయుర్దాయము పట్టును.

శ్లో. భావేశ సంయుక్తనవాంశనాథ యుక్తాంశనే కేంద్రయుతేబలాఢ్యే। తస్మిన్ శశాంకాద్యది కేంద్రయుక్తే మాతుశ్చ దీర్ఘాయురుదాహరంతి.

చతురస్థానాధిపతి యేనవాంశయందుండునో ఆనవాంశాధిపతి కేంద్రమందుండి బలముగానున్నను తల్లికి పూర్ణాయుర్దాయము పట్టును.

శ్లో. పాపాంతరే పాపయుతే శశాంకే పాపేక్షితే మాతృగృహేవినాశః। శుక్రాత్తథైవం ప్రవదంతిసంతః తత్థ్సానపాద్యా కథయంతిశేషం.

చంద్రుడు పాపగ్రహములతో కలిసినను పాపగ్రహముచే చూడబడినను మాతృస్థానమందు పాపగ్రహములున్నను శుక్రుడు పాపగ్రహములతో కలియుటచేతను మాతృస్థానమందు పాపగ్రహముచే చూడబడినను మాతృనాశనము కలుగును.

శ్లో. నిశాకరాత్సాపయుతేస్మరేవా భృగోస్తథైవం జననీవినాశనం । శుభేశనే ౽మాతృవినాశమేతి పాపే క్షితేచేదచిరేణ నాశం.

శుక్రునికి సప్తమమందు పాపగ్రహమున్నను చంద్రునికి సప్తమమందు పాపగ్రహమున్నను మాతృనాశనము గలుగును, మాతృస్థానమందు శనియుండి పాపగ్రహములచే చూడబడిన యెడల త్వరలోనే మాతృమారకము కలుగును.

శ్లో. క్షీణచంద్రోష్టమే షష్ఠే వ్యయేవాపాపసంయుతః
పాపాంశే పాపసంయుక్తః మాతుర్మరణమాదిశేత్.

క్షీణచంద్రుడు షష్టాష్టవ్యయములయందున్నను పాపగ్రహములతో కలిసినను చూడబడినను చంద్రుడు పాపాంశలయందున్నను తల్లిత్వరలో చనిపోవును.

శ్లో. మాతృస్థానగతేచంద్రే పాపగ్రహనిరీక్షితే
జలాధిపతినీచస్థె మాతుర్మరణమాదిశేత్.

చంద్రుడు చతుర్థమందుండి పాపగ్రహముచే చూడబడినను మాతృస్థానాధిపతి నీచయందున్నను మాతృమారకము గలుగును. స్థానాధిపతి నీచయందున్నమాత్రమున మాతృమారకము కలుగును. పాపగ్రహముచే చూడబడుచుండవలెను.

శ్లో. గేహాధిపే కేంద్రగతే బలాఢ్యే సౌమ్యేక్షితేమందిర లాభమాహుః వైశేషికాంశేపరమోచ్చభాగేగేహేశ్వరేమం

దిరలాభమాహు। గృహస్థానాధిపస్థాంశ నాథసంయుక్త
రాశయః। తదంశాధిపతౌ కేంద్రే గృహలాభముదీరయేత్.

గృహస్థానాధిపతి కేంద్రమందు బలముగానున్న యెడల గృహలాభము కలుగును. గృహస్థానాధిపతి వైశేషికాంశయందున్నను పరమోచ్చయందున్నను గృహలాభము కలుగును. గృహస్థానాధిపతియున్న నవాంశాధిపతి బలముగానున్న యెడల గృహలాభము కలుగును.

శ్లో. భాగ్యేశే కేంద్రభావస్థే గృహేశస్యోచ్చమిత్రగే। గృ
హరాశిగతే ఖేటేస్వోచ్చే బహువిచిత్రకే.

భాగ్యాధిపతి కేంద్రమందుండి గృహాధిపతి ఉచ్చయందు గాని మిత్రక్షేత్రమందు గాని యున్నను, జాతకునకు చిత్రమైన గృహము లుండును.

శ్లో. తృతీయేసౌమ్యసంయుక్తే గృహేశే స్వబలాన్వితే
తదీశేబలసంపూర్ణేహర్మ్యప్రాకారమండితే.

తృతీయమందు బుధుడుండి గృహస్థానాధిపతి బలముగానుండి గృహస్థానాధిపతియున్న స్థానాధిపతి బలముగానున్న యెడల ఆజాతకునకు మేడయుండును.

శ్లో. సింహాసనాంశకేవాపి గృహేశే గోపురాంశకే
మృద్వంశాదియుతేవాపితద్గృహంసౌధమండితే

గృహస్థానాధిపతి సింహాసనాంశయందున్నను గోపురాంశయందున్నను మృద్వంశాంశయందున్నను జాతకునకు మేడను మంచిగృహముండును.

శ్లో. బంధుస్థానేశ్వరేసౌమ్యే సౌమ్యగ్రహనిరీక్షితే
తత్కారకేబలాఢ్యేవా బంధుపూజ్యోభవేన్నరః.

చతుర్థమందు శుభగ్రహముండి బంధుస్థానాధిపతి బలముగానుండి చతుర్థస్థానమును శుభగ్రహములు చూచుచుండిన యెడల బంధువులచే పూజింపబడువాడు అగును.

శ్లో. బంధుస్థానంగతే జీవేతదీశే శుభసంయుతే
గురుదృష్టి సహాయుక్తే బంధుశ్రేష్ఠోభవేన్నరః

చతుర్థమందుగురుడున్నను చతుర్థాధిపతి బలముగానున్నను చతుర్థస్థానమును గురుడుచూచినను జాతకుడు బంధువులకు శ్రేష్ఠుడగును.

శ్లో. బంధుద్వేషీభవేన్నిత్యం పాపాక్రాంతే గ్రహే యదా
నీచాస్తఖేట సంయుక్తే శుభదృగ్యోగవర్జితే.

చతుర్థమందు పాపగ్రహమున్నను చతుర్థాధిపతి పాపగ్రహములతో కలిసినను చతుర్థాధిపతి నీచయందున్నను అస్తంగతుడైనను నీచయందున్న గ్రహముతో చేరినను జాతకుడు బంధుద్వేషియగును.

శ్లో. గృహేశే కర్మరాశిస్థే కర్మేశే గృహమాగతే
బలయుక్తే ధరాసూనౌ బహుక్షేత్రంవినిర్దిశేత్.

చతుర్థాధిపతి దశమమందుండి దశమాధిపతి చతుర్థమందుండి కుజుడు బలముగానున్న యెడల జాతకునకు భూమివిశేషముగా నుండును.

శ్లో. బలాఢ్యే కర్మరాశీశే బంధుస్థానాధిపే యథా
తయోర్మైత్రీ యదాతస్య బహుక్షేత్రం వినిర్దిశేత్.

దశమాధిపతి బలముగానుండి చతుర్థస్థానాధిపతి గూడ బలముగానున్నను లేక చతుర్థదశమాధిపతులకు మైత్రతయున్నను జాతకుడు మిక్కిలి భూజాతకుడగును.

శ్లో. క్షేత్రస్థానేశుభైర్యుక్తే తదీశే శుభసంయుతే
తత్కారకే తథాప్రాప్తే బహుక్షేత్రధనైర్యుతః.

చతుర్థమందు శుభగ్రహములున్నను క్షేత్రస్థానాధిపతి శుభగ్రహములతో కలిసినను భూకారకుడు కుజుడు శుభగ్రహములతో కలిసినను జాతకుడు మిక్కిలి భూజాతకుడగును.

శ్లో. క్షేత్రాధిపేపంచమస్థే గోపురాంశాదిసంయుతే
మృద్వంశాదిగతేనాపి బహుక్షేత్రసమన్వితః.

భూస్థానాధిపతి పంచమమందుండి గోపురాంశయందున్నను మృద్వంశయందున్నను విశేష భూములు గలవాడు అగును.

శ్లో. భ్రాతృకారకసంయుక్తే భ్రాతృనాథేనసంయుతే
క్షేత్రేతదీశ్వదువాపి భ్రాతృక్షేత్రంవినిర్దిశేత్.

భూస్థానాధిపతి కుజునితో కలిసినను సోదరస్థానాధిపతి భూస్థానమందున్నను జాతకునకు సోదర సంబంధమగు భూమి కలియును.

శ్లో. లగ్నేశ్వరే క్షేత్రగతేబలాఢ్యే లగ్నేబలిష్ఠేయదిక్షేత్ర

నాథే శుభగ్రహైర్దృష్ట సమాగమేవా క్షేత్రంస్వకీయేన బలేనయాతి.

లగ్నాధిపతి చతుర్థమందు బలముగానున్నను భూస్థానాధిపతి లగ్నమందు బలముగా నున్నను శుభగ్రహములతో కూడినను చూడబడినను జాతకుడు స్వార్జితమువల్ల విశేష భూసంపాదన చేయువాడు అగును.

శ్లో. కళత్రాకారకక్షేత్రే తదీశేవాకళత్రగే
తదీశయోస్తదామైత్రిం కళత్రక్షేత్రమాదిశేత్.

భూస్థానాధిపతి కళత్రస్థానమం దున్నను కళత్రస్థానాధిపతి భూస్థానమందున్నను కళత్రస్థానాధిపతికి భూస్థానాధిపతికి మైత్రత యున్నయెడల జాతకునకు కళత్రసంబంధమగు భూమి కొంత కలియును.

శ్లో. ధనేశలాభేశసమన్వితేవా క్షేత్రేతదీశేస్యధకారకేవా
వైశేషికాంశే శుభదృష్టియోగే ప్యనేక భూసంగ్రహ
మాహారార్యాః.

ధనలాభాధిపతులు భూస్థానాధిపతితో గాని భూకారకుడగు కుజునితోగాని కలిసినను ధనలాభాధిపతులకు శుభదృష్టి యున్నను వైశేషికాంశలయం దున్నపుడు స్వార్జితమువల్ల భూసంపాదనచేయువాడు అగును.

శ్లో. క్షేత్రేశ్వరేసచగతేవిమూఢేపాపాంతరేపాపనిరీక్షితేవా
పాపగ్రహక్షేత్రగతేరి గేహేక్షేత్రాదినాశంకథయంతితజ్ఞాః.

భూస్థానాధిపతి నీచయందున్నను అస్తంగతుడయినను పాపగ్రహములచే చూడబడినను పాపగ్రహక్షేత్రములయందున్నను శత్రుక్షేత్రమందున్నను భూనాశనమగును.

శ్లో. వాహనేశేబలయుతే వాహనే శుభసంయుతే
శుభగ్రహేణసందృష్టే వాహనాదిఫలంలభేత్.

వాహనస్థానాధిపతి బలముగానున్నను వాహనస్థానమందు శుభగ్రహములున్నను శుభగ్రహములచే చూడబడినను జాతకునకు వాహనసౌఖ్యము కలుగును.

శ్లో. సువర్ణవస్త్రాభరణాదియానం శుక్రాద్వదేత్తత్సుఖరాశి
తోవానేదా చతుర్థాధిపతౌ విలగ్నే లగ్నేశ్వరేణాపి
యుతేశ్వలాభః.

సువర్ణవస్త్రాభరణములు శుక్రునివల్లగాని చతుర్థస్థానమువల్లగాని చెప్పవలసియున్నది. చతుర్థాధిపతి చంద్రునితో కలిసి లగ్నమందున్నను లగ్నాధిపతితో కలిసినను, అశ్వవాహనసౌఖ్యము కలుగును.

శ్లో. శుక్రేణయుక్తేయదివాహనేశేదేవాన్వితేవా నరవాహనాది దేవేంద్రపూజ్యే నయుతేత్రలగ్నే వదంతిసంతశ్చతురంతయానం.

శుక్రునితో వాహనస్థానాధిపతికలిసి లగ్నమందున్న యెడల అందోళికాదివాహనసౌఖ్యముకలుగును. లగ్నమందు గురుడుండి శుక్రునితో వాహనాధిపతి కలిసినయెడల విశేష వాహనసౌఖ్యముగలవాడగును.

శ్లో. భాగ్యేశ లగ్నేశ చతుర్థనాథాః కర్మస్థితానీచవిమూఢ
హీనాః. కర్మేశ్వగేహాపియుతే విలగ్నే సింహాసనప్రాప్తి
ముదాహరంతి.

భాగ్యాధిపతియు లగ్నాధిపతియు చతుర్థాధిపతియు దశమమందుండి నీచస్థులును అస్తంగతులును కాకయున్న యెడల జాతకునకు సింహాసనయోగము కలుగును.

శ్లో. భాగ్యాధిపేనసహితేయది వాహనేశే జీవేక్షితేనుగతే
బలపూర్ణయుక్తే। స్వక్షేత్రతుంగసహితేయది వాత్రికోణే
భూనాథమానవశాద్ధనవాహనాదిః.

వాహనాధిపతితో భాగ్యాధిపతికలిసి గురునిచే చూడబడుచు లగ్నమందుండి బలముగానున్నను స్వక్షేత్రమందుగాని ఉచ్ఛయందుగాని యున్నను రాజమూలకముగా భూలాభము కలుగును.

శ్లో. ధనేశేలగ్నభావస్థే కర్మేశేధనరాశిగే। వాహనేస్వోచ్ఛ
ఖేటస్థే వాహనాధిపతిర్భవేత్.

ధనాధిపతి లగ్నమందున్నను దశమాధిపతి ద్వితీయమందును వాహనస్థానమందు ఉచ్ఛగ్రహమును వున్నయెడల జాతకుడు వాహనములకు అధిపతియగును.

శ్లో. లగ్నవాహనభాగ్యేశాః అన్యోన్యం కేంద్రమాశ్రితాః
లగ్ననాథేబలాఢ్యేవా వాహనాధిపతిర్భవేత్.

లగ్నాధిపతికి కేంద్రమందు వాహనాధిపతియు వాహ

నాధిపతికి కేంద్రమందు భాగ్యాధిపతియుండి లగ్నాధిపతిబల
ముగా నున్న యెడల వాహనాధిపతియగును.

అథ చతుర్థస్థితరవ్యాదిగ్రహాఫలం

శ్లో. సౌఖ్యేన యానేన ధనహీనం తాతస్యచింతోపహతః
ప్రవృత్తం । చలంనివాసంకురుతే పుమాంసం పాతాళశా
లీనలినీ విలాసీ.

చతుర్థమందు రవియున్నయెడల ధనవాహన సౌఖ్య
ములు లేనివాడును తండ్రికివ్యతిరేకముగా సంచరించువాడును
స్థిరములేని నివాసము గలవాడును అగును. మరిన్ని చతుర్థ
మందు రవి యున్నయెడల జాతకుడు సుఖములేనివాడును
నిశ్చింత గలవాడును మాతృసౌఖ్యము లేనివాడును భూవ్యయ
ము చేయువాడును అగును.

శ్లో. జలాశ్రయోత్పన్నధనోపలబ్ధిం కృష్యంగనావాహన
సూనుసౌఖ్యం । ప్రసూతి...లేకురుతేకలావాన్ పాతాళ
సంస్థె ద్విజదేవభక్తిం.

చంద్రుడు చతుర్థమందున్నయెడల జలాశ్రయమువల్ల
కలిగిన ధనలాభము గలవాడును కృషివాహన స్త్రీపుత్రసౌఖ్య
ము గలవాడును దేవబ్రాహ్మణభక్తి గలవాడును అగును.

మరిన్ని చంద్రుడు చతుర్థమందున్న యెడల మాతృ
విద్యాసౌఖ్యము గలవాడును వాహన ప్రాసాదయోగములు
గలవాడును అగును.

శ్లో. జడమతిరతిదీనో బంధుసంస్థేతుభౌమే నభవతికుల ముఖ్యోబంధుహీనోతిదుఃఖీ । వసతిచపరదేశే నీచసేవాను రక్తః పరగృహావసుభోక్తాచంచలశ్చాల్పభోగీ.

కుజుడు చతుర్థమందున్న యెడల మూర్ఖుడును మిక్కిలి దీనుడును, కులాధముడును స్వల్పబంధువులు గలవాడును మిక్కిలి దుఃఖము అనుభవించువాడును పరదేశనివాసియు నీచులను సేవించువాడును పరగృహములయందు భోజనము చేయువాడును చంచలస్వభావము గలవాడును అల్పభోగియు అగును.

మరిన్ని చతుర్థమందు కుజుడున్నయెడల మాతృసౌఖ్యము లేనివాడును బంధుద్వేషియును విద్యావిఘ్నముగలవాడును అగును.

శ్లో. సద్వాహనైర్ధాన్యధనైస్సమేతః సంగీత నృత్యాభిరుచిర్మనుష్యః విద్యావిభూషాగమనాధిశాలీ పాతాళగేశీతలభానుసూనౌ.

బుధుడు చతుర్థమందున్న యెడల ధనధాన్యవృద్ధిగలవాడును వాహానసౌఖ్యము గలవాడును సంగీతము నృత్యము వీనియందు అభిరుచిగలవాడును విద్యావంతుడును అగును. మరిన్ని బుధుడు చతుర్థమందున్న యెడల విద్యావంతుడును మాతృవాహానభూసౌఖ్యములు గలవాడును అగును.

శ్లో. సన్మాననాధనవాహనాఢ్యా స్సజాతహర్షః పురుషస్స
 దైవ। స్వానుకంపానముపాత్తసంపద్దంభోళిభృన్మంత్రిణి
 భూతలస్థే.

గురుడు చతుర్థమందుండెనేని రాజసన్మానముగలవాడై వాహనసౌఖ్య విశేషసంపాదనయు గలవాడగును. మిక్కిలి సంతోషముగలవాడును రాజానుగ్రహము వలన విశేషధన మార్జించువాడును అగును.

మరిన్ని గురుడు చతుర్థమందున్న యెడల భూమి విద్య వాహనము సుఖము బంధువృద్ధియు గలవాడగును.

శ్లో. భవతిబంధుగతె భృగునందనె। బహుకళత్రరతో బహు
 కామునః। నవమపేసుఖభావగతెతథా। బహుళభాగ్యయుత
 స్సుఖభాగధీః.

చతుర్థమందు శుక్రుడున్న యెడల విశేషకామముకలిగి బహుస్త్రీలతో రమించును. ఆశుక్రుడు నవమాధిపతియై చతుర్థమందున్నయెడల మిక్కిలి భాగ్యవంతుడును సౌఖ్యవంతుడును అగును.

మరిన్ని చతుర్థమందు శుక్రుడున్న యెడల సంగీతసాహిత్యవాహనసౌఖ్యములు గలవాడును పండితుడును అగును.

శ్లో. బంధుస్థితె భానుసుతేనరాణాం జాతస్యనష్టాః క్రమ
 శోహిబంధవః। స్త్రీపుత్రగేహార్థవినాశనంచ। స్థానాంతరం
 యాతిసుఖేనహీనః.

చతుర్థమందు శనియున్న యెడల క్రమక్రమముగా బంధువులందరు నశించెదరు. గృహములు భూములు మొదలైనవి నశించును. సౌఖ్యములేనివాడై పరస్థలమందు నివాసము చేయును. మరిన్ని శని చతుర్థమందున్న యెడల మాతృసౌఖ్యము లేనివాడును భూవ్యయముగలవాడును యెల్లపుడును దుఃఖము లనుభవించువాడు అగును.

శ్లో. సుఖగతే రవిచంద్రవిమర్దనే । సుఖవినాశనతాం మనుజో లభేత్॥ స్వజనతాంసుఖమిత్రసుఖంనరో నలభతేచసదా భ్రమణాంనృణాం.

రాహువు చతుర్థమందున్న యెడల సౌఖ్యములేనివాడును బంధువులవల్లను దారాపుత్రాదులవల్లను సౌఖ్యములేనివాడును మతిభ్రమణముగలవాడును అగును.

మరిన్ని రాహువు చతుర్థమందున్న యెడల సౌఖ్యము లేనివాడును స్వల్పభూములుగలవాడును పిశునత్వముగలవాడును బంధుద్వేషియు అగును.

శ్లో. చతుర్థేచమాతుస్సుఖన్నొకదాచిత్ । సుహృద్వర్గతః పితృతో నాశమేతి । శిఖీబంధుహీనః సుఖంస్యాచ్ఛగేహేచిరం నయతి సర్వేర్వ ంఃసదావ్యగ్రతాచ.

కేతువు చతుర్థమందున్న యెడల మిత్రులయొక్క సౌఖ్యములేనివాడును పితృనష్టము గలవాడును బంధువులు స్వల్పముగానుండువాడును మాతృసౌఖ్యములేనివాడును మిక్కిలి తొందరకలవాడును అగును. ఆ కేతువు చతుర్థమందుఉచ్చయందున్న యెడల సౌఖ్యము గలవాడగును

మరిన్ని చతుర్థమందు కేతువున్నయెడల కుత్సితస్వభావముగలవాడును మలినుడును దుష్టస్వభావము గలవాడును అగును.

పుత్రభావము.

శ్లో. పుత్రస్థానే తదీశే వా గురౌ వా శుభవీక్షితే। శుభేనసహితేవాపి పుత్రప్రాప్తిర్న సంశయః.

పుత్రస్థానముగాని పుత్రస్థానాధిపతిగాని గురుడుగాని శుభగ్రహములచే చూడబడుచున్నను శుభగ్రహములతో కలిసినను జాతకునకు పుత్రసంతానవృద్ధి కలుగును.

శ్లో. లగ్నేశే పుత్రభావస్థేపుత్రేశేబలసంయుతే। పరిపూర్ణబలేజీవె పుత్రప్రాప్తిర్న సంశయః.

లగ్నాధిపతి పుత్రస్థానమందుండి పుత్రస్థానాధిపతి బలముగానుండి గురుడుగూడ బలముగానున్నయెడల జాతకునకు సంతానము విశేషముగా నుండును.

శ్లో. పుత్రస్థానాధిపేజీవే పరిపూర్ణ బలాన్వితే। లగ్నాధిపేనవాదృష్టే పుత్రప్రాప్తి ర్న సంశయః.

పుత్రస్థానాధిపతి గురుడై పరిపూర్ణబలముగానుండి లగ్నాధిపతిచే చూడబడుచుండినయెడల జాతకునకు తప్పక సంతానయోగము గలదు.

శ్లో. వై శేషికాంశకే జీవేపుత్రేపితథాస్థితె। శుభగ్రహేణ వాదృష్టే। పుత్రప్రాప్తింసమాదిశేత్.

గురుడు వైశేషికాంశయందుండి పుత్రస్థానాధిపతికూడ వైశేషికాంశయందుండి శుభగ్రహముచే చూడబడుచున్న యెడల తప్పక పుత్రసంతానము కలుగును.

శ్లో॥ పుత్రస్థానగతే విత్తనాథేపూర్ణ బలాన్వితే। దృష్టే దేవేంద్ర గురుణా పుత్రప్రాప్తిర్న సంశయః

ద్వితీయాధిపతి పంచమమందు బలముగానుండి గురునిచే చూడబడినయెడల తప్పక పుత్రయోగము కలుగును.

శ్లో. లగ్నపుత్రాదిపౌయుక్తౌ అన్యోన్యంచాపివీక్షితౌ। క్షేత్రే పరస్పరస్థావా పుత్రప్రాప్తిర్న సంశయః.

లగ్నపంచమాధిపతులు కలిసినను పరస్పర వీక్షణ మున్నను పుత్రస్థానమందు లగ్నాధిపతియు లగ్నమందు పుత్రస్థానాధిపతియు వున్నను తప్పక పుత్రసంతాన యోగము కలుగును.

శ్లో. లగ్నపుత్రాధిపౌ కేంద్రేశుభగ్రహసమన్వితే। కుటుంబేశే బలాఢ్యేతు పుత్రప్రాప్తిర్న సంశయః.

లగ్నాధిపతియు పంచమాధిపతియు కేంద్రమందుండి శుభగ్రహముతో కలిసినను కుటుంబాధిపతి బలముగానున్నను జాతకునకు పుత్రసంతానము కలుగును.

శ్లో. పుత్రస్థానాధిపస్థాంశ రాశీశేశుభసంయుతే। శుభేనవీక్షితే వాపి పుత్రప్రాప్తిర్న సంశయః.

పుత్రస్థానాధిపతి ఏఅంశయందుండునో ఆరాశ్యధిపతిశుభ గ్రహముతో కలిసినను చూడబడినను పుత్రసంతానముకలుగును.

శ్లో. లగ్నేశేదారభావస్థేభాగ్యేశే దారసంయుతే । ద్వితీయే
శేవిలగ్నస్థే పుత్రప్రాప్తిర్నసంశయః.

లగ్నాధిపతి సప్తమమందుండి భాగ్యాధిపతి సప్తమాధిపతితో కలిసి ద్వితీయాధిపతి లగ్నమందున్న యెడల తప్పక సంతానము కలుగును.

శ్లో. పుత్రస్థానే బుధక్షేత్రే మందక్షేత్రేఽథవాపునః.
మందమాందీయుతేదృష్టే తథాదత్తాదయస్సుతాః.

పంచమస్థానమున శని బుధక్షేత్రములై ఆశని బుధక్షేత్రములయందు శనిగుళికులున్నను చూచినను దత్తపుత్రయోగము గలుగును.

శ్లో. అంగనాత్పంచమేసౌమ్యేలగ్నాత్కామేధరాసుతే
కారకే మేషసంస్థేచ దత్తపుత్రోభవిష్యతి.

కన్యకు పంచమమున బుధుడుండి లగ్నాత్ సప్తమమున కుజుడుండి గురుడు మేషమందున్నయెడల దత్తపుత్రయోగము గలుగును.

శ్లో. మకరస్యభవేల్లగ్నాత్పంచమేమందభూమిజౌ
కారకే బలహీనేచ దత్తపుత్రోభవిష్యతి.

మకరలగ్నమునకు పంచమమందు శని కుజు లున్న యెడల దత్తపుత్రయోగము కలుగును.

శ్లో. గురులగ్నేశదారేశ పుత్రస్థానాధిపేషుచేత్
సర్వేషు బలహీనేషు వక్తవ్యాత్వనపత్యతా.

లగ్నాధిపతియు గురుడును సప్తమాధిపతియు ముగ్గురు బలహీనముగా నున్నయెడల ఆజాతకునకు సంతానయోగము లేదు.

శ్లో. పుత్రస్థానగతేపాపే తదీశేపాపమధ్యగే
శుభదృష్టివిహీనేవావక్తవ్యాత్వనపత్యతా

పుత్రస్థానమందు పాపగ్రహము యుండి పుత్రస్థానాధిపతి పాపగ్రహముయొక్క మధ్యమునుండి శుభగ్రహదృష్టి లేని యెడల ఆజాతకునకు సంతానయోగములేదు.

శ్లో. పాపమధ్యేతుతద్భావే తదీశేపితథాస్థితే
కారకేపాపసంయుక్తే పుత్రనాశంవదేత్తదా.

పుత్రస్థానము పాపమధ్యస్థమయినను పుత్రస్థానాధిపతి పాపగ్రహమధ్యయందున్నను ఆజాతకునకు పుత్రులు గలిగి నశించెదరు.

శ్లో. క్రూరాంశే పుత్రభావేశే నీచమూఢసమన్వితే
పాపైర్దృష్టే థవాదుస్థే పుత్రనాశంవదేత్తదా

పుత్రస్థానాధిపతి పాపాంశయందున్నను అస్తంగతుమైనను నీచయందున్నను పాపగ్రహములచే చూడబడినను పాపస్థానములయందున్నను జాతకునకు సంతాననష్టము కలుగును.

శ్లో. పుత్రస్థానాధిపే దుస్థేక్రూరషష్ట్యంశసంయుతే
క్రూరగ్రహేణవాదృష్టే పుత్రనాశంవదేత్సదా.

పుత్రస్థానాధిపతి షష్టాష్టవ్యయముల యందుండి పాపగ్ర

హములచే చూడబడుచున్న యెడల పుత్రసంతాననాశనము కలుగును.

శ్లో. కారకేబలసంయుక్తే శుభగ్రహనిరీక్షితే । పరంతుపుత్ర స్వీకారా న్నాగసోజాయతేసుతః.

పుత్రకారకుడు గురుడు బలముగానుండి శుభగ్రహము చే చూడబడుచున్న యెడల దత్తస్వీకారానంతరమున కొమారుడు కలుగును.

శ్లో. పుత్రస్థానగతే రాహౌపుత్రేశసహితోయది । శుభై రవీక్షితే వింద్యాత్సర్పదష్టాత్సుతక్షయః.

పుత్రస్థానమందు రాహువుండి పుత్రస్థానాధిపతితో కలిసి శుభగ్రహములచే చూడబడకుండెనేని జాతకునియొక్క పుత్రుడు సర్పమువల్ల మృతినొందువాడగును.

అథపుత్రస్థానేరవ్యాదిగ్రహస్థితిఫలం

శ్లో. తనయభవనయాతే భాస్కరేబాల్యదుఃఖం । నభవతిధన భోగీయౌవనేచారియుక్తః । జనయతిసుతమేకం స్వార్జిత ద్రవ్యభోగీ । చపలకఠినచిత్తః క్రూరకర్మాకుచేలః.

పంచమమందు రవియుండెనేని బాల్యమందు దుఃఖమును స్వల్పభోగియును ధనములేనివాడును యవ్వనమందు కష్టములు అనుభవించువాడును ఏకపుత్రసంతానము కలవాడును కష్టార్జితమువల్ల ద్రవ్యము సంపాదించి అనుభవించువాడును చపలుడును కఠినస్వభావము గలవాడును క్రూరవ్యాపారములు చేయువాడును మలినవస్త్రములను ధరించువాడును అగును.

మరిన్ని రవి పంచమందున్న యెడల స్వల్పసంతానము గలవాడును సామాన్యధనవంతుడును చురుకైనబుద్ధిగలవాడును అగును.

శ్లో. తనయభవనయాతే। చంద్రమస్యర్ధపూర్ణస్సుఖయుతబహుభోక్తామాతృహీనశ్చబాల్యే। తనయసుఖసమేతః పాపయుక్తే శశాంకే। హరతిసుతసుఖం తన్మాతృసౌఖ్యేనసాకం.

పంచమమందు చంద్రుడున్న యెడల విశేషధనవంతుడును సుఖవంతుడును భోగవంతుడును తల్లిలేనివాడును పుత్రసంతానసౌఖ్యము గలవాడును అగును. చంద్రుడుపాపుడై పంచమమందున్న యెడల సంతానసౌఖ్యము లేనివాడును స్వల్పభోగియు అగును. మరిన్ని చంద్రుడు పంచమమందుండెనేని స్త్రీ సంతానాభివృద్ధి గలవాడును కుటుంబసౌఖ్యము గలవాడును అగును.

శ్లో. తనయభవనసంస్థె భూమిపుత్రేనరాణాంభవతితనయ శోకశ్చంద్రతో దేవపూజ్యాత్। అపితనుతనుభాభ్యాం వాదిముఖ్యో జయీస్యాత్। కఠినకృపణవృత్తిస్సంగతేచైకపుత్రః

పంచమమందు కుజుడుండెనేని పుత్రశోకమును చంద్రునితోగాని కుజునితోగాని కూడినయెడల వాదులలోముఖ్యుడును జయమును పొందువాడును కఠినమైనటువంటిన్ని నేర్పరియైనటువంటిన్ని వ్యాపారముగలవాడును అగును. కుజుడు పంచమమందు ఉచ్ఛలయందుండెనేని, పుత్రసంతానముమాత్రము కలుగును.

మఱిన్ని కుజుడు పంచమమందుండెనేని స్వల్పసంతాన ముగలవాడునుకోంచెము కఠిన స్వభావముగలవాడును అగును.

శ్లో. తనయమందిరగే శశినందనే । సుతకళత్రయుతస్సుతభాగ్య వాన్ । వికచపంకజచారుముఖతః । కవిర్గురుజన ద్విజభక్తి యుతశ్శుచిః.

పుత్రస్థానమందు బుధుడుండెనేని పుత్రులతోను కళత్రముతోను సౌఖ్యమును పొందువాడును పుత్రులవల్ల భాగ్యవంతుడును తామరపద్మమువంటి ముఖముగలవాడును కవిత్వము చేయువాడును దేవబ్రాహ్మణభక్తిగలవాడును గురుభక్తిగలవాడును అగును.

మఱిన్ని బుధుడు పంచమమందుండెనేని స్త్రీసంతానవృద్ధిగలవాడును భోగవంతుడును అగు.

శ్లో. ప్రచురపుత్రకళత్రసమన్విత స్సురగురౌ సుతగేహానగేనరః । రుచిరకాంతియుతః ప్రియకర్మణో భవతి సర్వజనాభిమతక్రియః.

పుత్రస్థానమున గురుడుండెనేని పుత్రసంతానము విశేషముగా గలవాడును యోగ్యమగు కళత్రము గలవాడును కాంతిగలస్వరూపముగలవాడునుస్నేహితులయొక్క దర్శనమును సర్వజనులకు యిష్టమైనకార్యములు చేయుటయుకలుగును మఱిన్ని గురుడుపంచమమందుండెనేని పుత్రసంతానాభివృద్ధి గలవాడు వాడు పుత్రులవల్ల పేరుప్రతిష్టలు సంపాదించువాడు అగును.

శ్లో. తనయమందిరగేభృగువంశజే । తనుసుతస్వజనైః పరిపూజిత

బహుధనోగుణవాన్న నాయకో । భవతి చారుమతిస్సురతి ప్రియః.

పంచమమందు శుక్రుడుండెనేని బంధువుల చేతను స్నేహితులచేతను పుత్రులచేతను పూజింపబడువాడును విశేష ధనవంతుడును గుణవంతుడును మంచిఅధికారము గలవాడును మంచిబుద్ధికలవాడును స్త్రీలోలుడును అగును.

మఱిన్ని శుక్రుడు పంచమమందుండెనేని స్త్రీసంతాన వృద్ధికలవాడు భోగభాగ్యములు అనుభవించువాడును అగును.

శ్లో. శనైశ్చరే పంచమశత్రుగేహే।పుత్రార్థహీనోభవతీహదుః ఖితుంగేస్వకెమిత్రగృహేచపంగాపుత్రార్థభోగీభవతీతి కేచిత్.

శని పంచమమందు శత్రుక్షేత్రమందుగాని నీచయందు గాని ఉన్నయెడల పుత్రులులేనివారును ధనములేనివారును దుఃఖములు అనుభవించువారును అగుదురు. ఆశనిపంచమ మందు, ఉచ్ఛయందుగాని మిత్రక్షేత్రమందుగాని స్వక్షేత్ర మందుగాని యున్నయెడల 1 పుత్రసంతానము గలవాడు భోగియు అగును.

మఱిన్ని శని పంచమమందున్నయెడల సౌఖ్యహీనుడు ను ధనములేనివాడును అల్పసంతానవంతుడును అగును.

శ్లో. రాహూసుతస్థెశశిభానుగేహే।పుత్రస్యహాంతా కుపితస్స దైవ। దేశాంతరంయాతి సుతైకిమాత్రందత్తేతినీచంకులి సంకుచేలం-

రాహువు పంచమమందు రవిచంద్రక్షేత్రములయందుం

డెనేని పుత్రులులేనివాడును కోపస్వభావముగలవాడును దేశాటనములు చేయువాడును దత్తసంతానయోగముగలవాడును నీచస్వభావముగలవాడును మలినవస్త్రములను ధరించు వాడును అగును.

మరిన్ని రాహువు పంచమమందుండెనేని స్త్రీసంతానము గలవాడును సౌఖ్యములేనివాడును అగును.

శ్లో. లేఖకోగణితజ్ఞశ్చ । క్రూరచిత్తసక్తథా కలహీచపితృ ద్వేషీచ కేతౌపంచమభావగే.

పంచమమందు కేతువుండెనేని గణితశాస్త్రము తెలిసినవాడును బాగుగా వ్రాయువాడును సర్వజనులతో కలహించువాడును తండ్రిని ద్వేషించువాడును అగును.

మరిన్ని కేతువు పంచమమందుండెనేని అల్పసంతానము గలవాడును నేర్పరియు అగును.

## 6 శత్రుభావము

శ్లో. శత్రుస్థానాధిపే కేంద్రే పాపగ్రహనిరీక్షితే। షష్టేవాపాప బాహుళ్యే । శత్రుపిడాంవినిర్దిశేత్.

శత్రుస్థానాధిపతి పాపగ్రహములచే చూడబడుచున్నను షష్టమందు పాపగ్రహము లున్నను జాతకునకు శత్రువృద్ధివిశేషముగా నుండును.

శ్లో. లగ్నేశే శత్రుభావస్థే । తదీశే లగ్నరాశిగె । మందమాంద్యగు సంయుక్తే శత్రుపీడాంవినిర్దిశేత్.

లగ్నాధిపతి శత్రుస్థానమందుండి శత్రుస్థానాధిపతి లగ్న

మందుండి శనితోగాని గుళికునితోగాని కూడినయెడల జాతకునకు శత్రువృద్ధి విశేషముగా నుండును.

శ్లో. పాపగ్రహేణసందృష్టే । బలహీనేరినాయకే । పాపాంతరగతేవాపి । శత్రుపీడాంవినిర్దిశేత్.

శత్రుస్థానాధిపతి బలహీనముగానుండి పాపగ్రహములచే చూడబడుచున్నను శత్రుస్థానాధిపతి పాపగ్రహమధ్యయందున్నను జాతకునకు శత్రువృద్ధి విశేషముగా నుండును.

శ్లో. శత్రుస్థానాధిపేదుస్థేనీచెమూఢారిసంయుతే । లగ్నేశే బలసంయుక్తే । శత్రునాశంవదేద్బుధాః.

శత్రుస్థానాధిపతి షష్టాష్ట వ్యయములయందు గాని నీచయందుగాని అస్తంగతమైగాని వుండి లగ్నాధిపతి బలముగానున్నయెడల జాతకునకు శత్రువులుండరు.

శ్లో. గురుశుక్రానిలగ్నస్థౌ । షష్ఠభావేశ్వరాన్వితౌ శన్యార్కఫణిసందృష్టౌ జ్ఞాతిపీడాంవినిర్దిశేత్.

గురుశుక్రులు లగ్నమందుండి షష్టాధిపతితో గూడిశనిచేగాని కుజునిచేగాని చూడబడినయెడల జ్ఞాతివిరోధముండును.

శ్లో. శత్రుస్థానస్థియః ఖేటాః । శుభాశ్చేత్రునాశనం । పాపశ్చేచ్ఛత్రువృద్ధిస్స్యా । తస్మాద్దైవాద్రవణాదికం.

శత్రుస్థానమందు శుభగ్రహస్థానములున్నయెడల జాతకునకు శత్రువులెవరును వుండరు. శత్రుస్థానమందు పాపగ్రహములున్న యెడల శత్రువృద్ధి విశేషముగా నుండును.

శ్లో. శుభగ్రహేణసంధృష్టే । శత్రుస్థానాధిపోయదా శుభాన్వి
తె శుభక్షేత్రే । పేసమైత్రింవినిర్దిశేత్.

శత్రుస్థానము శుభగ్రహములచే చూడబడినను శత్రుస్థానాధిపతి శుభగ్రహములతో కలిసినను శుభక్షేత్రమందున్నను జాతకునకు శత్రువులతో మైత్రికలుగును.

శ్లో. షష్టస్థానాధిపేధర్మే । పాపగ్రహాసమన్వితే శత్రుభిఃపీడ్య
తేజాతః స్వల్పభాగ్యమవాప్నుయాత్.

శత్రుస్థానాధిపతి భాగ్యమందుండి పాపగ్రహములతో గూడుకొనిన యెడల జాతకునకు శత్రువులవల్ల పీడకలుగును. స్వల్పభాగ్యవంతుడు అగును.

శ్లో. లాభే శేరిపుభావస్థె । తదీశేలాభరాశిగే
ఏకవింశేగతుర్వింశే శత్రుమూలాద్ధనవ్యయం.

లాభాధిపతి శత్రుక్షేత్రమందుండి శత్రుస్థానాధిపతి లాభస్థామందుండినయెడల 21 సం॥రంలోను 24 వ సం॥రంలో నున్ను శత్రుమూలముగా ధనవ్యయమగును.

రోగము

శ్లో. రాహావష్టగతేవాపి । ధైర్యవాన్మూలరోగవాన్ షష్టే
తు మందసంయుక్తే విజయీ వాతరోగవాన్.

రాహువు షష్టమందున్న యెడల ధైర్యవంతుడును మూలవ్యాధిగలవాడును అగును. శనిషష్టమమందుండె నేని జయమును పొందువాడును వాతరోగముగలవాడును అగును.

శ్లో. షష్ఠేత్వంగారకో యస్యసలపీనస్ఫోటకాదిభాక్, షష్ఠాధిపేకుజయుతే ప్రత్యబ్దజ్వరపీడనం.

షష్ఠమమందు కుజుడున్న యెడల కలహించువాడును స్ఫోటకబాధ కలవాడును అగును. రోగాధిపతి కుజునితో కలిసిన యెడల ప్రతి సం॥రం జ్వరముచే బాధపెట్టబడువాడు అగును.

శ్లో. చంద్రేషష్ఠగతేవాపి, బాల్యేరోగాదిపీడనం షష్ఠాష్టమ వ్యయే శీనాం చంద్రలగ్నేశ యోగతః.

చంద్రుడు షష్ఠమమందున్న యెడల బాల్యమునందు రోగముగలవాడు అగును. చంద్రుడు షష్ఠాష్టవ్యయాధిపతులతో కలిసినయెడల బాల్యమునందు సల్పశరీరము గలవాడు అగును.

శ్లో. లగ్నషష్ఠేశసూర్యాణాం, యోగేతావజ్వరోస్మృతిః శుక్రచంద్రౌతద్యుతౌచేత్, జలపాతో మృతిప్రదః.

లగ్నాధిపతియు షష్ఠాధిపతియు సూర్యుడున్ను కలిసిన యెడల జ్వరతాపము గలుగును. లగ్నాధిపతియు షష్ఠాధిపతియు రవియు శుక్రచంద్రులున్ను కలిసినయెడల జలగండమువల్ల భయము గలుగును.

శ్లో. అష్టమాధిపతిర్లగ్నే రోగదేహీభవేన్నరః, షష్ఠేశేలగ్నగే వాపి జాతోరోగైశ్చబాధతే.

అష్టమాధిపతి లగ్నమందున్న యెడల రోగశరీరముగలవాడును అగును. షష్ఠాధిపతి లగ్నమందున్న యెడల రోగశరీరము గలవాడు అగును.

శ్లో. రోగస్థానగతే పాపే తదీశే పాపసంయుతే రాహుణాస
హితే మందే జాతో రోగేణ పీడ్యతి.

రోగస్థానమందు పాపగ్రహములుండి రోగస్థానాధిపతి పాపగ్రహములతో కలిసినను రాహువుతో కలిసినను రోగములచే బాధపెట్టబడువాడు అగును.

శ్లో. రాహౌ షష్ఠగతేవాపి కేంద్రే మాందిసమన్వితే । లగ్నేశే
ష్టమగేయస్మాద్రోగీ । కేంద్రగురుర్న చేత్.

రాహువు షష్ఠమమునందుండి కేంద్రమునందు శనియుండి లగ్నాధిపతి అష్టమమునందుండి గురుడు కేంద్రమునందుండనేని జాతకుడు క్షయరోగము గలవాడు అగును.

శ్లో. వ్యయేశే రోగరాశిస్థే । తదీశే వ్యయరాశిగే । వాతవ్యాధి
స్తృతీయాబ్దే గుల్మ జాతస్య ప్రవర్తకః.

వ్యయాధిపతి రోగస్థానమందుండి రోగాధిపతి వ్యయమందుండిన మూడవ సం॥రంలో వాతరోగమును, గుల్మరోగమును గలవాడు అగును.

శ్లో. రిపుస్థానగతే చంద్రే మందమాంద్యకుసంయుతే । పంచ
పంచాశదబ్దేతు కుష్ఠవ్యాధిం వినిర్దిశేత్.

షష్ఠమమునందు చంద్రుడుండి మాందిశనులతో కలిసిన యెడల 55 వ సం॥రంలో కుష్టవ్యాధిగలవాడు అగును.

శ్లో. షష్ఠాష్టమగతే రాహౌ తస్మాదష్టమగే శనౌ । లగ్నేశాష్ట
మగే చంద్రే క్షయరోగేణ పీడ్యతే.

షష్ఠాష్టమములయందు రాహువుండిన రాహువునకు అష్టమమందు శనియుండి లగ్నాధిపతికి అష్టమమందు చంద్రుడుండినయెడల క్షయరోగముచే బాధపడువాడు అగును.

శ్లో. షష్ఠేమగే సూర్యే । చంద్రేతి వ్యయమాశ్రితే
పంచమేనవ మాబ్దేవా జలగండం వినిర్దిశేత్.

షష్ఠాధిపతియగు సూర్యుడు అష్టమమందుండి ఆరవికి వ్యయమందు చంద్రుడుండిన యెడల 5 వ సం॥రంలోగాని 9 సం॥రంలోగాని జలగండము కలుగును.

శ్లో. అష్టమే పాపసంయుక్తే రంధ్రేశాద్వ్యయగే కుజే
త్రింశే పంచదశాబ్దేవా విషరోగసముద్భవః.

అష్టమమందు పాపగ్రహముండి అష్టమాధిపతికి వ్యయమందు కుజుడున్న యెడల 15 సం॥రంలో గాని 30 వ సం॥రంలోగాని విషసంబంధమగు జ్వరము వచ్చును.

శ్లో. లాభేశే రిపుభావస్థే। షష్ఠేశే లాభరాశిగే।దుష్టేచలగ్నాధిపే
నాత్ర నానారోగప్రపీడనం.

లాభాధిపతి శత్రుస్థానమందుండి షష్ఠాధిపతి లాభస్థానమందుండి లగ్నమందు పాపగ్రహమున్నయెడల అనేకరోగములచే బాధపడువాడు అగును.

శ్లో. శశ్వత్సౌఖ్యేన్వాతశ్శత్రుహంతా
సత్యోపేతశ్చామాయాసోమహౌజాః
పృథ్వీభర్తా స్యాదయాత్యోహిమర్త్యః
శత్రుక్షేత్రేమిత్రసంస్థాయదిస్యాత్.

నవిమష్టమునుందున్న యెడల శాశ్వతమైన సౌఖ్యముగ లవాడును శత్రువులను నశింపచేయువాడును బలముతో కూడు కొన్నవాడును వాహనముగలవాడును తేజశ్శాలియును రాజు గాని మంత్రిగాని యగును. మరిన్ని షష్ఠమమందు రవియున్న యెడల బుద్ధిమంతుడును కలమందు ముఖ్యుడును శత్రురోగ రుణములు లేనివాడును అగును.

శ్లో. మందాగ్ని స్స్యాని ర్దయః క్రౌర్యముక్తో
నల్పాలసోప్యనిష్టురో దుష్టచిత్తః
రోషావేశోత్యంతసంజాతశత్రుః
శత్రుక్షేత్రె రాత్రినాథే నరస్స్యాత్.

షష్ఠనుమందు చంద్రుడున్న యెడల అజీర్ణరోగముగల వాడును దయలేనివాడును క్రూరుడును ఛాందసుడును కఠోర మైనవాడును క్రోధియును విశేషశత్రువులుగలవాడును అగును. మరిన్ని చంద్రుడు షష్ఠమమందుండెనేని రోగశరీరముగలవా డును శత్రువృద్ధికులవాడును అగును. పూర్ణచంద్రుడున్న యెడల పై దోషములు నివారణయగును.

శ్లో. ప్రాబల్యంస్యాజ్జారరాగ్నేద్విశేషా
ద్దోషావేశః శత్రువర్గోపశాంతిః
సద్భిస్సంగోనంగబుద్ధిర్నరాణాం
గోత్రాపుత్రేశ్శత్రుణంసంస్థెప్రసూతె.

షష్ఠమమందు కుజుడున్న యెడల మిక్కిలి జఠరాగ్నికల వాడును కోపము గలవాడును శత్రుఘ్నుడును సకోపజేయువాడును సజ్జనులతో సహవాసము చేయువాడును కాయముగలవాడును అగును.

మరిన్ని కుజుడు షష్ఠమందున్న యెడల శత్రురోగరుణములు లేనివాడు అగును.

శ్లో. వాదప్రీతిస్సామయోస్తురాత్మా
నానారాతివ్రాతసంతప్తచిత్తః
నిత్యాలస్యవ్యాకులస్స్యాన్మనుష్య
శ్శత్రుక్షేత్రేరాత్రినాథాత్మజోస్మిన్.

షష్ఠమమందు బుధుడున్న యెడల పోట్లాటయందు ఇష్టముగలవాడును రోగశరీరముగలవాడును కఠోరహృదయము గలవాడును ఛాందసుడును మిక్కిలి వ్యాకులముగలవాడును అగును.

మరిన్ని బుధుడు షష్టమమందున్న యెడల జాతివృద్ధి గలవాడును తరుచు శత్రువులవల్ల బాధను పొందువాడును అగును.

శ్లో. సద్గీతవిద్యాహతచిత్తవృత్తిః
కీర్తిప్రియో రాజతిజనః ప్రహర్తా
ప్రారబ్ధకార్యాలసకృత్ స్మరస్స్యాత్
సురేంద్రమంత్రీయదిశత్రుసంస్థః.

గురుడు షష్టమమందున్న యెడలసంగీతవిద్యయందిష్టము

పోయిన మనస్సుగలవాడును స్త్రీయందు ఆసక్తిగలవాడును శత్రువులనుజయించువాడు ప్రారబ్ధమువల్లఖాందసుడును అగును.

మరిన్ని గురుడు షష్ఠమమందున్న యెడల శత్రువులను జయించువాడును రోగములేనివాడును అగును.

శ్లో. భవతిశత్రుజనస్య వశంగతో
రిపుగృహేయదిదానవపూజితః
బహుళమృత్యురసంతతపద్యుతో
భవతిలబ్ధధనస్యవినాశనం

శత్రుస్థానమందు శుక్రుడుండెనేని శత్రువులకు వశీకరుడును మిక్కిలి ఆపత్తు లనుభవించువాడును సంపాదించిన ధనము ఖర్చుపెట్టువాడునుఅగును. మరిన్ని షష్టమమందు శుక్రుడున్న యెడల శత్రువులు లేనివాడును సౌఖ్యవంతుడును అగును.

శ్లో. నీచారిగేనీచజనాద్భయంచ
షష్ఠేశనిశ్చేత్ ఋణమోచకస్స్యాత్
రోగస్యహాం శావియస్య
కర్తాపుత్రార్థకామాన్వితమాతనోతి.

షష్టమమందు శని యున్నయెడల నీచజనులవల్ల నుంచి భయముగలవాడును ఋణములేనివాడును జయశీలుడును ధనపుత్రవంతుడును అగును. మరియు షష్టమమందు శని యున్న యెడల శత్రురోగఋణములేనివాడును దీర్ఘాయుర్దాయవంతుడును అగును.

శ్లో. షష్ఠస్థితిశ్శత్రునినాశకారీ
దదాతిపుత్రంచధనానిభోగాన్
రాహుస్సదాసౌమ్యమతించనారీం
విద్యాంప్రకృష్టాంశుభదాంసుఖంచ.

షష్ఠమమందు రాహువు పున్న యెడల శత్రువులు లేని వాడును ధనవంతుడును భోగియును యోగ్యురాలగు భార్య గలవాడును విద్యావంతుడును సౌఖ్యవంతుడును అగును, మరియు రాహువు షష్టమందున్న యెడల రోగము లేనివాడును శత్రువులను నశింపజేయువాడును అగును.

శ్లో. జర్జరోమతిమాన్ స్థిరః చోరశ్చోగ్రయుత స్తథా
సదారోగీచకటిలోంశ్చప్తస్థానగతేధ్వజే.

షష్టమమందు కేతువున్న యెడల చంచలమైన మనస్సు కలవాడును ధైర్యవంతుడును, చోరవృత్తికలవాడును రోగి యు కుటిలస్వభావముగలవాడు అగును.

మరియు కేతువు షష్టమ మందుండెనేని శత్రురోగ ఋణ ములు గలవాడు అగును.

## కళత్రభావము

శ్లో. దారేశేశుభసంయుక్తే శుభఖేచరవీక్షితే
శుభగ్రహాణాంమధ్యస్థేసత్కళత్రాదిభాగ్యవేత్.

కళత్రస్థానాధిపతి శుభక్షేత్రమందుండి శుభగ్రహములచే చూడబడినను శుభగ్రహములయొక్క మధ్యమందున్నను సత్కళత్రము కలుగును.

శ్లో. దారేశేశుభరాశ్యంశే ఽరకేవాతథావిధే
కర్మేశే బలసంయుక్తే సత్కళత్రసమన్వితః.

కళత్రస్థానాధపతి శుభరాశియందు శుభాంశయందు వుండి దశమాధిపతి బలముగానున్నయెడల యోగ్యమగు కళత్రమగును.

శ్లో. స్వోచ్చేమిత్రేస్వవర్గేవా గోపురాద్యంశకే భృగౌ
షష్ట్యంశే మృదుభాగస్థే సత్కళత్ర సమన్వితః.

ఉచ్చయందుగాని మిత్రక్షేత్రమందుగాని వర్గోత్తమాంశయందుగాని గోపురాంశయందుగాని షష్ట్యంశలో మృద్వంశయందుగాని శుక్రుడున్నయెడల యోగ్యమగు కళత్రముండును.

శ్లో. గురుణాసహితేదృష్టే దారనాథేబలాన్వితే
కారకేవాతథాభావే పత్నీవ్రతపరాయణా.

కళత్రస్థానాధిపతి బలముగానుండి గురునితో కలిసినను చూడబడినను కళత్రకారకుడు శుక్రుడు శుభసంబంధముగలవాడైనను సత్కళత్రమును పతిభక్తిగలదియు అగును.

శ్లో. కళత్రేశేరవౌవాపి భృగౌసౌమ్యనిరీక్షితౌ
గురుయుక్తేకళత్రేవా ధర్మశీలాపతివ్రతా.

కళత్రస్థానాధిపతి రవిగాని శుక్రుడుగాని బుధునిచే చూడబడి కళత్రస్థానమందు గురుడుండెనేని కళత్రము పతివ్రతయగును.

శ్లో శుభగ్రహేణసంయుక్తే కళత్రేశేరనీచగె
పాపే కళత్రరాశీశే కళత్రద్వయమాదిశేత్.

కళత్రస్థానాధిపతి శుభగ్రహముతో కూడి శత్రుక్షేత్ర మందుగాని నీచయందుగాని యుండి కళత్రస్థానమందు పాప గ్రహమున్నయెడల జాతకునకు ద్వికళత్రయోగము పట్టును. అనగా రెండు కళత్రములగును.

శ్లో. కారకేపాపసంయుక్తే నీచరాశ్యంశకేపివా
పాపగ్రహేణేసంధృష్టే కళత్రద్వయమాదిశేత్.

కళత్రకారకుడు శుక్రుడు పాపగ్రహములతో కలిసి నీచరాశియందు గాని నీచాంశయందుగాని వుండినయెడల రెండు కళత్రములు అగును.

శ్లో. కళత్రేవా కుటుంబేవా పాపదృగ్యోగసంభవే
తదీశే బలహీనేతు కళత్రాంతరభాగ్భవేత్.

కళత్రస్థానమందుగాని కుటుంబస్థానమందుగాని పాప గ్రహమున్నను పాపగ్రహములు చూచినను కళత్రస్థానాధిపతి గాని కుటుంబస్థానాధిపతిగాని బలహీనముగా నున్నను జాతకు నకు ద్వికళత్రము పట్టును.

శ్లో. సప్తమేచాష్టమె పాపెవ్యయె భూసుతసంయుతే
అదృశ్యేయదినాధేన కళత్రాంతరభాగ్భవేత్.

సప్తమమందుగాని అష్టమమందుగాని పాపగ్రహముండి వ్యయమందు కుజుడుండి కళత్రస్థానాధిపతిచే చూడబడక యుండెనేని జాతకునకు ద్వికళత్రయోగము పట్టును.

శ్లో. కళత్రాధిపతౌకేంద్రె శుభగ్రహనిరీక్షితే
శుభాంశే శుభరాశౌ వా పత్నీపతిమనువ్రతా.

కళత్రస్థానాధిపతి కేంద్రమందుండి శుభగ్రహముచేచూడ బడుచున్నను శుభాంశయందుగాని శుభ రాశియందుగాని వున్నను భార్య పతిభక్తిగలది యగును.

శ్లో. కళత్రాధిపతిర్యస్తు కారకేణయుతో యది
క్రూరసంబంధరహితః కళత్రంచైకమేవహి.

కళత్రస్థానాధిపతి కళత్రకారకుడగు శుక్రునితో కలిసి పాపగ్రహసంబంధము లేనియెడల యోగ్యమగు కళత్రము అగును.

శ్లో. దారేశేగురుసంయుతే సుతపయుక్తేచాపిపత్నీద్వయం
సంతానప్రధమోపభోగసహితస్యాద్రాహుమందాన్వితే
భార్యాద్యామృతసూర్ద్వితీయసునతిస్రావాన్వితాద్వదే
చాన్యాచోభయగేశితె ఫణియుతే తిస్రశ్చభామాన్వితే.

సప్తమాధిపతి గురునితోను పంచమాధిపతితోను కూడి యుండిన రెండు కళత్రములు సంతానభోగకరములై యుండును. సప్తమాధిపతి శని రాహువులతో కూడినయెడల ముగ్గురు భార్యలు కలిగి మొదటిదాని సంతానము కలిగి నష్టమగును. రెండవదానికి గర్భస్రావమగును. మూడవదానికి అలాగే యగును శుక్రుడు ద్విస్వభావరాశియందు కుజ రాహువులతో కూడెనేని ముగ్గురు భార్యలగుదురు.

శ్లో. విత్తేపాపబహుత్వేతు కళత్రేవాతథావిధే
తదీశేపాపసంద్రుష్టె కళత్రత్రయభాగ్భవేత్.

ద్వితీయమందు పాపగ్రహములుండి కళత్రమందుగూడ పాపగ్రహములుండి పాపగ్రహములచే చూడబడిన యెడల మూడు కళత్రములు అగును.

శ్లో. లగ్నే కుటుంబేదారేవా పాపఖేచరసంయుతే
దారేశేనీచమూఢేవా కళత్రత్రయభాగ్భవేత్.

లగ్నముగాని ద్వితీయముగాని సప్తమముగాని పాపగ్రహయుక్తమై కళత్రస్థానాధిపతి నీచాస్తంగతత్వమును పొందిన యెడల జాతకునకు మూడు కళత్రములు అగును.

శ్లో. కర్మాధిపేనవాయుక్తే బహుస్త్రీసహితో భవేత్
లాభదారేశ్వరౌయుక్తౌ పరస్పరనిరీక్షితౌ
బలాఢ్యౌవా త్రికోణస్థౌ బహుస్త్రీసహితోభవేత్.

కళత్రస్థానాధిపతి దశమాధిపతితో కలిసినయెడల బహు స్త్రీ సంగమము చేయువాడు అగును. కళత్రస్థానాధిపతియు లాభాధిపతియుకలిసినను పరస్పరము చూచుకొను చుండినను బలవంతులై త్రికోణములయందున్నను జాతకుడు విశేష స్త్రీలతో సంగము చేయును.

శ్లో. సౌమ్యేసపాపేయదిదారనాథేజాతఃపరస్త్రీషు రతఃకుటుంబే
నరాహుకేతౌయదిదారనాథేపాపేక్షితేవావ్యభిచారయోగః

బుధుడు పాపగ్రహముతో కూడినను సప్తమాధిపతి పాపగ్రహముతో కూడినను పరస్త్రీలయందుఆసక్తిగలవాడు అగును. కుటుంబస్థానమందు రాహువుగాని కేతువు గాని వుండి కళత్ర

స్థానాధిపతితో కలిసి పాపగ్రహముచే చూడబడినయెడల జాతకుడు పరస్త్రీసంభోగము చేయువాడు అగును.

శ్లో. కర్మేశవిత్తేశకళత్రనాథాః మా స్థితాజారముదాహరంతి
ఏకోగ్రహాస్తేశుచతుర్థరాశౌజాతఃపరస్త్రీగమనం ప్రయాతి.

దశమద్వితీయకళత్ర స్థానాధిపతులు దశమమందున్నను దశమద్వితీయసప్తమాధిపతులలో 1 గ్రహము చతుర్థమందుండి తక్కినగ్రహములు దశమమునందున్నను జాతకుడు పరస్త్రీ సంగమము చేయువాడు అగును.

శ్లో. క్షీణేశశాంకేయదిపాపయుక్తే దారస్థితేత్వన్యకళత్రగామీ
లగ్నేసపాపేయదిదారనాథే జాతఃపరస్త్రీషురతఃకుమార్గీ

క్షీణచంద్రుడు పాపగ్రహముతో కలిసి సప్తమమందున్నయెడల పరులభార్యలను పొందువాడుఅగును. లగ్నమందు సప్తమాధిపతి పాపగ్రహముతో కలిసెనేని జాతకుడు జారుడగును.

శ్లో. పాపగ్రహావ్య సంబంధః కళత్రాధిపతేర్యది
కుటుంబెసప్తమెనాపి స్థితాఃపాపగ్రహాయది
లాభంగతోహాశుక్రశ్చ శుక్రోనీచంగతోపివా
సప్తమాధిపతిష్షష్టేవ్యయెవాసంస్థితోయది
కళత్రాంతరసాగోయంవిద్వద్భిఃపరికీర్తితః.

సప్తమాధిపతి పాపులతో కలసినను ద్వితీయసప్తములయందు పాపగ్రహములున్నను శుక్రుడు లాభమందు

న్నను శుక్రుడు నీచయందున్నను సప్తమాధిపతి షష్ఠమందు న్నను వ్యయమందున్నను ద్వికళత్రయోగముపట్టును.

శ్లో. ధనవ్యయేచసాతాళేజామిత్రేచాష్టమేకుజే
భార్యాభర్తృవినాశాయ పుంసాం భార్యావినశ్యతి.

ద్వితీయమందుగాని వ్యయమందు గాని అష్టమమందు గాని కుజుడున్న యెడల భార్యకుభర్తలునశించెదరు. భర్తకు భార్యలు నశించెదరు. కుజమహాదశగూడ రావలెను.

శ్లో. కళత్రే శేకుటుంబేశే యానంతగ్రహసంయుతాః
తావత్సంఖ్యాకళత్రాణి ఇతికేరళనిర్ణయః.

కళత్రస్థానాధిపతిగాని కుటుంబస్థానాధిపతిగాని ఎంత మంది పాపగ్రహములతో కలియునో అన్నికళత్రములగును.

శ్లో. సప్తమస్థానగే రాహుపరోతివిధవాగతిం
కుజేదాశీరతాకామే శనౌజారోభవిష్యతి.

సప్తమమందు రాహువున్నయెడల విధవాసంగమము చేయువాడును కుజుడున్నయెడల దాసీసంగమము చేయువాడును శనియున్నయెడల జారుడును అగును.

అసప్తమస్థానస్థితరవ్యాదిగ్రహాఫలం

శ్లో. తుంగక్షేత్రేభాస్కరేసప్తమేచేత్
బుద్ధిర్వ్యర్థా స్త్రీనియోగశ్చపాపం
చాంచల్యం బాధిర్యమాప్నోతి
దీర్ఘేజం ఘోరరూపం కాంపిలం పింగకేశాన్.

రవి సప్తమమందు ఉచ్చయందున్న యెడల విఫలమనో రథుడును స్త్రీవియోగమువల్ల పాపమును చంచలస్వభావమును చెముడును పొడుగైన పిక్కలుగలవాడును పింగళవర్ణముగల కేశములుగలవాడు అగును మరిన్ని సప్తమమందు రవియున్న యెడల నల్లశరీరముగల కళత్రముగలవాడును స్వల్పసౌఖ్యము గలవాడును అగును.

శ్లో. విపులవపుషచంద్రేన స్వమస్థె మనుష్యోయువతిషుకృతకా
మీకాంచనాఢ్యస్సుదేహః!శశినిక్రశశరిరే పాపగే పాప
దృష్టైనభవతిసుఖభాగీరోహిణీవల్లభస్యాత్.

సప్తమమందు పూర్ణచంద్రుడున్న యెడల విపులమగు శరీరము గలవాడును పరస్త్రీలను పొందువాడును బంగారుతో సమానదేహముగలవాడు అగును. క్షీణచంద్రుడైన యెడల సౌఖ్యములేనివాడును స్వల్పముగా శరీరనల్లగలవాడు అగును.

శ్లో. భౌమేకళత్రేనీచారిగే హేస్త్రీమరణంభవేత్
ఉచ్చేబలసంయుతేతస్మిన్ విరహోపాపవానపి.

కుజుడు సప్తమమందు నీచయందుండినను శత్రుక్షేత్ర మందుండినను కళత్రనష్టముకలుగును. ఆకుజుడు సప్తమమందు ఉచ్చయందున్న యెడల విరహుడు అగును.

శ్లో. చారుశీలవిభవైరలంకృతః
సత్యవాక్యనిరతోనరోభవేత్ ।
గామినీ నకసూనుసంయుతః ।
కామినీభవనగామినీందుజే.

బుధుడు సప్తమమందున్న యెడల మంచిగుణములు గల వాడును సత్యవంతుడును స్త్రీసువర్ణ, పుత్రసౌఖ్యము గలవాడును అగును. మరిన్ని సప్తమమందు బుధుడున్న యెడలకాముకుడును స్వల్పరతిగలవాడును యుక్తాయుక్తపరిజ్ఞానము కలవాడును మంచికళత్రము గలవాడును అగును.

శ్లో. శాస్త్రాభ్యాసాసక్తచిత్తో వినీతః
కాంతావిత్తాత్యంతసంజాతసౌఖ్యః
మంత్రీమర్త్యః కావ్యకర్తాప్రసూతౌ
జాయాభావే దేవదేవాదిదేవే.

సప్తమమందు గురుడుండెనేని శాస్త్రములు చదువుట యందు విశేష ఆసక్తిగలవాడును నమ్రుడును స్త్రీవల్లను ధనమువల్ల విశేషసౌఖ్యమును పొందువాడు మంత్రిత్వము గలవాడును కవియును అగును మరియున్ను సప్తమమందు గురుడుండెనేని పవిత్రి యగు భార్యగలవాడును విద్యావంతుడును అగును,

శ్లో. యువతిమందిరగే భృగుజో నరో।
బహుధనేనసుతేనసమన్వితః ।
విపులవంశకరః ప్రమదాపతి ।
ర్భవతి చారుముఖీభిరభిష్టుతః.

శుక్రుడు సప్తమమందుండెనేని విశేష ధనవంతుడును పుత్రసంతానము కలవాడును గొప్పవంశమందు పుట్టిన వాడును

లక్ష్మీవంతుడును సౌందర్యస్త్రీలను గోరువాడును అగును. మరిన్ని సప్తమమందు శుక్రుడుండెనేని జారుడును సౌఖ్య వంతుడును పేరుప్రతిష్టలు గలవాడు అగును.

శ్లో. ఆమయేన బలహీనతాంగతో హీన వృత్తిజనచిత్తసంస్థితిః.
కామినీభవనధాన్యదుఃఖితః కామినీ భవనగేశనైశ్చరే.

సప్తమస్థానమందు శనియున్న యెడల రోగముచే బలము లేనివాడును దుర్జనసహవాసము చేయువాడును స్త్రీగృహ ధాన్యములు లేనివాడును అగును. మరియు శని సప్తమమం దున్న యెడల కళత్రము నష్టమైనవాడుకాని రోగకళత్రము గల వాడుగాని అగును.

శ్లో. జాయా సరాహుర్వినిహంతిదారాన్,
దదాతిచాసావిదధాతిదారాన్,
పాపానురక్తాంకులటాంకుచేలాం,
వంధ్యాంచశశ్వద్ఘటయేచ్చరండాం.

సప్తమమందు రాహువుండెనేని కళత్రమును నశింప చేయువాడును అనేక స్త్రీలతో రమించువాడును కులటల తోను మలినవస్త్రము ధరించువాళ్ళను గొడ్డువాళ్ళను విధవ వాళ్ళను రమించువాడును అగును. మరిన్ని సప్తమమందు రాహు వుండెనేని అనేకస్త్రీలతో రమించువాడును ద్వికళత్ర యోగము గలవాడును అగును.

శ్లో. క్షుద్రః కర్మరతః కామిప్రియాయాః ప్రియదర్శనః,
శోకవాంశ్చైక కర్తాచ భార్యాయోధీధ్వజే స్తగే.

సప్తమమందు కేతువుండెనేని పాపకార్యములు చేయువాడును కాముకుడును భార్యకు ప్రియమును చూపువాడును శోకనిమగ్నుడును తెలివైన భార్యగలవాడును అగును. మరిన్ని కేతువు సప్తమమం దున్నయెడల దైవభక్తిగల కళత్రముగలవాడును కళత్రవియోగము గలవాడును అగును.

8 ఆయుర్భావము.

శ్లో. కర్మేశరంధ్ర తనుపాబలశాలినశ్చే
జ్జాతశ్చిరాయురిన నందసయోగహీనా౽
ద్వావప్యతీవబలినోయది మధ్యమాయుః
ఏకోబలీలఘుతరాయురనాయురస్యః.

లగ్నఅష్టమ రాజ్యాధిపతులు ముగ్గురు బలముగానున్న యెడల పూర్ణాయుర్దాయము పట్టును. లగ్నాష్టమరాజ్యాధిపతులలో యిద్దరు బలముగా నున్నయెడల మధ్యాయుర్దాయము పట్టును. లగ్నాష్టమ రాజ్యాధిపతులలో 1 గ్రహము బలముగా నున్నయెడల అల్పాయుర్దాయము పట్టును. లగ్నాష్టమ రాజ్యాధిపతులు ముగ్గురు బలహీనముగా నున్నయెడల ఆయుర్దాయము యేమియు పట్టదు.

శ్లో. స్వక్షేత్రసంస్థే యదిరంధ్రనాథే
దీర్ఘాయురాహుర్మునయోమహాంతః
మందేన వానుంత్య విశేషమాహుః
స్వక్షేత్రమిత్రోచ్ఛ గృహాస్థితేన.

అష్టమాధిపతి స్వక్షేత్రమం దున్నయెడల దీర్ఘాయుర్దాయము పట్టును. శని స్వక్షేత్రమందు గాని ఉచ్చక్షేత్రమందు గాని మిత్రక్షేత్రమందు గాని వున్నయెడల పూర్ణాయుర్దాయము పట్టును.

శ్లో. కర్మేశ్వరేణాపిచింత్యమాయుః
దీర్ఘంనుహ్యాత్తోచ్చయుతేనతేన
కేంద్రస్థితైః కర్మవిలగ్నరంధ్ర
నాథై స్తథైవాయు రుదాహరంతి.

దశమాధిపతి మిత్రక్షేత్రమందు గాని ఉచ్ఛయందు గాని ఉన్నను లగ్నాష్టమ రాజ్యాధిపతులు ముగ్గురు కేంద్ర కోణములయం దున్నను జాతకునకు పూర్ణాయుర్దాయము పట్టును.

శ్లో. కేంద్రాన్వితేవిలగ్నే శే గురుశుక్రసమన్వితే
తాభ్యాం నిరీక్షితేవాపి దీర్ఘమాయుర్వినిర్దిశేత్.

లగ్నాధిపతి కేంద్రకోణములయం దుండి గురుశుక్రులతో కలసినను గురుశుక్రులచే చూడబడినను జాతకునకు పూర్ణాయుర్దాయము పట్టును.

శ్లో. చతుర్కేశుభై ర్యుక్తై లగ్నేశే శుభసంయుతే
గురుణాదృష్టిసంయోగే పూర్ణమాయుర్వినిర్దిశేత్.

నాలుగు కేంద్రములయందు శుభగ్రహములుండి శుభగ్రహములచే చూడబడి లగ్నాధిపతి శుభగ్రహముతో కూడిన చూడబడినయెడల పూర్ణాయుర్దాయము పట్టును.

శ్లో. త్రిషడాయగతాః పాపాః శుభాః కేంద్రత్రికోణగాః
లగ్నేశే బలసంయుక్తే పూర్ణమాయుర్వినిర్దిశేత్.

3, 6, 11, స్థానములయందు పాపగ్రహము లుండి కేంద్రకోణముల యందు శుభగ్రహములుండి లగ్నాధిపతి బలముగా నున్నయెడల పూర్ణాయుర్దాయము పట్టును.

శ్లో. షట్సప్తరంధ్రభావేషు శుభేషుసహితేషుచ
త్రిషడాయేషుపాపేషు పూర్ణమాయుర్వినిర్దిశేత్.

6, 7, 8, స్థానములయందు శుభగ్రహము లున్నను 3, 6, 11 స్థానములయందు పాపగ్రహము లున్నను పూర్ణాయుర్దాయము పట్టును.

శ్లో. రంధ్రాధిపే విలగ్నస్థే గురుశుక్రయుతే క్షితే
లగ్నేశే కేంద్రభావేవా దీర్ఘమాయుర్వినిర్దిశేత్.

అష్టమాధిపతి లగ్నమందుండి గురుశుక్రులతో కూడినను చూడబడినను లగ్నాధిపతి కేంద్రమం దున్నను పూర్ణాయుర్దాయము పట్టును.

శ్లో. ఉచ్చాశ్రితైస్త్రిభిః ఖేటైర్లగ్నే రంధ్రేశ సంయుతే
రంధ్రే పాపవిహీనంతు దీర్ఘమాయుర్వినిర్దిశేత్.

మూడుగ్రహములు ఉచ్చయందుండి అష్టమాధిపతి లగ్నమం దుండి అష్టమమందు పాపగ్రహము లేనియెడల పూర్ణాయుర్దాయము పట్టును.

శ్లో. రంధ్రస్థితైః స్త్రిభిః ఖేటైః స్వోచ్చమిత్రస్వగేహగైః
లగ్నేశే బలసంయుక్తే దీర్ఘమాయుర్వినిర్దిశేత్.

అష్టమమందు మూడుగ్రహములు ఉచ్చయందుగు మిత్రక్షేత్రమందును స్వక్షేత్రమందును నిండి లగ్నాధిపతి బలముగా నున్నయెడల సంపూర్ణాయుర్దాయము పట్టును.

శ్లో. పారావతాదిభాగస్థాః పాపాస్సర్వేశుభా స్తథా
కేంద్రత్రికోణనిలయాః పూర్ణమాయుర్వినిర్దిశేత్.

పారావతాద్యంశలయందు పాపగ్రహములుండ శుభగ్రహములు కేంద్రకోణములయందున్న యెడల పూర్ణాయుర్దాయము పట్టును.

శ్లో. అష్టమస్థానగే రాహౌ కేంద్రస్థానే బృహస్పతౌ
తద్దోషాది లయం యాంతి దీర్ఘాయు సత్రనిశ్చయః.

అష్టమమందు రాహువుండి కేంద్రమందు గురుడున్న యెడల పూర్ణాయుర్దాయము పట్టును.

శ్లో. ఆయుష్కారే శనౌ షష్ఠ పంచమాష్టమలాభగే
ఐశ్వర్యం సతతం బ్రూయాదాయుర్వృద్ధిం యశస్సుఖం.

ఆయుఃకారకుడు శనిపంచమమందుగాని అష్టమమందుగాని ఏకాదశమందుగాని వున్నయెడల పూర్ణాయుర్దాయము పట్టును.

శ్లో. శనిర్లగ్నాధిపో వాపిఅష్టమేశోపివాయది
నవమశుభసంయుక్తః పూర్ణాయుఃకథితో నృణాం.

శని లగ్నాధిపతియైనను అష్టమాధిపతియైనను శుభ గ్రహములతో కలిసినయెడల జాతకునకు పూర్ణాయుర్దాయము పట్టును.

శ్లో. సంపచ్ఛ్రీః పుత్రాణాం కారకస్యగురోర్యది
లగ్నాధిపతినాయోగో హ్యాయుః ప్రబలమాదిశేత్.

సంపత్తునకు పుత్రాదులకు కారకుడగు గురునితో లగ్నాధిపతి కలిసినను చూడబడినను జాతకునకు పూర్ణాయుర్దాయము పట్టును.

శ్లో. ఆయుష్కారేణ శనినాహ్యష్టమాధిప శ్చేగ్యది
సంబంధోవిద్యతే యస్యపూర్ణ మాయుర్వినిర్దిశేత్.

ఆయుష్కారకుడు శని అష్టమాధిపతిగా సంబంధించిన యెడల పూర్ణాయుర్దాయము పట్టును.

శ్లో. రంధ్రేశే కేంద్రభావస్థేస్వోచ్చమూలత్రికోణగే
గురుశుక్రయుతే దృష్టే శతమాయుర్న సంశయః.

అష్టమాధిపతి కేంద్రమం దున్నను కోణములయందు న్నను గురుశుక్రులచే చూడబడినయెడల పూర్ణాయుర్దాయము పట్టును.

శ్లో. అష్టమాధిపలగ్నేశౌ షష్ఠవ్యయగాయది
తదీశాదేహ కేంద్రస్థా తదాదీర్ఘాయురాదిశేత్.

లగ్నాష్టమాధిపతులు షష్ఠాష్టవ్యయముల యందుండి ఆస్థానాధిపతులు లగ్న కేంద్రమందున్నయెడల పూర్ణాయుర్దా యము పట్టును.

శ్లో. ఆయుస్థానాధిపాస్స్వోచ్చేమందేవాశుభసంయుతే
బలాన్వితేతుజాతస్యదీర్ఘమాయుః ప్రయచ్ఛతి.

ఆయుస్థానాధిపతి ఉచ్ఛయందుండి శనిగ్రహముతో కలిసిన యెడల జాతకునకు పూర్ణాయుర్దాయము పట్టును.

శ్లో. లగ్నే శేయది కేంద్రగే గురుయుతే శుక్రేణవావీక్షితే
దీర్ఘాయుఃప్రవదంతిసర్వమునయోజాతస్యసౌఖ్యంధనం
రంధ్రే శెసశుభగ్రహేణసహితే కేంద్రత్రికోణాలయె
పూర్ణాయుఃకథితంపురాణమునిభిఃజాతస్యవిద్యాసుఖం.

లగ్నాధిపతి 1, 4, 7, 10 స్థానములయందుండి గురునిచే నైనను శుక్రునిచే నైనను చూడబడినను దీర్ఘాయుర్దాయము సౌఖ్యముకలుగును. అష్టమాధిపతి శుభగ్రహముతో కలిసినను శుభక్షేత్రమందున్నను కేంద్రకోణములయందున్నను పూర్ణాయుర్దాయము పట్టును.

శ్లో. చంద్రేతుంగసుహృత్త్రికోణభవనేశుక్రేజ్యయుక్తేక్షితే।
పూర్ణాయుర్గురుశుక్రలగ్నపతిభిః స్వోచ్చేతుసామ్యేక్షితైః
లగ్నేశో దశమేట్చ్యుగ్నసుతకామస్తాశ్చ రాజ్యస్థితాః.
పుత్రాధీశ్వరవీక్షితాయదిభవేత్ పూర్ణాయుషస్సంభవః.

చంద్రుడు ఉచ్ఛయందుండినను మిత్రక్షేత్రమందుండినను త్రికోణమునందుండినను గురు శుక్రులతో కలిసినను చూడబడినను పూర్ణాయుర్దాయము పట్టును. గురు శుక్రలగ్నాధిపతులు ఉచ్ఛయందున్నను బుధునిచే చూడబడినను లగ్నదశమాధి

పతులు 1, 5, 7, 10 స్థానములయందున్నను లేక పంచమాధిపతిచే చూడబడినను పూర్ణాయుర్దాయము కలుగును.

శ్లో. చరేలగ్నే చరేచంద్రేపూర్ణమాయుర్వినిర్దిశేత్ ।
స్థిరేలగ్నే స్థిరేచంద్రేఅల్పమాయుర్వినిర్దిశేత్ ।
సమేలగ్నే సమేచంద్రేఅల్పమాయుర్వినిర్దిశేత్ ।
ఏవంచంద్రబలంజ్ఞేయం రంధ్రేనాపియుతంభవేత్.

లగ్నము చరమై చంద్రుడు చరరాశియందున్నయెడల పూర్ణాయుర్దాయము పట్టును. లగ్నము స్థిరమై చంద్రుడు స్థిరరాశియందున్నయెడల మధ్యాయుర్దాయముపట్టును. లగ్నము ద్విస్వభావమై చంద్రుడు ద్విభావరాశియందున్నయెడల అల్పాయుర్దాయముపట్టును. అష్టమాధిపతినిగూడ చంద్రలగ్నాత్ బలాబలమునుబట్టి ఆయుర్దాయము చెప్పవలెను.

శ్లో. రంధ్రేశ్వరాధిష్ఠితలగ్ననాథః
యత్రక్వవాతితద్గృహేశః ।
యత్రస్థితః తద్భవనాధిపశ్చ
పరస్పరక్షేత్రముపాగతేచేత్ ।
ప్రాప్నోతిదీర్ఘాయురనేకవిద్యాం
రాజాధిరాజాబహుధర్మయుక్తః.

అష్టమాధిపతియున్న రాశ్యధిపతి యెచ్చటనుండునో నాడునుఆస్థానాధిపతియున్న రాశ్యధిపతియు నొకరిగృహామునం దొ

కరున్న యెడల దీర్ఘాయుర్దాయమును అనేక విద్యలును రాజులకు ప్రభువును అగును.

శ్లో. భాగ్యే శేతనునాయ కేక్షితయు తేజీవేక్షి తెపుత్రపె
కర్మే శేయదితుంగ కేంద్రభవనేమా నేశుభేవాన్వితే
మానె శెసుతనాధపేక్షితయుతె లాభేశనామిత్రగే
రంధ్రే శేపిచ కేంద్రగెజనిమతాంమధ్యాయురుక్తంబుధాః॥

నవమాధిపతి లగ్నాధిపతితో కూడినను చూడబడినను పంచమాధిపతిని గురుడు చూచినను దశమాధిపతి ఉచ్ఛయందు గాని కేంద్రమందుగాని యున్నను దశమస్థానము శుభగ్రహ యుక్తమయినను దశమాధిపతి పంచమాధిపతితో కలిసినను చూడబడినను శని లాభమగు మిత్రక్షేత్ర మందున్నను అష్టమాధిపతి కేంద్రమందున్నను మధ్యాయుర్దాయము కలుగును.

శ్లో. లగ్నే దేవగురౌ బలిన్యపియదాజాతస్య సర్వాపదో
నశ్యంత్యేవహిదుఃఖేటకలితారిష్టంతథాశామ్యతి
రాహుర్వాక్రియగోకుళీరహరికీటగ్రాహ రాశిస్థితః
సర్వారిష్టనివారణం ప్రకృతేజాతశ్చిరాయుర్భవేత్॥

లగ్నమందు గురుడు బలముగలవాడై యున్నయెడల సమస్తపాపములు నివారణమై పాపగ్రహారిష్టములు నివారణ యగును. రాహువు మేష, వృషభ, కర్కాటక, సింహ, వృశ్చిక, మకరములలో నున్నయెడల అరిష్టము లన్నియు పోయి దీర్ఘాయుర్దాయవంతుడు అగును.

శ్లో. పుత్రసేహింబుకాధిపేదశమగేక్రూరగ్రహైర్వీక్షితే
అల్పాయుర్బలహీనశ్చలగ్నపయుతే కేంద్రత్రికోణేగురౌ
మధ్యాయుశ్చతురష్టపేశుభగేజీవేక్షితేవాభవేత్
పూర్ణాయుర్బహుశాస్త్రసమ్మతమిదంగర్గ్యాదిరుక్తంపురా.

పంచమచతుర్థాధిపతులు దశమమందుండి పాపగ్రహములచే చూడబడినయెడల అల్పాయుర్దాయము కలుగును. గురుడు కేంద్రకోణములయందుండి బలములేని లగ్నాధిపతితో కలిసినయెడల మధ్యాయుర్దాయము గలుగును. చతుర్థఅష్టమాధిపతులు శుభులై గురునిచే చూడబడినయెడల పూర్ణాయుర్దాయము కలుగును.

శ్లో. స్వక్షేనిధనపేయుక్తే శుభైకేంద్రత్రికోణగే
దీర్ఘాయుర్ధనవాన్ భోగి జాయతేనాత్ర సంశయః

అష్టమాధిపతి స్వక్షేత్రమందుండి శుభగ్రహములు ౧, ౪, ౫, ౭, ౯, ౧౦ స్థానములయందున్నయెడల దీర్ఘాయుర్దాయముగలవాడును ధనవంతుడును అగును.

శ్లో. అష్టమాధిపలగ్నేశౌ షష్ఠాష్టవ్యయగౌయది
తదీశౌదేవాకేంద్రస్థౌతదాదీర్ఘాయురాదిశేత్॥

అష్టమాధిపతియు లగ్నాధిపతియు 6, 8, 12 స్థానములలో నెచ్చట నున్నను అస్థానాధిపతి లగ్నకేంద్రమున నున్నయెడల పూర్ణాయుర్దాయము కలవాడగును.

శ్లో. లాభేరిపౌభ్రాతరిసింహికేయః

శుభేక్షితస్యాద్యది చంద్రలగ్నాత్
అల్పాయురప్యత్యభ వేచ్ఛిరాయుః
సంపద్విహీనోపి కుబేరతుల్యః.

చంద్రుడున్న రాశికి 3, 6, 11 స్థానములలో రాహు వుండి శుభగ్రహములచే చూడబడినయెడల అల్పాయుర్దాయము కలవాడైనను పూర్ణాయుర్దాయము కలవాడగును ఐశ్వర్యము లేనివాడైనను కుబేరునితో సమానమగు ఐశ్వర్యముకలవాడగును. లగ్నమునకు 3, 6, 11 స్థానములలో రాహువున్నన దీర్ఘాయుర్దాయము ఐశ్వర్యము కలుగును.

శ్లో. షష్ఠాష్టమవ్యయేపాపే లగ్నేశే దుర్బలేయది
అల్పాయువనపత్యోపి శుభదృగ్యోగవర్జితే.

లగ్నాధిపతి బలములేనివాడై శుభసంబంధముగాని శుభదృష్టిగాని లేకయుండి షష్ఠాష్టవ్యయము లందు పాపగ్రహములుండి శుభసంబంధములేక యుండినయెడల అల్పాయుర్దాయము కలవాడును సంతానములేనివాడును అగును.

శ్లో. క్రూరషష్ట్యంశగేవాపి రంధ్రేశేభానుజేపివా
పాపాన్వితేపాపదృష్టే స్వల్పమాయుర్వినిర్దిశేత్.

అష్టమాధిపతిగాని శనిగాని పాపగ్రహాంశలయందున్న ను పాపులతో కలిసినను చూడబడినను అల్పాయుర్దాయమ పట్టును.

శ్లో. చంద్రాష్టమంచ ధరణీసుతసప్తమంచ
రాహుర్నవంచ శనిజన్మగురుస్తృతీయే
శుక్రస్తుషష్ఠబుధసప్తమ కేతుజన్మ
ద్వాదస్యమర్క యితిజాతకమృత్యుయోగః.

చంద్రుడు అష్టమమందును, కుజుడు సప్తమమందునను, రాహువు నవమమందునను, శని లగ్నమందును, గురుడు తృతీయమందును శుక్రుడు షష్ఠమమందునను, బుధుడు సప్తమమందును కేతువు జన్మంబునను, ద్వాదశమున రవియునున్న యెడల బాలారిష్టము లనబడును. జననకాలమునను బాలారిష్టదశ గూడ రావలెను. అట్లు జననకాలమునకు బాలారిష్టదశ రాని యెడల మారకము కలుగదు.

శ్లో. రవిశ్చ రవిపుత్రశ్చ భూమిపుత్రశ్చ కేంద్రగాః
దేవమంత్రిర్న దుష్టోవా జాతస్యమరణం ధృవం.

రవికుజశనులు కేంద్రమందుండి గురునిచే చూడబడని యెడల జాతకునకు మరణము కలుగును.

శ్లో. లగ్నేచంద్రేద్వ్యయేభానుః నవమస్థోశనిర్యది
అష్టమేభూమిపుత్రశ్చ సద్యోమరణమాప్నుయాత్.

లగ్నమందు చంద్రుడును 12 రవియును నవమందు శని యున్న అష్టమమున కుజుడున్ను ఉన్నయెడల అల్పాయుర్దాయము పట్టును.

శ్లో. శుక్రాంశకస్థితేమందే శుక్రేణైవనిరీక్షితే
కేతుదృష్టిర్యుతేవాపి త్రివర్షంతస్యజీవతి.

శనిశుక్రాంశయందుండి శుక్రునిచే చూడబడి కేతువుతో కలిసినయెడల మూడుసంవత్సరములు జీవించును.

శ్లో. చతుష్టయగతో రాహుః పాపైర్యదినిరీక్షితే
జాతస్యమరణం దద్యాద్దశాబ్దైషోడశేతథా.

చతుర్థమందు రాహువుండి పాపులచే చూడబడినయెడల జాతకుడు 13 సం॥రంలో గాని 16 సంవత్సరంలోగాని మరణమును పొందును.

శ్లో. రంధ్రస్థానేస్థితాస్సర్వేగ్రహాః ప్రాణహారాశ్శిశోః
తస్మిన్ స్థితో ధరాసూనుః మాతులస్యమృతిప్రదః.

జన్మలగ్నమునకు అష్టమమున అన్నిగ్రహములున్నునున్నయెడల జాతకుడు మృతినొందును. కుజుడుగూడ కలిసియుండినయెడల మేనమామ మృతినొందును.

శ్లో. ఉదయాస్తగతాః పాపాః సద్యోమరణసూచగాః
షడష్టమె విధోః పాపాః కర్మస్థా మరణప్రదాః.

శ్లో. లగ్నేశె రంధ్రరాశిస్థే రంధ్రేశే లగ్నరాశిగే
విక్రమే శనిసంయుక్తే దీర్ఘాయుర్యోగమాప్నుయాత్,
రంధ్రేశేవ్యయరాశిస్థె కారకేణాన్వితేక్షితే
వ్యయె శేద్యూనరాశిస్థె తద్దాయె మరణంభవేత్.

లగ్నాధిపతి అష్టమస్థానమునను, అష్టమస్థానాధిపతి

లగ్నమునను విక్రమస్థానమగు మూడవయింట శనియునుండి నచో దీర్ఘాయుర్దాయము పట్టును. అష్టమాధిపతి వ్యయమం దుండి కారకుడగు శనితో కూడినను చూడబడినను వ్యయాధి పతి 7 వ యింట నుండి ఆ గ్రహదశ వచ్చినచో జాతకుడు మరణమును పొందును.

శ్లో. లగ్నే సూర్యసమాయుక్తే రంధ్రేకుజసమన్వితే
నృపతుల్యసుఖో జాతో దీర్ఘాయుర్యోగ మాప్నుయాత్.
రంధ్రాధిపేనిలగ్నస్థే గురుశుక్రనిరీక్షితే
రంధ్రేశేలగ్ననాథేవా పూర్ణాయుర్యోగమాప్నుయాత్.

లగ్నమందు సూర్యుడును, అష్టమస్థానమున అంగారకు డును ఉండినయెడల రాజతుల్యుడై పూర్ణాయుర్దాయము గలవాడు అగును. లగ్నమందు అష్టమస్థానాధిపతి యుండి గురుశుక్రులచే చూడబడుచుండినను లేక లగ్నాష్టమాధిపత్య ముగల గ్రహము గురునితో కూడినను చూడబడినను జాతకు నకు పూర్ణాయుర్దాయము పట్టును.

శ్లో. గజకేసరియోగోయం చంద్రకేంద్రేబృహస్పతిః,
కేసరియోగసంజాతో శతమాయుర్నసంశయః.

చంద్రునకు కేంద్రమందు గురుడున్నయెడల గజకేసరీ యోగమని చెప్పబడును. ఆయోగమున పుట్టినవారు నూరు సంవత్సరములు జీవించెదరు.

శ్లో. సోపప్లవే శశాంకేచ క్రూరేలగ్నకుజాష్టమే,
మృత్యుః మాత్రాసార్థం చంద్రవదర్కే-నశస్త్రిణా.

గ్రహాణముతో కూడుకొన్న చంద్రుడుపాపునితోకలిసి లగ్నమందుండి కుజుడుఅష్టమమందున్నయెడల తల్లితోకూడ శిశువు మరణమునుపొందును చంద్రునివలెనే రవిగ్రహాణకాల మందు పాపునితో కలిసి లగ్నమందున్న యెడలశస్త్రమువల్ల తల్లి బిడ్డలు మరణించెదరు.

శ్లో. లగ్నద్వాదశనవమన్తైధనసంస్థితైశ్చంద్రసౌరిసూర్యారైః
జాతస్య భవతి మరణం యదినబలయుతపతిర్వచసాం.

లగ్నమందు చంద్రుడు 12 శని 9 ట రవి, అష్టమమున కుజుడు వుండి గురుడు బలవంతుడును కానియెడల జాతకుడు మరణమును పొందును.

శ్లో. మందేభాగ్యగతేచ మిత్రభవనేజీవేక్షితే మధ్యమం
లగ్నస్థా సహజాధిపేష్టమపతౌ భాగ్యేశదృష్టేపివా
ధర్మేలగ్నపతౌధనేసుతపతౌ చాయుస్సదామధ్యమం
రాజ్యేశేసుతేగేనిశాకరబలేభాగ్యే సుతేశేభవేత్.

శని నవమమందుగాని మిత్రక్షేత్రమందుగాని వుండి గురునిచే చూడబడినను తృతీయాష్టమాధిపతులు లగ్నమందుండి నవమాధిపతిచే చూడబడినను లగ్నాధిపతి పంచమమందును చంద్రుడును బలవంతుడయియుండనాపంచమాధిపతి నవమమందున్నను మధ్యమాయుర్దాయము కలుగును.

శ్లో. నీచస్థశ్చపరాజితా స్తరిగతాః పాపేక్షితాక్రాంతయో
మధ్యస్థానగతాశ్చవక్రవికలాస్స్వర్భానుసంసర్గగాః ।
భావాంతస్థితఖేచరాశ్చవిబలాః షష్ఠాష్టరిఫ్ఫాధిపాః
కేంద్రాధీశ్వరకోణపేశ్వరయుతా స్తద్యోగభంగప్రదాః

నీచయందున్న గ్రహములును పరాజయగ్రహములు అనగా రవితో కలిసిన గ్రహమునకు అస్తంగతమనియు చంద్రునితో కలిసినవానికి సమాగమమనియు కుజునితో కలిసిన వానికి గ్రహయుద్ధమనియు అందులో కుజునకు వెనుకస్వక్షేత్రమందున్నవాడు పరాజయగ్రహమనియు ముందు స్వక్షేత్రములయందుగాని ఉచ్చయందుగాని అంశలయందుగాని ఉన్నగ్రహమునకు జయగ్రహమనియు చెప్పుదురు. అట్టిపరాజయగ్రహములును శత్రుక్షేత్రములయందున్నవారు పాపగ్రహమధ్యనుండు వారును వక్రవికలత్రగ్రహములు అనగా వక్రత్వమునదలి రుజత్వములేనివారును రాహువునితో కలిసినవారును రాశ్యంతమందున్న గ్రహములును వీరు బలహీనులగుదురు షష్ఠాష్టమరిష్ఫాధిపతులు అనగా 6, 8, 12 స్థానాధిపతులు కేంద్రకోణాధిపతులతో కలిసినయెడల రాజయోగమును భంగము చేయుదురు. ఒకానొకసమయమున ఆయుర్దాయము నిచ్చువారు నివ్వనివారు అగుదురు.

శ్లో. అర్కాంశకస్థితేదుందే అర్కాంశేనన్నరీక్షతే
కావ్యదృష్టియుతేవాపి చాతుర్వర్షంచజీవతి.

శని రవ్యం దశయందుండి రవిచేతచూడబడిశుక్రునితో కలిసినను చూడబడినను 4 సంవత్సరములు జీవించును.

శ్లో. చంద్రాంశకస్థితేమందే చంద్రేణేవనిరీక్షితే।
దేహాధిపేనసందృష్టే షడ్వర్షంతస్యజీవితం।
అథవాచాష్టమేవర్షేనజీవతినసంశయః.

శని చంద్రాంశయందుండి చంద్రునిచే చూడబడుచు లగ్నాధిపతిచేచూడబడినయెడల జాతకుడు 6 వ సం॥ర మందు గాని 8 వ సంవత్సరంలోగాని మృతిపొందును.

శ్లో. జీవాంశకస్థితేమందే జీవేనై వనిరీక్షితే।
చంద్రదృష్టియుతేవాపి చాతుర్వర్షంసజీవతి.

శని గుర్వంశయందుండి గురునిచే చూడబడి చంద్రునితో కలిసినను చూడబడినను జాతకుడు 4 సంవత్సరములు మాత్రము జీవించును.

శ్లో. ఉదయేభూమిపుత్రస్తుసప్తమేసహితాశ్శశిః।
సూర్యసౌరీయదిస్యాతాం సద్యోమరణసూచకౌ

లగ్నమందు కుజుడును సప్తమమున రవిశనులుండి శుభ సంబంధములేనియెడల వెంటనే మరణము పొందును.

శ్లో. వ్యయేచంద్రేతనౌసౌరీ సర్వేపాపామృతిప్రదాః।
లగ్నవ్యయస్థారంధ్రస్థా చంద్రార్కౌయథిభూమిజః.

12 చంద్రుడున్ను లగ్నమందు శనియును లేకచంద్రకుజు

లు లగ్నమందుగాని ద్వాదశమందుగాని అష్టమమందు గాని యున్నయెడల జాతకుడు మరణముపొందును.

శ్లో. షష్ఠాష్టమేపిచంద్రఃసద్యోమరణాయపాపసందృష్టః।
అష్టాభిశ్శుభసంద్రుష్టో వర్షైర్మిశ్రైస్తదర్ధేన.

6, 8, స్థానములలో చంద్రుడుండి పాపులచేచూడబడిన యెడల జాతకుడు వెంటనే మృతిపొందును. శుభులచే చూడబడిన యెడల 8 సం॥రములకును శుభులచే పాపులచే చూడబడినయెడల 4 సంవత్సరములకు మృతినొందును.

శ్లో. మారకైస్సహసంబంధాన్నిహంతాపాపకృచ్ఛనిః।
అతిక్రమ్యేతరాన్ సర్వాన్ భవత్యేవనసంశయః.

మారకగ్రహములలో బలాధికుడుండియు న్యూనబలాధికుడైనను శని మరియొక మారకునితోడచేరితే తనస్వాభావిక పాపత్వముచేత తానె నిర్వహించిపోవుచున్నాడు. ప్రబలమారక దశకన్నను అట్టి శని దశయందుగారావలెను. ఉత్తరకాలమందువచ్చునట్టైతే ప్రబలమారకదశయందే మరణము.

శ్లో. కేవలానాంచపాపానాం దశానునిధనంక్వచిత్।
కల్పనీయంబుధైర్నౄణాం మారకానామదర్శనే.

కొన్ని జాతకములయందు మారకగ్రహములే కనుపించవు. అప్పుడు బలాధికుడగు యితర పాపగ్రహదశయందు మారకము కలుగును.

శ్లో. లగ్నేవేవాంశ్యేవేవాపి జన్మకాలేస్థగాయది।
తదాజాతస్యత్రస్య మరణంస్యాన్నసంశయః.

జన్మలగ్నాధిపతియైనను అంశలగ్నాధిపతియైనను జన్మకాలమునకు అస్తమించినను లేక సప్తముననున్న వెంటనే మరణము కలుగును.

శ్లో. చంద్రాధ్యాశిత రాశేంధిపః కేంద్రేశుభగ్రహేవాపి
ప్రశమయతిరిష్టదోషం పాపానియథాహరిస్మరణాత్.

చంద్రుడున్న రాస్యధిపతి కేంద్రమందు శుభగ్రహమై యుండిన హరిస్మరణమువల్ల పాపములు నశించునట్లు అరిష్టములు నశించును. పాపగ్రహములు శుభషడ్వర్గులయందున్నను శుభగ్రహములచే చూడబడినను అరిష్టము నివారణయగును.

అష్టమస్థానేరవ్యాదిగ్రహస్థితిఫలం

శ్లో. నేత్రాల్పత్వంశత్రువర్గాభివృద్ధిర్బు
ద్ధిభ్రంశఃపూరుషస్యాతిరోషః
అర్థాల్పత్వంకార్శ్యమంగేవిశేషా
దాయుస్థానేపద్మినీ ప్రాణనాథే

అష్టమమందు రవియున్నయెడల అల్పనేత్రములుగల వాడును అల్పదృష్టిగలవాడును, శత్రువృద్ధిగలవాడు రోషముగలవాడును, చంచలమగుబుద్ధిగలవాడును స్వల్పధనముగలవాడును మిక్కిలి దుర్బలుడును అగును.

మరిన్ని అష్టమమందు రవియున్నయెడల రోగియును నీచుడును దృష్టిహీనుడును అల్పపుత్రులుగలవాడును సౌఖ్యహీనుడును అగును.

శ్లో. నానారోగైః క్షీణదేహోతినిస్స్వ
శ్చోరారాతిక్షోణిపాలాభితప్తః
చిత్తోద్వేగై ర్వ్యాకులోమానవస్స్యా
దాయుస్థానేవర్తమానేహిమాంశౌ.

అష్టమమందు చంద్రుడున్న యెడల అనేకరోగములచే క్షీణించిన శరీరముగలవాడును ధనములేనివాడు చోరులవల్లను శత్రువులవల్లను రాజులవల్లనుంచిన్ని పీడింపబడువాడును మిక్కిలి తొందరగల మనస్సుగలవాడును ఒచారముగలవాడు అగును. మరిన్ని అష్టమమందు చంద్రుడుండెనేని బాలారిష్టముగలవాడును రోగపీడితుడును చంచలచిత్తము గలవాడును మాతృసౌఖ్యము లేనివాడును అగును.

శ్లో. వైకల్యంస్యాన్నేత్రయోర్దుర్భగత్వం
రక్తాత్పీడానీచకర్మప్రవృత్తిః
బుద్ధేరాంధ్యం సజ్జనానాంచనిందా
రంధ్రస్థానేమేదినీనందనేస్మిన్.

అష్టమమందు కుజుడున్న యెడల నేత్రవైకల్యముగలవాడును సౌందర్యము లేనివాడును రక్తకాస రోగముగలవాడును నీచవృత్తిగలవాడును మందబుద్ధిగలవాడును సజ్జనుల నింద చేయువాడును అగును.

మరిన్ని అష్టమమందు కుజుడున్న యెడల ద్వికళత్రముగలవాడును మూలరోగముగలవాడును యెప్పుడును కష్టపడు

వాడును నీచజీవనము గలవాడును ఆయాస మరణముగలవాడును అగును.

శ్లో. మృత్యుసద్మకలితేశశాంకజే పాపబుద్ధిరపి పాపకృన్నరః
నిత్యసన్నిహితమృత్యురుగ్రధీర్వైశ్యవృత్తికృతజీవనస్సుఖీ.

అష్టమమందు బుధుడున్నయెడల పాపాత్ముడును దినదిన గండము గలవాడును కోపస్వభావముగలవాడును వర్తకము వలన జీవనముచేయువాడును అగును. మరిన్ని అష్టమమందు బుధుడున్నయెడల అల్పవిద్యావంతుడును భూతవైద్యము చేయువాడును అగును.

శ్లో. ప్రేష్యోమనుష్యోమలినో
తిదీనోవివేకహీనోవినయోజ్ఝితశ్చ
నిత్యాలసః క్షీణకళేబరస్స్యా
దాయుర్విశేషీనచసామధీశే.

అష్టమమునందు గురుడున్నయెడల భృత్యుడును మలినుడును మిక్కిలి దీనుడును వినయవిహీనుడును మందబుద్ధిగలవాడును దుర్బలశరీరము గలవాడును అగును.

మరిన్ని అష్టమమందు గురుడున్నయెడల తీర్థయాత్రలు చేయువాడును చిరంజీవియు దరిద్రుడు అనాయాసమరణము గలవాడును అగును.

శ్లో. నిధనసద్మగతే భృగునందనే
విమలధర్మగతో నృపసేవకః

భవతిమధ్యగతోపిచ
మాంసభుక్ప్రథుల దృష్టిగధర్మయుతోపిచః

అష్టమమందు శుక్రుడున్న యెడల ధర్మమందు ఆసక్తి గలవాడును రాజసేవకుడును ఖాద్యమాంసాదులయందు ఆసక్తి గలవాడును మంచి దృష్టిగలవాడును అగును. మరిన్ని శుక్రుడు అష్టమం దున్న యెడల కళత్రసౌఖ్యము లేనివాడును అల్పరతి గలవాడును సామాన్యభాగ్యవంతుడును అగును.

శ్లో. శనైశ్చరే త్వష్టమరాశిసంస్థే
దేశాంతరే తిష్ఠతిదుఃఖభాగీ
బాల్యేతికష్టీఖలుమధ్యసౌఖ్యో
మధ్యేంత్యకాలేబహుసౌఖ్యయుక్తః.

అష్టమమందు శనియుండినయెడల ప్రవాసము చేయువాడును దుఃఖము లనుభవించువాడును బాల్యదశయందు సౌఖ్యము లేనివాడును అంత్యదశయందును మధ్యదశయుందును మిక్కిలి సౌఖ్యముగలవాడును అగును. మరిన్ని శని అష్టమమందున్న యెడల దీర్ఘాయువంతుడును బలము లేనివాడు కష్టము లనుభవించువాడును అగును.

శ్లో. రాహుస్సదాచాష్టమమందిరస్థో
రోగాన్వితంవ్యాళహతంతనోతి
పాపాత్మకంవిత్తయుతంచజాతం
నీచానుషక్తంకితవంసపాపం.

అష్టమమందు రాహువున్న యెడల రోగముగలవాడును పాముచే కరవబడువాడును పాపాత్ముడును అన్యాయముగా ధనము సంపాదించువాడును నీచస్వభావముగలవాడును జూదమాడువాడును అగును. మరిన్ని అష్టమమందు రాహువుండెనేని సౌఖ్యము లేనివాడును రోగపీడితుడును అండరోగము గలవాడును అగును.

శ్లో. మాతాపితృసుఖఘ్నశ్చగురుద్విట్ దేవనిందకః
చోరశ్చవంచకోభూయాత్కేతౌ నిధనభావగే.

అష్టమమందు కేతువున్న యెడల మాతాపితృసౌఖ్యములు లేనివాడును దేవబ్రాహ్మణులను నిందించువాడును చోరుడును వంచకుండును అగును. మరిన్ని అష్టమమందు కేతువుండెనేని విశేషదుఃఖము లనుభవించువాడును శరీరసౌఖ్యము లేనివాడును వేదాంతవిచారణ చేయువాడును మధ్యమధ్యవిఘ్నములుగలవాడును అగును.

ఆయుర్భావస్సమాప్తః.

9 పితృభావము

శ్లో. పితృస్థానాధిపేసౌమ్యే కారకేశుభసంయుతే
భావేవాశుభసంయుక్తే పితృసౌఖ్యంవినిర్దిశేత్.

పితృస్థానాధిపతి శుభగ్రహమై పితృకారకుడు రవిశుభగ్రహములతో కలిసినను పితృస్థానమందు శుభగ్రహములున్నను జాతకుడు పితృసౌఖ్యముగలవాడగును.

శ్లో. సౌమ్యాంతరస్థే తన్నాథేగురు శుక్రయుతేక్షితే
తేషామేకేనసంయుక్తే పితృసౌఖ్యంవినిర్దిశేత్.

పితృస్థానాధిపతి శుభగ్రహమధ్యమునందుండి గురుశుక్రులచే చూడబడినను గురునితోగాని శుక్రునితోగాని కలిసినను జాతకునితండ్రికి పూర్ణాయుర్దాయము పట్టును.

శ్లో. గోపురాద్యంశసంయుక్తే కారకేనాథవీక్షితే
పాపైరవీక్షితే యుక్తేపితృసౌఖ్యంవినిర్దిశేత్.

పితృకారకుడురవి గోపురాంశయందుండి పితృస్థానాధిపతిచే చూడబడినను పాపగ్రహములతో కూడియును చూడబడకను నుండెనేని జాతకుని తండ్రికి పూర్ణాయుర్దాయము పట్టును.

శ్లో. లగ్నత్రికోణగేసూర్యే భాగ్యేశ్వేనసమన్వితే
గురుణాసంయుతే దృష్టేపితృభక్తసమన్వితః.

లగ్నమందు సూర్యుడుండి భాగ్యాధిపతితో గలిసి గురునిచే చూడబడినను కూడినను జాతకుడు పితృభక్తిగలవాడును అగును.

శ్లో. భాగ్యేశే భృగుసంయుక్తే భాగ్యేభృగుసమన్వితే
లగ్నకేంద్రగతేశుక్రే పితృభాగ్యసమన్వితః.

నవమాధిపతి శుక్రునితో కలిసినను భాగ్యమందు శుక్రుడుండినను లగ్నమందు శుక్రుడుండినను జాతకుడు పితృసౌఖ్యముగలవాడును భాగ్యవంతుడును అగును.

శ్లో. భాగ్యేశేపరమోచ్చస్థే భాగ్యేశేజీవసంయుతే

పితృస్థానాధిపతి ఉచ్చయందుండినను గురునితో కలిసి నను చూడబడినను చతుర్థమందు శుక్రుడుండినను జాతకుని తండ్రికి పూర్ణాయుర్దాయము పట్టును.

శ్లో. భాగ్యేశేపరమోచ్చస్థె తదీశేశుభసంయుతే
తత్కారకేతథాప్రాప్తెపితాదీర్ఘాయురాదిశేత్.

భాగ్యాధిపతి ఉచ్చయందుండి శుభగ్రహముతో కలిసి పితృకారకుడు రవి బలముగా నున్నయెడల జాతకుని తండ్రికి పూర్ణాయుర్దాయము పట్టును.

శ్లో. లగ్నా త్త్రికోణగేసూర్యే భాగ్యేశేన ప్తమస్థితే
గురుణాసహితేదృష్టెపితృభక్తిసమన్వితః.

లగ్నమందుగాని పంచమమందుగాని భాగ్యమందుగాని రవియుండి భాగ్యాధిపత సప్తమమందుండి గురునితో కలిసి చూడబడినను జాతకునితండ్రి దీర్ఘాయుర్దాయవంతుడగును. జాతకుడు మిక్కిలి పితృభక్తిగలవాడగును.

శ్లో. పాపదృష్టె సపాపేవాకారకేభావనాయకే
పాపాంతరగతే వాపి పితృదుఃఖంవినిర్దిశేత్.

పితృస్థానాధిపతిగాని పితృకారకుడుగాని పాపగ్రహము లతోకూడినను చూడబడినను పాపగ్రహముయొక్క మధ్య యందున్నను పితృవిచారము కలుగును.

శ్లో. సౌమ్యేతదీశ్వరేవాపి నీచశత్రుసమన్వితే
క్రూరషష్ట్యంశకేవాపి పితృదుఃఖం పనిర్దిశేత్.

పితృస్థానాధిపతి శుభగ్రహమైనప్పటికి నీచయందుగాని శత్రుగృహములలోగాని కలిసియుండినను పాపషష్ఠాంశలయందున్నను పితృవిచారము కలుగును.

శ్లో. లగ్నేశాత్పితృభావేశే సంపూర్ణబలసంయుతే।
కారకేవా శుభైర్దృష్టే జాతఃపితృవశాగమః.

లగ్నాధిపతికంటె పితృస్థానాధిపతియు పితృకారకుడును బలముగానుండెనేని జాతకుడుతండ్రిస్వాధీనములోనుండును.

శ్లో. త్రికోణస్థోరవిర్యత్రస్వదశాయాంప్రవర్తతే
తత్కాలే పితృసిర్యాణం ప్రవదంతిమహర్షయః.

పితృస్థానమందు రవియుండి రవిదశవచ్చినయెడల ఆదశలో పితృమారకమగును.

శ్లో. లగ్నేవాపంచమేవాపినవమేద్వాదశే పివా
భానుభౌమార్కతనయాః పితృఘ్నంతినసంశయః.

లగ్నమందుగాని పంచమమందుగాని నవమందుగాని ద్వాదశమందుగాని రవికుజశనులున్నయెడల జాతకునికిపితృసౌఖ్యముండదు.

శ్లో. ద్వాదశేమందసూర్యౌచేత్ క్షీణచంద్రాతుసప్తమే
పితుర్మరణదాన్నద్యశ్శుభదృష్టాస్త్రివర్షకే॥

వ్యయమందురవి శనులుండి క్షీణచంద్రుడు సప్తమమందుండిన బాల్యమందు పితృమారకమగును. రవిశనులను శుభగ్రహములు చూచినయెడల మూడు సం॥రములవరకు తండ్రి జీవించును.

శ్లో. చరరాశిగతేసూర్యేలోహితాం గావలోకితే
దివాజాతస్య పితరం పరదేశగతంవదేత్.

చంద్రరాశియందు సూర్యుడుండి కుజునిచే చూడబడు చుండినను పగటియందు జనించినవారితండ్రి పరదేశగతుడగును.

శ్లో. పితృస్థానేశసంయుక్త పాపగ్రహాదశాగమే
పితృమారక భుక్తౌతుకర్మేశస్య పితుర్మృతిః.

పితృస్థానాధిపతితో కలిసిన పాపగ్రహాదశయందు దశమాధిపతియొక్క అంతిర్దశకాలమందు పితృమారకము అగును.

శ్లో. పితృస్థానాధిపే జీవే దుష్టస్థానగతే యది
క్రూరగ్రహైశ్చసందృష్టే తద్దశాపితృనాశనీ.

పితృస్థానాధిపతి గురుడై పాపక్షేత్రమందుండి పాపగ్రహములచే చూడబడినయెడల గురుమహాదశ వచ్చినయెడల గురుమహాదశలో పితృమారకమగును.

శ్లో. జాతస్యప్రథమాబ్దేతు పితుర్మరణమాదిశేత్
వ్యయశే భాగ్యరాశిస్థేనీచాంశే భాగ్యనాయకే.

వ్యయాధిపతి పితృస్థానమందుండి పితృస్థానాధిపతి నీచాంశయందుండినయెడల జాతకుడుపుట్టిన ఒక సం॥రంలోనే పితృమారక మగును.

శ్లో. రాహుణాసహితేసూర్యే చంద్రాధార్యతేశనౌ
సప్తమేకోనవింశాబ్దే తాతస్యమరణం భవేత్.

రవిరాహువుతో కలిసి చంద్రునికి భాగ్యమందు శని

యున్న యెడల 7 వ సం॥రంలో గాని 19 వ సం॥రంలో గాని పితృమారక మగును.

శ్లో. భాగ్యే శేవ్యయరాశిస్థే వ్యయే శేభాగ్యరాశిగే
చతుశ్చత్వారివర్ష శ్చపితుర్మరణమాది శేత్.

పితృస్థానాధిపతి వ్యయమందుండి వ్యయాధిపతి భాగ్యమందున్న యెడల 44 వ సం॥రంలో పితృమారకమగును.

శ్లో. రంధ్రజామిత్రగేమందే మందాజ్జామిత్రగేరవౌ
త్రింశైకవింశే షడ్వింశే పితుర్మరణమాది శేత్.

అష్టమస్థానమునకు సప్తమమున శనియు శనికి సప్తమమున రవియున్న వున్న యెడల 31 వ సం॥రంలో గాని 26 వ సం॥రంలోని పితృమారకము జరుగును.

శ్లో. భాగ్యే శేనీచరాశిస్థే తదీ శేభాగ్యరాశిగే
షడ్వింశే గేత్రయస్త్రింశే పితుర్మరణమాది శేత్.

భాగ్యాధిపతి నీచయందుండి ఆ స్థానాధిపతి భాగ్యమందున్న యెడల 26 వ సం॥రంలో గాని 33 వ సం॥రంలోగాని పితృమారకము జరుగును.

భాగ్యము

శ్లో. భాగ్యస్థితేవాహనరాశినాథే శుక్రేచజీవేశుభరాశియుక్తే
భాగ్యాధీపేకోణచతుష్టయస్థే సువర్ణరత్నాభరణాని దత్తే.

చతుర్థాధిపతి భాగ్యమందుండి శుక్రగురులు శుభస్థానములయందుండి భాగ్యాధిపతి చతుర్థమందుగాని కోణమందు

గాని వున్నయెడల జాతకుడు మిక్కిలి భాగ్యవంతుడగును.

శ్లో. గురుక్షేత్రగతేశుక్రేసచంద్రేగీష్పతౌతథా
లగ్నాత్కేంద్రగతో౽వాపి జాతో౽భాగ్యసమన్వితః.

శుక్రుడు గురుక్షేత్రమందుండి గురుచంద్రులతో కలిసి నను లగ్నా త్కేంద్రమందు శుభగ్రహములతో కలిసినను జాతకుడు మక్కిలి భాగ్యవంతు డగును.

శ్లో. భాగ్యేశేబలసంయుక్తే చంద్రాద్భాగ్యగతేగురౌ
సూర్యాద్భాగ్యగతేచంద్రే పైతృకంభాగ్యమాదిశేత్.

భాగ్యాధిపతి బలముగానుండి చంద్రునకు భాగ్యమందు గురుడుండి సూర్యునకు భాగ్యమందు చంద్రుడున్నయెడలజాత కునకు పితృసంబంధమగు భాగ్యము విశేషముగా నుండును.

శ్లో. పుత్రేశేపరమోచ్చస్థే గురౌభాగ్యగతే సతి
చతుర్థభవనేశుక్రేదీర్ఘాయుర్భాగ్యమాదిశేత్.

పంచమాధిపతి ఉచ్చయందుండి గురుడు భాగ్యమందుండి చతుర్థమందు శుక్రుడున్న యెడల జాతకుడు మిక్కిలి భాగ్యవంతుడగును.

శ్లో. ఆగర్భశ్రీయుతో౽భూయాదుపర్యుపరివర్ధతే
భాగ్యేశేరిపురాశిస్థేషష్ఠేశేభాగ్యరాశిగే.

భాగ్యాధిపతి శత్రుక్షేత్రమందును శత్రుస్థానాధిపతిభాగ్య మందున్న యెడల ఆజాతకునకు యితర భాగ్యము కొంతకలి యును. ఆగర్భశ్రీమంతుడగును.

శ్లో. శుభస్థానేస్థితశ్శుక్రశ్శుభగ్రహానమన్వితే
భాగ్యాధిపదశాయాంతు కుర్యాద్భాగ్యమథాధికం.

శుక్రుడు శుభక్షేత్రమందుండి శుభగ్రహములతో కూడు కొనిన యెడల భాగ్యాధిపతి దశయందు జాతకుడు మిక్కిలి భాగ్యవంతుడగును.

శ్లో. శత్రుస్థేభాగ్యనాథేతు శత్రుభాగ్యనాశనం
త్రుభిశ్శత్రువేభాగ్యే స్వభాగ్యమభివర్ధనం.

భాగ్యాధిపతి శత్రుస్థానమందున్న యెడల శత్రువులవల్ల తనభాగ్యము హరించును. శత్రుస్థానాధిపతి భాగ్యమందున్న యెడల శత్రువులవల్ల తనకు భాగ్యములభించును.

శ్లో. గురౌవాభృగుపుత్రేవాస్వోచ్చమిత్రాంశగేశుభే
ధర్మాధిపేబలయుతే ధర్మాధ్యక్షోభవేన్నరః.

గురుడుగాని శుక్రుడుగాని ఉచ్చయందుగాని మిత్రాంశలయందుగాని యుండి భాగ్యాధిపతి బలముగానున్న యెడల జాతకుడు ధర్మకర్తయగును.

శ్లో. ధనాధిపేలాభగతేదదిశే భాగ్యస్థితెలద్భవనాధిపేవా
కర్మాధిపేనాపియుతెచదృష్టేజాతో మహాభాగ్యసమన్వితస్యాత్

ధనస్థానాధిపతి లాభస్థానమందుండి లాభాధిపతి భాగ్యమందుండి దశమాధిపతితో కలిసినను చూడబడినను జాతకుడు మిక్కిలి భాగ్యవంతు డగును.

శ్లో. భాగ్యాధిపసమాయుక్తోసురమంత్రిర్విలోకితః
లగ్నే వాహనాధశ్చేద్రాజపూజ్యోభవేన్నరః.

నవమాధిపతితో కలిసినవాడు గురునిచే చూడబడినను లగ్నమందు చతుర్థాధిపతియున్నయెడల జాతకుడు మిక్కిలి భాగ్యవంతుడగును.

శ్లో. పుత్రేశ్వరేవాయది భాగ్యరాశౌ
భాగ్యాధిపేనాపియుతేచదృష్టే
తత్కారకేయదిపుత్రభావె
జాతస్సుతాద్భాగ్యముపైతినిత్యం.

నవమమందు పుత్రస్థానాధిపతి యుండి భాగ్యాధిపతిచే చూడబడినను కూడినను భాగ్యకారకుడు పుత్రస్థానమందున్నను జాతకుడు పుత్రులవల్ల భాగ్యవంతుడగును.

శ్లో. లాభేశేభాగ్యరాశిస్థే భాగ్యేశేలాభరాశిగే
జన్మప్రభృతిసౌఖ్యంచ ఉపర్యుపరిభాగ్యవాన్.

లాభాధిపతి భాగ్యమందుండి భాగ్యాధిపతి లాభమందున్నయెడల జాతకుడు ఆజన్మదారభ్య భాగ్యవంతుడగును. జాతకునికి రెండుమూడు భాగ్యములు కలియును.

శ్లో. భాగ్యస్థానగతే జీవేతదీశేకేంద్రసంయుతే
లగ్నేశే బలసంయుక్తే బహుభాగ్యాధిపోభవేత్.

భాగ్యస్థానమందు గురుడుండి భాగ్యాధిపతి కేంద్రమందుండి లగ్నాధిపతి బలవంతుడైనయెడల జాతకుడు మిక్కిలి భాగ్యవంతుడగును.

శ్లో. ధనలాభాధిపౌరాజ్యే దోషాదిరహితస్థితౌ
తయోర్దాయేతుసంప్రాప్తే రాజయోగ్యప్రదౌస్మృతౌ.

ధనలాభాధిపతులు దోషరహితులై రాజ్యమందుండి వారి దశవచ్చినయెడల రాజయోగముఁబట్టును.

శ్లో. భాగ్యరాజ్యాధిపౌరాజ్యే భాగ్యేవాయఃదిసంస్థితౌ
రాజయోగమవాప్నోతి మహాంతీం కీర్తిమశ్నుతే.

భాగ్యరాజ్యాధిపతులు భాగ్యమందుగాని రాజ్యమందుగాని కలిసినయెడల జాతకుడు రాజయోగమును గొప్పకీర్తిని పొందును.

శ్లో. వాహనాధిపతౌభాగ్యే భాగ్యేశే వాహనస్థితే
తావుభౌకేంద్రగౌవాపి స్వతంత్రోద్యోగమాదిశేత్..

వాహనాధిపతి భాగ్యమందును భాగ్యాధిపతి వాహనస్థానమందును వున్నయెడల జాతకుడు స్వతంత్రోద్యోగమువల్ల భాగ్యవంతుడగును.

శ్లో. కేంద్రత్రికోణనేతారౌ సహితౌయోగకారిణౌ
యదిపాపగ్రహైర్యుక్తౌ దద్యాత్స్వాం మధ్యమంఫలం.

కేంద్రత్రికోణాధిపతులు కలిసిన యోగముచేసెదరుగాని వారు పాపగ్రహములతో కలిసినయెడల మధ్యమఫలమును యిచ్చెదరు.

శ్లో. పరమోచ్చాంశగేశుక్రే భాగ్యేశేనసమన్వితే
భ్రాతృస్థానే శనియుతే బహుభాగ్యాధిపో భవేత్

శుక్రుడు పరమోచ్చయందుండి భాగ్యాధిపతితోకూడి తృతీయమందు శనియున్నయెడల జాతకుడు మిక్కిలి భాగ్యవంతు డగును.

శ్లో. పరమోచ్చాంశగేసౌమ్యే భాగ్యేశే భాగ్యరాశిగే
షట్త్రింశాచ్ఛపరంచైవ బహుభాగ్యం వినిర్దిశేత్.

బుధుడు ఉచ్చయందుండి భాగ్యాధిపతి భాగ్యమందున్న యెడల 36 సం॥రములు దాటిన తరువాత జాతకుడు మిక్కిలి భాగ్యవంతుడగును.

శ్లో. విధిగతననాథేసత్యవాదిసుకేశీ
కులజనహితకారీ దేవవిప్రానురక్తః
ప్రథమవయసి రోగీయౌవనేస్థైర్యయుక్తో
బహుతరధనభోగీ దీర్ఘజీవీసుమూర్తిః.

రవి భాగ్యమందున్నయెడల సత్యవంతుడును మంచి కేశములు గలవాడును స్వకుటుంబపోషకుడును దేవబ్రాహ్మణ భక్తిగలవాడును బాల్యమందు రోగముగలవాడును యవ్వనమందు ధైర్యవంతుడును విశేషధనవంతుడును అందమైన వాడును దీర్ఘాయుర్దాయవంతుడును అగును. మరిన్ని నవమమందు రవియున్నయెడల పుత్రధనసౌఖ్యములు గలవాడును పితారిష్టముగలవాడును అగును.

శ్లో. నవమభవనసంస్థే శీతరశ్మౌచపూర్ణే
బహుళితధనభోక్తా కామినీతోషహేతుః

నభవతి ధనభాగీనీచగేక్షీణచంద్రే
సతతమతినిరుద్ధోనిర్ధనోమూఢచేతాః.

చంద్రుడు నవమమం దుండెనేని విశేషధనవంతుడును స్త్రీజనరంజకుడును అగును. చంద్రుడు నవమమందు నీచయందుగాని క్షీణచంద్రుడుగాని వున్నయెడల ధనములేనివాడును దుష్టమగు మనస్సుగలవాడును అగును.

మరిన్ని చంద్రుడు భాగ్యమందుండెనేని పితృసౌఖ్యము గలవాడును భాగ్యవంతుడును అగును.

శ్లో. నవమభవనసంస్థే భూమిపుత్రేతునోగి
నయనయుగళతో ధోపింగళస్సర్వదాస్యాత్
అధికధనసుఖాఢ్యో భాగ్యయుక్తః కుచేల
స్సుకులజకృతసేవశ్శిల్పవిద్యాసమేతః.

కుజుడు నవమమందున్నయెడల సత్తుశరీరముగలవాడును పింగళవర్ణముగల నేత్రములు గలవాడును మిక్కిలి ధనవంతుడును భాగ్యవంతుడును మలినవస్త్రములు ధరించువాడును సజ్జనులతో సహవాసము చేయువాడును శిల్పవిద్యావంతుడును అగును.

మరిన్ని కుజుడు నవమమందున్నయెడల పితృసౌఖ్యము లేనివాడును సామాన్యభాగ్యవంతుడును స్వల్పసంతానము గలవాడును అగును.

శ్లో. శుభనవమగృహేచేచ్చంద్రపుత్రేధనస్యాత్
సుతధనసుదతీభిర్నైజగేహేసుఖీస్యాత్

బహుళతరకలహోవా పాపకర్మావశీగ్యా
కృషికృతబహుభాగ్యః పైతృకంవిత్తమేతి.

నవమమందు బుధుడున్నయెడల ధనవంతుడును దారాపుత్రసౌఖ్యముగలవాడును స్వగృహమందు సౌఖ్యము అనుభవించువాడును సజ్జనులతో కలహించువాడును వ్యవసాయమువల్లగాని వర్తకమువల్లగానిభాగ్యవంతుడును అగును. పితృధనముగలవాడును అగును.

మరిన్ని భాగ్యమందుండెనేని విద్యాధనముగలవాడును భాగ్యవంతుడును అగును.

శ్లో. సురగురుర్నవమె మనుజోత్తమో
భవతిభూపతితుల్యధనస్సుచిః
వివిధకావ్యకథాసువినోదభా
క్ప్రచురకీర్తిధరోధనవాన్సుఖీ.

నవమమందు గురుడుండెనేని శ్రేష్ఠుడును రాజసమానుడును శుభ్రమైనవాడును కావ్యనాటకాలంకారములందు ప్రవీణుడును విశేషకీర్తివంతుడు ధనవంతుడు అగును. మఱియు గురుడు నవమమందుండెనేని భాగ్యవంతుడు పితృసౌఖ్యము గలవాడును అగును.

శ్లో. విమలతీర్థరతోముదితస్సదా
సురవరద్విజభక్తియుతశ్శుచిః

నిజభుజార్జితభాగ్యమహోత్సవః
భవతిధర్మగతేభృగుజేనరః

శుక్రుడు నవమమందుండినయెడల తీర్థయాత్రలయందు ఆసక్తిగలవాడును యెల్లప్పుడు సంతోషముగలవాడును దేవ బ్రాహ్మణభక్తిగలవాడును స్వార్జితమువల్ల సంపాదించబడిన ధనముచే మహోత్సవములుచేయువాడును అగును. మఱియు శుక్రుడు భాగ్యమందుండెనేని విశేషభాగ్యవంతుడును పితృ సౌఖ్యముగలవాడును అగును.

శ్లో. కుదంభకారీ నవమేచపంచమీ
ధర్మార్థహీనః పితృమాతృభేదకః
పాపానురక్తోసధనీసరోగో
వాతాహతస్యాత్పితృభేనమంగీ.

శని నవమమందుండెనేని డాంబికుడును ధర్మములేని వాడును ధనములేనివాడును, తండ్రిలేనివాడును, పాపాత్ముడును వాతరోగముకలవాడును అగును. మరిన్ని భాగ్యమందు శని యుండెనేని దరిద్రుడును పితృమాతృసౌఖ్యములు లేనివాడును అగును.

శ్లో. ధర్మస్థితేచంద్రరిపౌ మనుష్యశ్చండాలకర్మపిశునఃకుచేలః
జ్ఞాతిప్రమోదీనియతఃప్రవీణఃశత్రోఃకులాద్భీతిముపైతినిత్యం

రాహువు భాగ్యమందుండెనేని దుష్కార్యములుచేయు వాడును లుబ్ధుడును మలినవస్త్రములు ధరించువాడు జ్ఞాతు

లను సంతోషపెట్టువాడును శత్రువులవలనను ఎప్పుడు భయ ముకలవాడును అగును మఱిన్ని రాహువు భాగ్యమందుండె నేని తండ్రిలేనివాడును స్వల్పభాగ్యవంతుడును దుర్మార్గుడును అగును.

శ్లో. శూరఃకలహశీలశ్చ కార్యాకార్యవిచక్షణః
వాచాటశ్చైర్యవాన్ ధీరో నవమస్థే భవేద్ధ్వజే.

నవమమునందు కేతువుండెనేని శూరుడును పోట్లాటయందు తెలివితేటలు గలవాడును యుక్తాయుక్తముగలవాడును వాచాలుడును ధైర్యముగలవాడును సాహసముగలవాడును అగును. మఱిన్ని కేతువు భాగ్యమందుండిన పితృసౌఖ్యముగల వాడును స్వల్పభాగ్యవంతుడును అగును.

భాగ్యభావసమాప్తః

10 ఉద్యోగము

శ్లో. కర్మేశగురుసౌమ్యానాం బలాద్యాగాదికర్మకృత్
శుభవీక్షణయోగాభ్యాం విశేషాత్కర్మశోభవేత్.

దశమాధిపతియు గురుడును బుధుడును బలముగానున్న ను జాతకుడు యజ్ఞాదిక్రతువులు చేయును.

శ్లో. కర్మస్థానేతుచత్వారోగ్రహాస్తిష్ఠంతిచేత్తథా
పశ్యంతి యదివాజాతః ప్రవ్రజ్యాయోగమాప్నుయాత్.

దశమందు 4 గ్రహములుండినను చూడబడిన జాతకుడు సన్యాసియగును.

శ్లో. శదశుభసనాధే కేంద్రకోణే స్వసంస్థే బలవతి యది యానే
విశ్వవిఖ్యాత గీమదకలితహోత్రై స్సేవ్యమానం గజేంద్రైః
జనయతి నరనాధం మేదినీమండలస్య.

దశమాధిపతి కేంద్రకోణములయందు గాని ఉచ్ఛయందుగాని బలముగా నున్న యెడల జాతకుడు అశ్వములు మదగజములు గలవాడగును. మంచి రాజయోగము గలవాడగును.

శ్లో. కర్మస్థానంగతే చంద్రే గంగాస్నానంచ సిధ్యతి
అథస్రాద్వ్యయుక్తో వా యజ్ఞకర్తా భవేన్నరః.

దశమమందు చంద్రుండెనేని గంగాస్నానము చేయువాడు గాని యజ్ఞము చేయువాడు గాని అగును.

శ్లో. మానే చ రాహౌ యది వా దనే శే
గంగావగాహీ బహుపుణ్యకారీ
మానే చ మీనే యది వార్కసూనౌ
సన్యాసయోగం ప్రవదంతి సంతః.

దశమమందు రాహువుగాని గురుడుగాని యున్న యెడల గంగాస్నానము చేయువాడును దశమమందుగాని మీనమందు గాని శనియున్న యెడల సన్యాసియు నగును.

శ్లో. మానే జీవే భృగుయుతే లగ్నేశే బలసంయుతే
స్వోచ్ఛరాశిగతే మందే జ్ఞానవమానార్థవాన్భవేత్.

దశమమందు గురుడు శుక్రునితో కలిసినను లగ్నాధిపతి బలముగానుండి శని ఉచ్ఛయందున్న యెడల జ్ఞానవంతుడును అర్థవంతుడును అగును.

శ్లో. కర్మేశేలగ్న భావస్థేలగ్నే శేన సమన్వితే
తత్కోణ కేంద్ర గేచంద్రేధర్మ్యం కర్మకులోచితం.

దశమాధిపతి లగ్నమందుండి లగ్నాధిపతితో కలిసి కేంద్రమందు చంద్రుడున్నయెడల కులమునకు తగిన కర్మలు చేయువాడగును.

శ్లో. శుభేఃర్మణిజాతస్తు కర్మాణికురుతే పితుః
ధర్మకర్మాధిపౌశుద్ధౌసంయుకౌపీరసంయుతౌ.

భాగ్యరాజ్యాధిపతులు కలిసి బలముగా నున్నయెడల విశేష శుభ కార్యములు చేయువాడును పితృకార్యము చేయువాడును అగును.

శ్లో. కర్మాధిపోబుధస్స్వోచ్చేశుభకర్మ ప్రవర్ధకః
సరాహుఃకర్మసంస్థైశ్చేద్విఘ్నఃకర్మవిహన్యతే

దశమాధిపతి బుధుడై ఉచ్చయం దుండెనేని శుభ కర్మలు చేయువా డగును. ఆబుధుడు రాహువుతో కలిసెనేని కర్మవిఘ్నమగును.

శ్లో. వ్యయేబుధేవాత్వధవాతదీశేస్వోచ్చాన్వితేతాదృ
శపుణ్యభాగేచంద్రేతృతీయే జలరాశియుక్తే సౌమ్యేక్షితే
తీర్థనిషేవణంస్యాత్.

వ్యయమందు బుధుడుండి వ్యయాధిపతి ఉచ్చయం దుండి చంద్రుడు తృతీయమందు జలరాశియం దున్నయెడల తీర్థయాత్రలు చేయువాడును పుణ్యకార్యములు చేయువాడును అగును.

శ్లో. జలర్క్ష గా పూర్ణ శశాంకజీవౌ
మానస్థితౌ పుణ్యవిశేషదాయినౌ
మానేశ్వరో శుక్రయుతేచ
కేంద్రేస్థితే సర్వజనేషుమాన్యః.

గురువున్ను చంద్రుడున్ను పూర్ణ జలరాసులయందుండి నను దశమమందుండినను విశేషపుణ్యకార్యములు చేయువాడగును. దశమాధిపతి శుక్రునితో కూడి కేంద్రమందుగాని ఉచ్ఛయందుగాని యున్నయెడల జాతకుడు సర్వజనపూజ్యుడగును.

శ్లో. ఆజ్ఞస్థానాధిపే సౌమ్య శుభదృష్టి యుతేపివా
శోభనాంగతేవాపి జాతస్స్యాజ్ఞాధికారివాన్.

దశమాధిపతి శుభగ్రహములతో కూడినను చూడబడినను మంచి యధికారముగల ఉద్యోగము చేయువాడగును.

శ్లో. ఆజ్ఞస్థానంగతేసూర్యే భూమిపుత్రేణ వాయుతే
కేంద్రాన్వితే తదీశేపి క్రూరాన్మాజ్ఞానరోతిసః.

దశమస్థానమందు రవియుండి కుజునితో కలిసి దశమాధిపతి కేంద్రమందున్నయెడల జాతకుడు క్రూరశిక్షలు విధించు అధికారముగల ఉద్యోగము చేయువాడగును.

శ్లో. రాహుమ వయుతేమానే రంధ్రేరాహౌధ్వజేపివా
నీచస్థేకర్మభావేశౌ నీచశిల్పానుదక్షిణః.

దశమమునందు శనిగాని రాహువుగాని యుండినను అష్టమ

మందురాహువుగాని కేతువుగానియున్నను నీచశిక్షలు విధించు వాడగును.

శ్లో. శశాంకేకీర్తిసంయుక్తే గురుశుక్రనిరీక్షతే
పారావతాదిభాగస్థే సత్కీర్తిసహితోభవేత్

చంద్రుడు దశమమందుండి గురుశుక్రులచే చూడబడినను పారావతాంశ యందున్నను జాతకుడు విశేషకీర్తివంతుడగును.

శ్లో. రాజ్యధర్మాధిపాభ్యాంతుసందృష్టె బహుభాగ్యభాక్
ధర్మకర్మాదిపౌదృష్టౌ గురుణారాజయోగభాక్సీ.

భాగ్య రాజ్యాధిపతులు పరస్పరవీక్షణముగలవారైనను దశమనవమాధిపతులు గురునిచేచూడబడినను రాజయోగము పట్టును.

శ్లో. ధర్మస్థానేగురుక్షేత్రే స్వగృహేభృగునందనే
పంచమాధిపసంయుక్తె బహుద్రవ్యస్యనాయకః.

దశమస్థానము గురుక్షేత్రమైయుండి శుక్రుడుస్వక్షేత్రమందుండి పంచమాధిపతితో కలిసినయెడల విశేష భాగ్యవంతుడగును.

శ్లో. పంచమేతుశనిక్షేత్రే తస్మిన్‌రవిసుతేయది
లాభేసోమాత్మజయుతే బహుద్రవ్యస్యనాయకః.

పంచమముశనిక్షేత్రమై అచ్చటశనియుండి లాభమందు బుధుడున్నయెడల జాతకుడు విశేషభాగ్యవంతుడగును.

శ్లో. పంచమేతురవిక్షేత్రస్మిన్ శుక్రేనసోమజే
లాభేతుశనిసంయుక్తే బహుద్రవ్యస్యనాయకః.

పంచము రవి క్షేత్రమై అచ్చట బుధశుక్రులుండి లాభమందు శనియున్న యెడల జాతకుడు మిక్కిలి భాగ్యవంతుడగును.

శ్లో. పంచమేతురవిక్షేత్రేతస్మిన్ రవిసుతోదయ
లాభే దేవేంద్రపూజ్యశ్చే ద్బహుద్రవ్యస్యనాయకః.

పంచమమురవిక్షేత్రమై అచ్చటశనియుండులాభమందు గురుడున్న యెడల జాతకుడు మిక్కిలి భాగ్యవంతుడగును.

శ్లో. కర్మాధిపతిస్వతుంగే రాజమంత్రీభవేన్నరః
స్వక్షేత్రస్వోచ్చగేవాపి ప్రతాపాఢ్యోభవేన్నరః.

దశమాధిపతి స్వక్షేత్రమందుగాని ఉచ్చయందుగాని ఉన్న యెడల విశేష భాగ్యవంతుడగును.

శ్లో. ధర్మేశేధర్మరాశిస్థే కర్మేశకర్మరాశిగే
సుకాధిపేనసందృష్టే రాజయోగోభవేన్నర॥

భాగ్యాధిపతి భాగ్యమందున్నను రాజ్యాధిపతి రాజ్యమందునుండి పంచమాధిపతిచే చూడబడినయెడల జాతకుడు రాజయోగముకలవాడగును.

శ్లో. కర్మస్థానాధిపేసౌమ్యే స్వోచ్చమిత్రస్వవర్గగే
సౌమ్యషష్ట్యంశగేవాపి సత్కీర్తిసహితోభవేత్.

దశమాధిపతి బుధుడై ఉచ్చమిత్రస్వక్షేత్రములయం దుండి స్వషష్ట్యంశయందున్న యెడల విశేషకీర్తివంతుడగును.

శ్లో. షష్ఠ్యంశేకర్మరాశిస్థేకర్మేశేమందసంయుతే
కేంద్రత్రికోణగేవాపి దాసాదాసీన్వినిర్దిశేత్.

షష్ఠాధిపతి దశమమందుండి దశమాధిపతి శనితో కూడుకొని కేంద్రకోణములయం దున్న యెడల జాతకుడు దాస దాసీజనులు కలవాడగును.

శ్లో. తుంగరాసింసమాశ్రిత్యకర్మేశేగురుసంయుతే
భాగ్యేశేకర్మరాశిస్థే మానైశ్వర్యప్రతాపవాన్.

దశమాధిపతి ఉచ్చయందుండి గురునితో కూడి భాగ్యాధిపతి దశమమందున్న యెడల మానవంతుడును ఐశ్వర్యవంతుడును ప్రతాపవంతుడును అగును.

శ్లో. లగ్నేశేకర్మరాశిస్థేకర్మేశేలగ్నసంయుతే
తావుభౌలగ్న గావాపిసుఖజీవనభాగ్యవాన్.

లగ్నాధిపతి దశమమందుండినను దశమాధిపతిగల్న మందుండినను లేక ఇద్దరు కేంద్రమందుండినను సౌఖ్యమైన జీవనముకలవాడును భాగ్యవంతుడును అగును.

శ్లో. ఆజ్ఞస్థానాధిపేసౌమ్యే శుభదృష్టియుతేపివా
శోభనాంశగతేవాపి జాతస్యాజ్ఞాకరోభవేత్.

దశమాధిపతి శుభగ్రహమై శుభగ్రహములతో కూడినను చూడబడినను జాతకుడు శిక్షనువిధించువాడగును.

శ్లో. కర్మేశగురుసౌమ్యానాం బలాద్యాగాదికర్మకృత్
శుభవీక్షణయోగాభ్యాం విశేషాత్కర్మకోభవేత్.

కర్మస్థానమందు గురుబుధులున్న యెడల యజ్ఞాదిక్రతువులు చేయువాడుఅగును. ఆగురుబుధులను శుభగ్రహములు చూచెనేని విశేషకర్మలను చేయువాడు అగును.

శ్లో. కవిసౌమ్యగురాచార్యస్థితరాశ్వరాస్తథా
షష్ఠాష్టమవ్యయస్థాశ్చేత్కర్మవైకల్యమాదిశేత్.

శుక్రబుధగురులున్న స్థానాధిపతులు షష్ఠాష్టమవ్యయములయం దున్నయెడల కర్మవికలుడగును.

శ్లో. కర్మస్థానేతుచత్వారోగ్రహాస్తిష్ఠంతిచేత్తథా
పశ్యంతియదివాజాతః ప్రవ్రజ్యాయోగమాప్నుయాత్.

దశమస్థానమందు 4 గ్రహములుండినను 4 గ్రహములచే చూడబడిన వానప్రస్థాశ్రమమును పొందును.

శ్లో. పాపానీచగపాత్రాశ్శుభాబలయుతాః కేంద్రత్రికోణస్థితాః
ఖేటాశ్చేద్యదిభాగ్యకర్మగృహసాభాగ్యేధనా కర్మణి.
రాజాస్యాన్మతిమాన్మహాధనయుతో ఖ్యాతప్రతాపాన్వితో
దీర్ఘాయుఃపరభూపవందిత పదస్సర్వజ్ఞతుల్యస్సుఖీ.

పాపగ్రహములు నీచయందుండి శుభగ్రహములు బలముగానుండి కేంద్రకోణములయందుండి భాగ్యరాజ్యాధిపతులు భాగ్యమందుగాని రాజ్యమందుగాని వున్నయెడల జాతకుడు ఖ్యాతిగలవాడును, ప్రతాపవంతుడును దీర్ఘాయుర్దాయముకలవాడును రాజాధిరాజును సర్వజ్ఞుడును అగును.

శ్లో. ఆజ్ఞాస్థానాధిపేసౌమ్యే శుభదృష్ట్యయుతేపివా
శోభనాంశగతేవాపి జాతస్స్యాజ్ఞాధిపోభవేత్.

దశమాధిపతి శుభగ్రహ మయి శుభ గ్రహములచే చూడబడినయెడల జాతకుడు శిక్షలను విధించువాడగును.

శ్లో. ఆజ్ఞాస్థానగతేసూర్యే భూమిపుత్రేధవాయుతే
కేంద్రాన్వితేతదీశేపిక్రూరాంశా మాజ్ఞాంకరోతినః.

దశమమందు కుజుడుగాని రవిగాని వుండి ఆస్థానాధిపతి కేంద్రమందున్నయెడల కఠినశిక్షలను విధించువాడగును.

శ్లో. ఆజ్ఞాధిపేమందయుతే రంధ్రనాధేనసంయుతే
క్రూరాంశే కేంద్రరాశౌవా క్రూరామాజ్ఞాంకరోతిపః.

దశమాధిపతి శనితో కలిసినను అష్టమాధిపతితో కలిసినను క్రూరాంశయందుగాని కేంద్రమందుగాని వున్నయెడల ఆజాతకుడు క్రూరశిక్షను విధించువాడు అగును.

శ్లో. మానాధిపే కేంద్రయుతేశుభయుక్తేక్షితేపివా
క్రూరషష్ట్యంశసంయుక్తే సౌమ్యామాజ్ఞాంకరోతినః.

దశమాధిపతి కేంద్రమందుండి శుభగ్రహములతో కూడినను చూడబడినను క్రూరషష్ట్యంశనియందున్నను కఠినములేని శిక్షను విధించువాడు అగును.

శ్లో. రాహుమాందియుతేమానేరంధ్రేరాహశాద్యజేపివా
నీచస్థేకర్మభావేశేక్రూరామాజ్ఞాంకరోతినః.

దశమమందు శని రాహువు లున్నను లేక అష్టమమందు

రాహువుగాని కేతువుగాని వుండి దశమాధిపతి నీచయందున్న యెడల క్రూరశిక్షలను విధించువాడు అగును.

శ్లో. శశాంకేకర్కిసంయుక్తె గురుశుక్రనిరీక్షతే
పారావతాదిభాగస్థె సత్కీర్తిసహితోభవేత్.

చంద్రుడు కర్కాటకమందుండి గురు శుక్రులచే చూడబడినను పారావతాది అంశలయం దున్నను కీర్తివంతుడు అగును.

శ్లో. కాంతిస్థానాధిపే సౌమ్యేస్వోచ్చ మిత్రస్వవర్గగే
సౌమ్యషష్ట్యంశకేవాపి సత్కీర్తిసహితోభవేత్.

దశమస్థానాధిపతి బుధుడై ఉచ్చయందుగాని మిత్ర క్షేత్రమందుగాని స్వవర్గయందుగాని వున్న యెడలనున్ను శుభ షష్ట్యంశలయం దున్నను జాతకుడు కీర్తివంతుడు అగును.

శ్లో. పాపగ్రహాణాం సంబంధె మానసాథేబలక్షయె
క్రూరషష్ట్యంశసంయుక్తే సత్కీర్తిసహితోభవేత్.

దశమాధిపతి పాపగ్రహములతో కలిసి బలహీనుడై క్రూరషష్ట్యంశలయం దున్నను జాతకుడు సత్కీర్తి కలవాడు అగును.

శ్లో. అపకీర్తియుతోజాతః కర్మస్థేచరవాశనా
పాపాంశకేపాపదృష్టే పాపమధ్యగతేపితత్.

కర్మస్థాన మందు రవి శనులున్నను కర్మస్థానాధిపతి పాపాంశలయం దున్నను పాపగ్రహములచే చూడబడినను జాతకుడు అపకీర్తిగలవాడు అగును.

శ్లో. షష్ఠేశే కర్మరాశిస్థే కర్మేశేమందసంయుతే
కేంద్రత్రికోణగేవాపి దాసీదాసాన్వినిర్దిశేత్.

షష్ఠాధిపతి దశమమందుండి దశమాధిపతి శనితోకూడి కేంద్రకోణములయందున్నయెడల దాసీదాసాదులు గలవాడు అగును.

శ్లో. యత్రనీచగతాః ఖేటాః తత్రతుంగగ్రహాన్వితాః
నీచదోషంహరత్యాహు ర్వశిష్టాత్రిపరాశరాః.

ఏరాశియందు నీచగ్రహములుండునో అచ్చట ఉచ్చగ్రహములుగూడ నున్నయెడల నీచదోషములేదని మహర్షులు చెప్పుదురు

శ్లో. చతురః పంచవా ఖేటాఃనీచరాశిషుసంస్థితాః
కేంద్రకోణేషుసంయుక్తాః రాజయోగఫలప్రదాః.

నాలుగుగాని ఐదుగాని గ్రహములు నీచయందుండి కేంద్రకోణములయందున్నయెడల రాజయోగము కలుగును.

శ్లో. ఏవంబహునిచేషు రాశిచక్రస్థితేష్వపి
అంశేషువీర్యవంతశ్చేత్కిరాతమ్లేచ్ఛభూపతిః.

రాశియందనేకగ్రహములు నీచలయందుండి అంశలలో బలముగా నున్నయెడల మ్లేచ్ఛదేశములకు ప్రభువగును.

శ్లో. త్రిభిరుచ్చగతోవాపి రాజాభవతినిశ్చయం
త్రిభిర్నీచగతోవాపి సుఖరాజ్యాదిసంపదః.

మూడు గ్రహములు ఉచ్చయందున్నను నీచయందున్నను రాజయోగము పట్టును.

శ్లో. సగురుశ్చంద్రమాలగ్నే యదిరాజాభవిష్యతి
గురుర్మకరలగ్నేచ చంద్రోవాకర్కటేస్థితః.

గురుడు చంద్రునితో కలిసి లగ్నమందున్నను గురుడు మకరమందును చంద్రుడు కర్కటకమందును ఉన్నను రాజ యోగము పుట్టును.

శ్లో. లాభేశధనేశధర్మేశ్వరాణాంఏకోపి చంద్రాద్యదికేంద్రవర్తి
స్వపుత్రలాభాధిపతిర్గురు శ్చేదఖండసామ్రాజ్యముపైతిజాతః

లాభాధిపతి ధనాధిపతి భాగ్యాధిపతి వీరిముగ్గురిలో నొకరు చంద్రునకు కేంద్రములయందున్నను లేక గురుడు ధన పంచమాధిపతియైనను లేక ధనలాభాధిపతియైనను అఖండ యోగము కలుగును.

శ్లో. యదిభవతిగ్రహేంద్రాః పంచరాశౌనియుక్తాః
అశుభశుభయుతోవానీచశత్రుగ్రహేవా
అశుభమఖిలనాశం నాశకేంద్రుమాదీ
న్నభవతినృపతుల్యో యోగపాంచాననోయం.

గ్రహములన్నియు 5 రాసులలోనుండి పాపగ్రహములతో కలిసినను శుభగ్రహములతో కలిసిననుశత్రుక్షేత్రములయందున్నను కేమద్రుమాదియోగమున్నను సమస్తదోషములను పోగొట్టి శుభములనిచ్చును ఇదిపాంచాననయోగమని చెప్పబడును. ఈయోగమున పుట్టినవారు రాజసమానులగుదురు. ఏదోషమున్నను పోగొట్టి యోగమును చేయును.

శ్లో. లగ్నాదిబాణసంఖ్యాకరాశిగానవఖేచరాః
స్థితాశ్చేత్పంచఖేట్యాఖ్యమాలికాయోగముచ్యతే.

లగ్నము లగాయతు వరుసగా ఐదురాసులలో గ్రహములుండెనేని పంచగ్రహమాలికా యోగమనబడును.

శ్లో. జన్మకాలఘటీలగ్న ఏకేనైవనిరీక్షితే
ఉచ్చారూఢేతుసంప్రాప్తె చంద్రాక్రాంతేవిశేషతః

శ్లో. క్రాంతేవాగురుశుక్రాభ్యాం కేనాప్యుచ్చగ్రహేణవా
దుష్టార్గలాగ్రహాహాభావే రాజయోగోనసంశయః.

జన్మలగ్నముగాని ఘటికాలగ్నముగాని ఒకశుభగ్రహముచే చూడబడినను ఆరూఢలగ్నమందు ఉచ్చగ్రహమున్నను లేక శుభగ్రహమున్నను పాపగ్రహసంబంధము లేనియెడల అట్టి జాతకుడు రాజయోగము గలవాడు అగును.

శ్లో. శుభేలగ్నేశుభేత్వర్ధే తృతీయెపాపఖేచరై:
చతుర్థేతుశుభైప్రాప్తై రాజావాతత్సమోపివా.

లగ్నమందున్న ద్వితీయమందున్న శుభగ్రహములుండి తృతీయమందు పాపగ్రహములుండి చతుర్థమందు శుభగ్రహములున్న యెడల రాజుగాని రాజతుల్యుడుకాని అగును.

శ్లో. ఉచ్చోవాహారిణాంకోవాజీవోవాశుక్రఏవవా
ఏకోబలీధనగతః శ్రీయుందిశతిదేహినః.

ఉచ్చగ్రహముగాని శుభగ్రహముగాని ధనస్థానమందు బలముగా నున్నయెడల ఆజాతకుడు విశేష ధనవంతుడగును.

శ్లో. లగ్నం పశ్యతి యః ఖేటః స్వోచ్చే సశ్శుభదాయకః
నీచఖేటోపి లగ్నం చేత్ పశ్యే ద్రాజ్యప్రదో భవేత్ .

లగ్నమును స్వగ్రహము చూచునో ఆగ్రహము శుభ ఫలము నిచ్చును. నీచగ్రహము లగ్నమునందున్నను లగ్నమును చూచినను శుభఫలము నిచ్చును.

శ్లో. రాజయోగోజన్మలగ్నం పశ్యేదుచ్చగ్రహోయది
షష్టాష్టమగతే నీచేలగ్నే పశ్యతియోగకృత్ .

జన్మలగ్నమును ఉచ్చగ్రహము చూచినను రాజయోగము పట్టును. నీచగ్రహము షష్టాష్టవ్యయములయందుండి లగ్నమును రాజయోగము పట్టును.

శ్లో. షష్టాష్టమాధిపేనీచే లగ్నం పశ్యతి బాంధవా
తృతీయేలాభగేనీచేలగ్నం పశ్యతిరాజ్యద .

షష్టాధిపతి గాని అష్టమాధిపతిగాని నీచయందుండి లగ్నమును చూచినను తృతీయాధిపతి లాభమందుండి నీచయందుండి లగ్నమును చూచినను రాజయోగము పట్టును.

శ్లో. చతుర్థే శుభఖేట్శ్చేద్రాజయోగప్రదో గ్రహః
బలయుక్తశ్చతుర్థోప రాజాదిష్వయస్య త్రిషు.

చతుర్థమందు శుభగ్రహమున్నను చతుర్థాధిపతి బలముగా నున్నను రాజయోగము పట్టును.

శ్లో. చరేతుర్యే స్వల్పఫల స్థిరేతుర్యే చమధ్యమ
ద్విస్వభావే పూర్ణఫల రాజయోగప్రదాయకః.

చరమందు ఉచ్చగ్రహమున్న యెడల స్వల్పఫలమున్న స్థిరమందున్న యెడల మధ్యఫలమున్న, ద్విస్వభావమందున్న యెడల పూర్ణఫలమున్న ఇచ్చును.

శ్లో. ధనస్థితో వాలగ్నంచే త్పశ్చేద్వాహనకారకః
రాజయోగాద్యభావేతు ధనధాన్యవినిర్ణయః.

వాహనకారుడగు శుక్రుడు లగ్నమందుగాని ధనస్థానమందుగాని వున్నను లగ్నమును చూచినను రాజయోగము లేకపోయినను ధనధాన్యాభివృద్ధి కలుగును.

శ్లో. నభశ్చరా పంచనిజోచ్చసంస్థాః
యస్యప్రసూతౌ సతుసార్వభౌమః
త్రయస్వతుం గాదిగతానరాజా
రాజాత్మజ స్త్వన్యసుతోత్రమంత్రీ.

ఐదుగ్రహములు ఉచ్చయందున్న యెడల సార్వభౌములగును. మూడుగ్రహములు ఉచ్చయందున్న యెడల రాజవంశమునందు జన్మించినవాడు రాజగును. అన్యవంశమునందు జన్మించినయెడల మంత్రియగును.

శ్లో. సస్యాల్లగ్న పదే శుభేశుభయుతే చేద్భోగభాగ్యైర్యుత
స్తస్మాత్కోణచతుష్టయే శుభఖగేరాజామహాపండితః
క్రూరస్తత్రవిపర్యయోయది పునఃష్టష్ఠాష్టరిష్ఫేషువా
హ్యేవంసర్వపదైశ్శుభాశుభ ఫలం సమ్యగ్విచార్యాదిశేత్.

లగ్నారూఢము శుభక్షేత్రమై శుభులతో గూడినదైనను ఆ జాతకుడు భోగియు భాగ్యవంతుడున్ను అగును.

ఆరూఢమునకు కేంద్రకోణములయందు శుభులుండిరేని గొప్ప విద్వాంసుండగు రాజగును. ఆ కేంద్రకోణములయందే పాపులున్నయెడల దానికి వ్యత్యయమగును అనగా నిర్భాగ్యుండును విద్యావిహీనుండును అగును. ఆరూఢమునకు 6, 8, 12 స్థానములయందు పాపులున్నను ఆప్రకారమే నిర్భాగ్యుండును విద్యావిహీనుండును అగును. ఈప్రకారమె సకలారూఢముల వల్లను మంచిచెడ్డలను తెలియవలయును.

శ్లో. సద్బుద్ధివాహనధనాగమనానినూనం
భూప్రసాదసుతసౌఖ్య సమన్వితాని
సాధూపకారకరణం మణిభూషణాని
మేషూరణేదినమణిః కురుతేవరాణాం.

దశమందు రవి యున్నయెడల మంచిబుద్ధికలవాడును, ధనవాహన సౌఖ్యముకలవాడును, రాజానుగ్రహము గలవాడున్ను, పుత్రసౌఖ్యముగలవాడున్ను, సజ్జనులకు ఉపకారము చేయువాడున్ను మణిభూషణములు గలవాడున్ను అగును.

శ్లో. క్షోణీడాలాదర్థలబ్ధిర్విశాలా
కీర్తిర్నూనం ర్తిన్సత్వసంతోషయుక్తా
చంచల్లక్ష్మీశ్రీలసంసారినీస్యా
న్మానస్థానీయామినీనాయకశ్చేత్.

దశమమందు చంద్రుడున్న యెడల రాజులవల్ల నంది

విశేషధనలాభముగలవాడున్ను కీర్తిగలపురుషుడున్ను సుందరమైనవాడున్ను సంతోషము గలవాడున్ను అగును.

శ్లో. దశమభేధరణీసుతసంయుతే
రిపుజయీాధనవాన్ధరణీధవః
జఠరరోగయుతశ్చసుభక్తిమాన్
సులభకోపయుతో మతిమాన్నరః.

దశమమందు కుజుడున్నయెడల శత్రువులను జయించువాడున్ను ధనవంతుడున్ను రాజును హృదయమందు రోగముగలవాడున్ను భక్తిగలవాడున్ను స్వల్పకోపముగలవాడున్ను బుద్ధిమంతుడున్ను అగును.

శ్లో. గురుజనస్యహితోనితరాంనరో బహుధనోదశమేశశినందనే
నిజభుజార్జితతుంగతురంగమోబహుధనైర్నియతోమిత
భాషణః.

దశమమందు బుధుడుండెనేని గురుజనప్రియుడున్ను విశేష ధనవంతుడున్ను స్వార్జితమువల్ల సంపాదించబడు అశ్వములు గలవాడున్ను, మితముగా మాట్లాడువాడున్ను అగును.

శ్లో. దశమమందిరగేచబృహస్పతౌ
తురగరత్న విభూషితమందిరః
జయతినీతియుతైర్బుధసత్తమైరు
పచితోప్రచయధర్మసుఖోదయః.

దశమమందు గురుడుండెనేని గుర్రములును రత్నభూషణములున్ను మంచిగృహములున్ను విద్యాప్రసంగమున్ను విద్వాంసులతో స్నేహము గలవాడున్ను అగును.

శ్లో. దశమస్థం దిగ గేభృగుసూనౌ శజే
సకలబంధుహితస్థిరభోగవాన్
అధికసుందరవేషశుభాకృతి
ర్నరవరశ్శుభకీర్తిరుదారధీః.

దశమమందు శుక్రుడున్న యెడల బంధుహితుడున్ను స్థిరమైన భాగ్యభోగ్యములు గలవాడున్ను అధిక సుందరమైనట్టి వేషభాషలు గలవాడున్ను కీర్తిగలవాడున్ను ఉదార సాహసములు గలవాడున్ను అగును.

శ్లో. శనైశ్చరే కర్మణివీర్యయుక్తే
మహాధనో భృత్యజనానురక్తః
ప్రాంశుః ప్రచండో నృపసద్మవాసీ
సుశీలయుక్తస్సుఖభాజనంచ.

దశమమందు శనియున్న యెడల మిక్కిలి ధనవంతుడున్ను భృత్యులకు ఇష్టమైనవాడున్ను రాజగృహమందు నివాసము చేయువాడున్ను సద్వ్యాపారము గలవాడున్ను అగును.

శ్లో. కామీచలః కర్మగతే చరాహౌ
పరార్థలుబ్ధో ఘుకంశ్చదీనః
స్థానచ్యుతః పాపయుతశ్చజీవే
త్వనిందితాత్మాబలవాంశ్చదృప్తః.

దశమమందు రాహువుండెనేని కాముకుడున్ను చపల

స్వభావముగలవాడున్ను పరద్రవ్యాపేక్షగలవాడున్ను ఉద్యోగ భ్రష్టత్వముగలవాడును అగును. ఆరాహువు గురునితో కూడె నేని దయాస్వభావము గలవాడున్ను బలవంతుడున్ను అగును.

శ్లో. శాస్త్రజ్ఞస్సుమతిశ్చైవ ధనవాన్భోగవానపి
సాధుర్గుణీచశాంతాత్మా కర్మస్థానే భవేద్ధ్వజే.

దశమమందు కేతువుండెనేని మంచిబుద్ధి కలవాడున్ను ధనవంతుడున్ను భోగవంతుడున్ను సత్పురుషుడున్ను మంచి గుణము కలవాడున్ను శాంతమైనవాడున్ను అగును.

దశమభావ స్సమాప్తః

## 11 లాభభావము

శ్లో. లాభేశ్వరే కేంద్రగతే త్రికోణేవాసమన్వితే
లాభేవా పాపసంయుక్తౌ ధనలాభముదీరయేత్.

లాభాధిపతి కేంద్రకోణములయం దున్నను లాభమందు పాపగ్రహములతో కూడినను ధనలాభము విశేషముగా కలుగును.

శ్లో. ధనాధిపే లాభగతే లాభశేధనమాగతే
ఉభౌ కేంద్రగతావాపి ధనలాభము దీరయేత్.

ధనాధిపతి లాభమం దున్నను లాభాధిపతి ధనమం దున్నను లేక ఇద్దరు కేంద్రకోణములయం దున్నను ధనలాభము విశేషముగా కలుగును.

శ్లో. శుభమధ్యగతేలాభే దనీశేవా తథాస్థితే
పారావతాదిభాగస్థె ధనలాభము దీరయేత్.

లాభస్థానము శుభగ్రహములయొక్క మధ్యమందున్నను లాభాధిపతి శుభగ్రహములయొక్క మధ్యమందున్నను లేక లాభాధిపతి పారావతాంశమందున్నను ధనలాభము విశేషముగా నుండును.

శ్లో. లాభయుక్తరాశీశే శుభగ్రహైః రీక్షితే
శుభగ్రహాణాం మధ్యస్థె ధనలాభముదీరయేత్.

లాభాధిపతియున్న రాశ్యాధిపతి శుభగ్రహములచే చూడబడినను శుభగ్రహములయొక్క మధ్యమందున్నను విశేష ధనలాభము గలుగును.

శ్లో. లాభానాధసమాయుక్తనవాంశాధిపతౌ శుభే
విత్తాధిపేనసందృష్టె ధనలాభము దీరయేత్.

లాభాధిపతితో కూడుకొన్న నవాంశాధిపతి శుభుడై ధనాధిపతిచే చూడబడినయెడల ధనలాభము కలుగును.

శ్లో. ధనీఖ్యాతోధవావాగ్మీ సుధీరాథ్యశ్చిరాయుషః
రవ్యాదయఃక్రమాల్లాభేస్వోచ్చమిత్రస్వరాశిగాః.

రవి మొదలగు గ్రహములు క్రమముగా లాభమును గాని లేక ఉచ్చమిత్ర స్వక్షేత్రములయందు గాని ఉన్నయెడల జాతకుడు ధనవంతుడున్ను ప్రసిద్ధిగలవాడున్ను వాచాలకుడున్ను విద్వాంసుడున్ను దీర్ఘాయుర్దాయువంతుడున్ను అగును

శ్లో. లాభేలాభవతౌజీవశుక్రచంద్రసమన్వితే
ధనధన్యాదివాన్ శ్రీమాన్ రత్నాద్యాభరణైర్యుతః.

లాభాధిపతి లాభమందుండి గురుశుక్రచంద్రులతో కలిసినయెడల జాతకుడు ధనవంతుడున్ను ధాన్యాదివృద్ధికలవాడున్ను రత్నములు మొదలగువస్తువుగలవాడున్ను అగును.

శ్లో. లాభే రాజగ్రహ స్థిష్టే దృష్టశ్చేత్తుధనప్రదః
వైశ్యగ్రహేవైశ్యధనంశూద్రేణసిధ్యతి
ద్విజగ్రహోద్విజధనం బలాధిక్యవశాద్ధనం.

రాజగ్రహము లాభమందున్నయెడల రాజమూలకముగా ధనలాభముకలుగును. లాభమును రాజగ్రహముచూచినను రాజమూలకముగానె ధనలాభము కలుగును. వైశ్యగ్రహమున్న యెడల వైశ్యమూలకముగాను, శూద్రగ్రహమున్నయెడల శూద్రాదులవల్లనున్ను బ్రాహ్మణగ్రహములగు గురుశుక్రులున్న యెడల బ్రాహ్మణులవల్లనున్ను ధనలాభము కలుగును.

శ్లో. లాభస్థానేగురుయుతే ధనేచంద్రసమన్వితే
భాగ్యస్థానంగతేశుక్రే షట్సహస్రాధికోభవేత్.

లాభమందుగురుడుండి ధ. స్థానమందు చంద్రుడుండి భాగ్యస్థానమందు శుక్రుడున్నయెడల 6 వేలకు మించినధనముండును.

శ్లో. లాభభాగ్యేశయోర్భాగ్య లాభయోః పరివర్తనే
లాభేతదుభయోర్యోగే ధనలాభముదీరయేత్.

లాభాధిపతి భాగ్యమందును భాగ్యాధిపతి లాభమందును పరివర్తనముగానున్నను భాగ్యలాభాధిపతులు కలిసి లాభస్థానమందున్నను విశేషధనలాభము కలుగును.

శ్లో. ధనపంచమయోర్విత్తలాభయోః పరివర్తితౌ
పంచమేమత్స్యపంచమేలాభే భాగ్యదోధనలాభకృత్.

ధనాధిపతి పంచమమందును పంచమాధిపతి ధనమందును పరివర్తనముగానున్నను ధనాధిపతి శుభమందును లాభాధిపతి ధనమందును పరివర్తనముగానున్నను పంచమాధిపతి పంచమమందును భాగ్యాధిపతి లాభమందును యున్నయెడల విశేషధనలాభము కలుగును.

శ్లో. పుత్రభాగ్యపయోరస్య తిరసంబంధవర్జితౌ
స్యాత్తాంచేద్ధన లాభేశౌ తద్ధనంసవిశిష్యతే.

ధనలాభాధిపతులకు పంచమభాగ్యాధిపతులలో నొకరి సంబంధమైనను లేనిపక్షమున విశేషధనలాభము కలుగును. అనగా ధనభాగ్యాధిపతుల సంబంధము ప్రబలధనయోగమని తెలియుచున్నది.

శ్లో. శుభగ్రహావ్యకస్యాపి పాపసంబంధవర్జనే
బలినఃప్రబలంభాగ్య మన్యదుర్యోగవర్జనే.

బలవంతులైన శుభగ్రహములకు పాపగ్రహసంబంధమును ఇతరదుర్యోగంబులును లేనియెడలబహు భాగ్యయోగము.

శ్లో. తృతీయషష్ఠలాభేషు క్రూరాస్స్యుర్బలినోయది
ద్వాద్వావేకైకగాభాగ్యం బహ్వస్త్రిత్రికయోగకే.

3, 6, 11 స్థానములయందు బలవంతులైన క్రూరగ్రహములుండినను ఒక్కొక్కస్థానమున రెండుగాని మూడుగాని గ్రహములు చేరినను విశేషధనలాభము కలుగును.

శ్లో. లాభేలాభపతౌజీవే శుక్రేచంద్రసమన్వితే
ధనధాన్యాధిపశ్రీమాన్ రత్నాద్యాభరణైర్యుతః.

లాభమందు లాభాధిపతి యగు గురుడున్నను లేక శుక్ర చంద్రులు లాభమం దున్నను ధనధాన్యాభివృద్ధియు రత్నాద్యాభరణములు గలవాడును అగును.

శ్లో. లాభేపాపగ్రహ స్తిష్ఠేదన్యాయార్జితలాభవాన్
న్యాయార్జితధనస్సౌమ్యే లాభస్థే సౌమ్యవీక్షితే.

లాభస్థానమందు పాపగ్రహ మున్నయెడల అన్యాయార్జితముగా ధనార్జనచేయువాడు అగును. లాభస్థానమందు శుభగ్రహముండి శుభగ్రహముచే చూడబడిన యెడల న్యాయముగా ధనార్జన చేయువాడు అగును.

శ్లో. లాభేశేధనరాశిస్థే ధనేశేకేంద్రసంయుతే
గురుణాసంయుతేలాభే బహులాభముదీరయేత్.

లాభాధిపతి ధనమందున్ను ధనాధిపతి కేంద్రమందున్ను లాభమందు గురుడున్ను వున్నయెడల విశేషధనము కలుగును.

శ్లో. లాభేశేభాగ్యరాశిస్థే తదీశేకేంద్రసంయుతే
సహస్రపోషకోనిత్యం ధనవానధిక ప్రభుః.

లాభాధిపతి భాగ్యమందుండి భాగ్యాధిపతి కేంద్రమం దున్న యెడల ప్రతిదినము వెయ్యిమందిని పోషించును. విశేష ధనవంతుడున్ను ప్రభువున్ను అగును.

శ్లో. భాగ్యస్థానగతే శుక్రే బహువిత్తాధికోభవేత్
లాభే శే లాభగే సౌమ్యే చంద్రే న శుభఖచరే
నానావిధానాం భోగ్యానాం లాభమాప్నోతిమానవః.

భాగ్యస్థానమందు శుక్రుడున్న యెడల విశేష ధనవంతుడు అగును.

భాగ్యమందు శుభగ్రహమున్నను చంద్రుడు శుభ గ్రహములతో కలిసినను సమస్తభోగములు గలిగి మిక్కిలి ధనవంతుడు అగును.

శ్లో. కేంద్రత్రికోణగే లాభనాథే శుభసమన్వితే
శుభగ్రహేణసంద్రుష్టే జాతస్తుబహులాభవాన్.

లాభాధిపతి కేంద్రకోణములయందుండి శుభగ్రహము లతో కలసియున్నను శుభగ్రహములచే చూడబడినను ధన లాభము విశేషముగా నుండును.

శ్లో. సౌమ్యధ్వజాభ్యా మథలాభగాభ్యాం
హిరణ్యమిందోశ్చ శితాచ్ఛమౌక్తికం
మందేనసర్పేణతథాయుధంచలభేర్థలాభ స్థితఖేటవృత్త్యా.

ఏకాదశమందు బుధకేతువులుండిరేని బంగారము శుక్ర

చంద్రులవలన మాణిక్యములు శనిరాహువులవలన ఆయుధములు ఇట్లు లాభమందు గ్రహావృత్తివలన జాతకునికి లాభము నిర్ణయింపవలెను.

శ్లో. లాభాధిపేస్వోచ్చసుహృత్త్రికోణగృహాస్థితే సౌమ్యనిరీక్షితే
చ ధర్మేశకర్మేశ్వరసంయుతేపిజాతస్యవిత్తాప్తిరనంతరూపా.

లాభాధిపతి ఉచ్ఛక్షేత్రమిత్రక్షేత్రమూల త్రికోణము లలో ధర్మకర్మాధిపతులతో చూడబడిన జాతకునికి అర్థ లాభము అనంతమైయుండును.

శ్లో. సూర్యేలాభగతే ధనంపితృకృతం చంద్రేతు మాతుర్ధనం
భౌమేభ్రాతృధనం బుధేనిగదితం మాతామహాద్ధనం
జీవేపుత్రధనం పితేతుసుదతీసూలాద్ధనంభాస్కరా
భృత్యాదేర్ధనమామనంతిఖచర స్వోక్తైస్సువీర్యాదిభిః.

ఏకాదశమందు రవియుండినయెడల పితృధనము చంద్రు డుంటె మాతృధనము కుజుడుంటె భ్రాతృధనము బుధుడుంటె మాతామహావర్గధనము గురుడుంటె పుత్రధనము శుక్రుడుంటె భార్యావర్గరీత్యాధనము శనియుండిన భృత్యువర్గమూలకధనము కలుగును.

శ్లో. విత్తేశేత్వరిభావస్థే లాభేశేనిధనంగతే
విత్తలాభౌపాపయుతే దృష్టేనిర్ధనయోగవాన్

ద్వితీయాధిపతి షష్ఠమమందును లాభాధిపతి అష్టమ మందును లేక ద్వితీయలాభములలో పాపులున్నను చూచి నను జాతకుడు దరిద్రుడగును.

శ్లో. విత్తలాభాదిపౌయుక్తౌ పాపగ్రహసంయుతౌ
జన్మప్రభృతిదారిద్ర్యం భిక్షాన్నం ప్రాప్యతేనరః.

ద్వితీయలాభాధిపతులు పాపగ్రహములతో కలిసిన యెడల పుట్టినది మొదలు ఆజీవాంతము దరిద్రతనను భవించును. పాపగ్రహముమధ్యయందున్నను బలహీనులైనను దరిద్రతచే భిక్షాచరణము చేయువాడు అగును.

శ్లో. షష్ఠాష్టమవ్యయస్థేషు ధనలాభాధిపౌయది
లాభేకుజేధనేరాహుః రాజమూలాద్ధనక్షయః.

ద్వితీయలాభాధిపతులు 6, 8, 12 స్థానములయందుండి లాభమున కుజుడున్ను ద్వితీయమున రాహువున్ను వున్న యెడల రాజమూలకముగా ధనలాభము కలుగును.

అథలాభస్థానే రవ్యాది గ్రహస్థితిఫలం

శ్లో. బహుసుతధనలాభశ్చాయ సంస్థేసదినేశేనరపతిగృహేపి
భాగ్యశీలోగుణాఢ్యః పుత్రజనపరియుక్తః కామినీచిత్తచో
రో భవతిసుఖసమృద్ధః సర్వకార్యప్రకృష్టః.

ఏకాదశమందు రవియున్నయెడల రాజసంస్థానమందు నివసించువాడును భాగ్యవంతుడును మంచిగుణములుగలవాడును మిత్రజనులతోసహవాసముచేయువాడును మిక్కిలిఅందమైన వాడును సుఖవంతుడును సమస్తకార్యనిపుణుడును అగును.

మరిన్ని ఏకాదశమమందు రవియుండెనేని క్షత్రియమూలక ధనలాభము కలవాడును పూర్ణాయుర్దాయము గలవాడును మంచిసంపాదకుడును అగును.

శ్లో. సన్మాననానాధనవాహనాప్తి కీర్తిశ్చసద్భోగగుణోపలబ్ధిః
ప్రసన్నతాలాభవిరాజమానే తారాధిరాజేమనుజస్యమానం.

ఏకాదశమందు చంద్రుడున్న యెడల సన్మానము ధనము వాహనము భోగము సుగుణము వినయము మొదలైనవి కలుగును.

మరిన్ని ఏకాదశమందు పూర్ణచంద్రుడున్న యెడల మాతృమూలక ధనలాభమును కృషిమూలక ధనలాభమున్ను ప్రసిద్ధ పురుషుడున్ను న్యాయార్జిత ధనలాభము కలవాడును అగును. క్షీణచంద్రుడున్న యెడల పైవిధముగానే అన్యాయముగా ధనార్జన చేయువాడు అగును.

శ్లో. పరజనహితకారీలాభసంస్థేమహీజేజితపరధనపూగః పండితస్త్యాగశీలః, భవతిచయదితుంగె వీర్యభాగ్యాన్వితో వానరపతిసమవీర్యః పుణ్యవాన్కామభోగః.

ఏకాదశమందు కుజుడున్న యెడల పరోపకారబుద్ధికలవాడును పరులయొక్క ధనమును విశేషముగా సంపాదించువాడును పండితుడు దాతయును అగును.

కుజుడు ఏకాదశమందు ఉచ్ఛయందుగాని భాగ్యాధిపతితో కలిసిగాని వున్న యెడల రాజసముడున్ను పుణ్యవంతుడున్ను మంచిభోగముగలవాడును అగును. మరిన్ని కుజుడు ఏకాదశమందున్న యెడ భ్రాతృధనలాభము గలవాడును భూములవల్ల ధనలాభడిగలవాడును అన్యాయముగా ధనము సంపా

దించువాడును రాజ మూలక ధనలాభము కలవాడును అగును.

శ్లో. లాభస్థితేచంద్రనుతేవణిగ్వాస్యాత్కళాస్వకోవిత్తపరాయణశ్చ
సిల్పైనురకోబహుకర్మకర్తాదీర్ఘాయురారోగ్యధనాన్వితశ్చ.

ఏకాదశమందు బుధుడున్న యెడల వర్తకమువల్లగాని వ్యవసాయమువల్లగాని విశేష ధనమార్జించువాడును శిల్ప విద్యాశక్తి గలవాడును బహుకర్మలు చేయువాడును దీర్ఘాయు రారోగ్య ధనములు గలవాడును అగును.

మరిన్ని బుధుడు ఏకాదశమందున్న యెడల వర్తకము వల్ల విశేషధనము సంపాదించువాడును విద్యావంతుడును న్యాయార్జితపరుడును అగును.

శ్లో. బహువాహనభృత్యశ్చచిరజీవీమహాధనః
ప్రఖ్యాతః పండితోభూయాద్గురౌలాభగతేసతి.

ఏకాదశమందు గురుడుండెనేని విశేషవాహనములు గలవాడును స్నేహితులు గలవాడును చిరకాలము జీవించు వాడును విశేష ధనవంతుడున్ను ఖ్యాతిగలవాడును పండితు డును గొప్పవాడును అగును.

మరిన్ని గురుడు ఏకాదశమందుండెనేని స్వార్జితమువల్ల సంపాదించబడిన భూధనములు గలవాడును పుత్రమూలక ముగా ధనలాభము కలవాడును న్యాయముగా ధనమార్జించు వాడు అగును.

శ్లో. సంగీతనృద్యాదరతాని తాంతం నిత్యంచ చింతాగమనా
నినూనం సత్కర్మ ధర్మాగమ చిత్తవృత్తిర్భృగోస్సుతో
లాభగతేయదిస్యాత్.

ఏకాదశమందు శుక్రుడున్న యెడల సంగీతపాటకుడును నృత్యముచేయువాడును యెల్లపుడు యాత్ర చేయువాడును మంచికర్మలు చేయువాడును ధర్మచింతలవాడును అగును.

మరిన్ని శుక్రుడు ఏకాదశమం దున్న యెడల మంచి ఉద్యోగమువల్లనుంచి ధనలాభముకలవాడును న్యాయముగా ధనసంపాదన చేయువాడును భార్యమూలకముగా ధనలాభము కలవాడును మంచిశరీరము గలవాడును ప్రియభాషియగును.

శ్లో. భానోస్సుతే లాభగృహస్థితేతు స్వధర్మశీలో గురుభక్తి
యుక్తః కర్మానుక్త స్సతతంసుఖీచమృష్టాన్న భుక్కామిత
కామవాంశ్చ.

ఏకాదశమందు శనియున్న యెడల ధర్మశీలుడును గురు భక్తిగలవాడును కర్మిష్ఠియును సౌఖ్యముగలవాడును భోగియును కాముకుడును అగును.

మరిన్ని ఏకాదశమందు శనియున్న యెడల పూర్ణాయుర్దాయము కలవాడును సేవకావృత్తివలన జీవించువాడును అన్యాయార్జితవిత్తము కలవాడును అగును.

శ్లో. ఆయస్థితే చంద్రరిపౌమనుష్యోదాతా భవేన్నీలవపుస్సు
మూర్తి లావణ్యయుక్తః పరదేవాసీశస్త్రస్యధర్తాచప
లాయతాక్షః.

ఏకాదశమందు రాహువున్నయెడల దాతయును నీల వర్ణముగలవాడును అందమైనవాడును పరదేశవాసియును శస్త్రముఁను ధరించువాడును చంచలమైన నేత్రములుగలవాడును అగును. మరిన్ని ఏకాదశమందు రాహువున్నయెడల అన్యాయముగా ధనము సంపాదించువాడును ధైర్యసాహసములుగలవాడును నీచవ్యాపారమువల్ల ధనముసంపాదించువాడును అగును.

శ్లో. సుభాషీసువిద్యాధికో దర్శనీయః
సుభోగస్సుతేజాస్సువస్త్రోపియస్య
గుదేపీడ్యతే సంతతేర్దుర్భగత్వం
శిఖీలాభసంస్థే కరోతి॥.

ఏకాదశమందు కేతువున్నయెడల మంచి వాక్కుగల వాడును విద్యావంతుడును అందమైనవాడును భోగియును తేజశ్శాలియును మంచివస్త్రములుగలవాడును ఆసనరోగము గలవాడును బలములేని సంతానముగలవాడును అగును.

మరిన్ని కేతువు ఏకాదశమందుండెనేని భిక్షాటనము వల్ల జీవనము చేయువాడును అన్యాయముగా ధనముసంపాదించువాడును ధనార్జనము చేయుటయందు నిపుణుడును కృశించిన శరీరముగలవాడును అగును.

అథవ్యయభావః

శ్లో. వ్యయేపాపమాయుక్తె తదీశేపాపఖేచరే
పాపగ్రహేణసంధృష్టే పాపమూలాద్ధనవ్యయః.

వ్యయస్థానమందు పాపగ్రహముండి వ్యయాధిపతి పాపగ్రహముతో కూడినను పాపగ్రహములచే చూడబడిన యెడల దుర్వ్యయము చేయువాడు అగును.

శ్లో. మందమాంద్యాగుసంయు క్తే వ్యయేవాతద్గ్రహాధిపే
క్రూరాంశకసమాయుక్తే పాపమూలాద్ధనవ్యయః.

వ్యయమందు శని మాంది గుళికులున్నను వ్యయాధిపతి పాపాంశలయందున్నను పాపమూలకముగా ధనవ్యయమగును.

శ్లో. వ్యయాధిపసమాయుక్తేనవభాగవతౌశుభే
శుభాంశేశుభమధ్యస్థే ధర్మమూలాద్ధనవ్యయః

వ్యయాధిపతితో కూడుకొన్న నవాంశాధిపతి శుభుడై శుభగ్రహములతో కూడినను శుభాంశలయందున్నను ధర్మమూలకముగా ధనవ్యయమగును.

శ్లో. గురుశుక్రౌవ్యయేవాపి బుధచంద్రాశుభేక్షితౌ
పారావతాదిభాగస్థౌ ధర్మమూలాద్ధనవ్యయః.

గురుశుక్రులు వ్యయమందున్నను బుధచంద్రులు శుభగ్రహములచే చూడబడినను పారావతాంశలయందున్నను ధర్మమూలకముగా ధనవ్యయము అగును.

శ్లో. పాపేనకర్మనాథేనవ్యయేశే దృష్టిసంయుతే
శత్రునీచారిభాగస్థే పాపమూలాద్ధనవ్యయః.

పాపుడగు కర్మస్థానాధిపతిచేతను వ్యయాధిపతిచూడ

బడుచున్నవాడగుచు శత్రుస్థానమున యుండున్న యెడల పాపమూలకముగా ధనవ్యయము అగును.

శ్లో. శుభేనకర్మనాథేనదృష్టేయుక్తే వ్యయేశ్వరే
స్వోచ్చమిత్రస్వవర్గస్థే ధర్మమూలాద్ధనవ్యయః॥

శుభుడగు కర్మస్థానాధిపతిచేతను వ్యయాధిపతికూడినను చూడబడినను ఉచ్చయందుగాని మిత్రక్షేత్రమందుగాని స్వవర్గయందుగాని ఉన్నయెడల ధర్మమూలకముగా ధనవ్యయము కలుగును.

శ్లో. వ్యయేశేబలహీనేవా శత్రునాథయుతేక్షితే
గుళికాదిసమాయుక్తే శత్రుమూలాద్ధనవ్యయః.

వ్యయాధిపతి బలహీనముగానున్నను శత్రుస్థానాధిపతితో కలిసినను చూడబడినను గుళికునితో కూడినను శత్రుమూలకముగా ధనవ్యయము అగును.

శ్లో. వ్యయేశోదారనాథేన బలహీనేనతేనతు
దృష్టేయుతేవాక్రూరాంశేస్త్రీహేతోర్ధనవాశనం.

వ్యయాధిపతి బలహీనుడగు కళత్రస్థానాధిపతితోకలిసినను చూడబడినను క్రూరాంశలయందున్నను స్త్రీమూలకముగా ధనవ్యయము అగును.

శ్లో. తాదృశేవ్యయనాథేస్మిన్ దృష్టేయుక్తథవాభ వేత్
తథావిధేనభ్రామేన భ్రాతృమూలాద్ధనవ్యయః.

బలహీనుడగు కుజుడు వ్యయాధిపతితో కలసినను

చూడబడినను భ్రాతృమూలకముగా ధనవ్యయము కలుగును.

శ్లో. పుత్రభావేశ్వరేణాపి బలహీనేన సంయుతే
దృష్టేవ్యయే శేత్క్రూరాంశే పుత్రమూలాద్ధనవ్యయః.

వ్యయాధిపతి బలహీనుడగు పుత్రస్థానాధిపతితో కూడి నను చూడబడినను పాపాంశల యందున్న పుత్రమూలకముగా ధనవ్యయమగును.

శ్లో. పితృస్థానేశ్వరేణాపి కారకేణాపివాయుతే
వ్యయే శేద్దృష్టిసంబంధే పితృమూలాద్ధనవ్యయః.

వ్యయాధిపతి పితృస్థానాధిపతితో గాని పితృకారకుడగు రవితో గాని కలిసి బలహీనముగానున్నను చూడబడుచున్నను పితృమూలకముగా ధనలాభము కలుగును.

శ్లో. ఏవంమాతృపయోగేన యుతేదృష్టేవ్యయాధిపే
క్రూరాన్వితేక్రూరభాగే మాతృమూలాద్ధనవ్యయః.

వ్యయాధిపతి మాతృసంస్థానాధిపతి కూడియైననుచూడ బడుచు నైననుయుండి పాపాంశలయందున్నయెడల మాతృ మూలకముగా ధనవ్యయము అగును.

శ్లో. బలహీనేగేహపశో క్రూరరాశ్యంశకేపివా
నీచాంశేనీచరాశౌవా దేహేవై కల్యమాదిశేత్.

వ్యయాధిపతి బలహీనముగానుండి క్రూరరాసులయం దుగాని క్రూరాంశలయందుగాని వున్నను నీచాంశయందుగాని నీచరాసులయందుగాని వున్నను, అంగవైకల్యము కలుగును.

శ్లో. క్రూరేశ్వరే శత్రుయుతేక్షితే వా ద్వాదశాగే క్రూరయుతే చ దృష్టే
అపవ్యయః క్రూరగుణః మనుష్యో దారిద్ర్యమాప్నోతి
జనైర్విరోధం.

వ్యయాధిపతి క్రూరగ్రహమైనను ద్వాదశమందు పాప గ్రహముండినను ద్వాదశాధిపతి నీచశత్రుక్షేత్రములయందు క్రూరశత్రుగ్రహయుక్తుడైనను జాతకుడు దుర్వ్యయముగల వాడై క్రూరగుణములతో జనద్వేషియై దారిద్ర్యదుఃఖము ననుభవించును.

శ్లో. వ్యయాధిపే సౌమ్యఖగే వ్యయస్థే మిత్రోచ్చకేంద్రత్రికోణభేషు
ధర్మేశకర్మేశ్వరయుక్తదృష్టే మిత్రవ్యయీ సర్వగుణాభిరామః

వ్యయాధపతి శుభగ్రహమై మిత్రఉచ్ఛకేంద్రకోణముల యందుండి ధర్మకర్మాధపతి సంబంధము కలిగియుండుటే గాక ద్వాదశమందు శుభగ్రహముండెనేని జాతకుడు మితవ్యయం బొనర్చి సకలగుణంబులచే రమ్యుండగును.

శ్లో. యద్భావేశస్థితో రిష్ఫే యజ్జాతిస్త్రీపుమానపి
తచ్ఛీలానుగుణం వాచ్యం జాతస్య ధననాశనం.

ద్వాదశమున ఏభావాధపతియుండునో లేక ద్వాదశాధి పతిగాని, ద్వాదశస్థితుడుగాని తద్భావాధిపతి యుక్తుడుగాని వారిలో బలాధికగ్రహము యే భావమున కధిపతియో యేకారకుడో స్త్రీపుంస్త్వాదిశీలము వానికెట్టిదో తన్మూలక ముగా జాతకునకు ధనవ్యయమునూహింపందగు.

శ్లో. వ్యయేశుభేబలోపేతే సద్వ్యయంకురుతేనరః
వ్యయేతుపాపసంయుక్తే దుర్వ్యయంకురుతేనరః.

వ్యయస్థానమందు శుభగ్రహము బలవంతుడై యున్న యెడల ధర్మమూలమున ధనవ్యయము చేయువాడును వ్యయస్థానమందు పాపగ్రహమున్న యెడల దుర్వ్యయము చేయువాడును అగును.

శ్లో. లాభేశాత్తువ్యయేశస్య వీర్యాధిక్యంభవేద్యధా
లాభాదపివ్యయాధిక్యం విపరీతేవిపర్యయః

లాభాధిపతికంటె వ్యయాధిపతి బలముగా నున్నయెడల లాభముకంటె ఖర్చు విశేషముగా నుండును. వ్యయాధిపతి కంటె లాభాధిపతి బలముగా నున్నయెడల ఖర్చుకంటె లాభము విశేషముగా నుండును.

శ్లో. లాభవ్యయేశౌతుల్యౌచేత్ తస్యలాభవ్యయౌసమౌ
వ్యయేఖేటవిహీనేతుతదీశేనఫలంవదేత్.

లాభవ్యయాధిపతులు సమాన బలవంతులైన యెడల లాభవ్యయములు సమానభాగముగా నుండును. వ్యయమందు గ్రహము లేనియెడల వ్యయాధిపతినిబట్టి ఫలమును చెప్పవలెను.

శ్లో. వ్యయేశోలాభగోయస్యసలుబ్ధోభవతిధృవం
రాజ్యేశోవ్యయగోయస్యమానీదంధవ్యయోభవేత్.

వ్యయాధిపతి లాభమందున్నయెడల జాతకుడు లుబ్ధుడు

అగును. దశమాధిపతి వ్యయమునందున్న యెడల మానవంతు డును బడాయికి వ్యయముచేయువాడును అగును.

శ్లో. అష్టమేశో వ్యయస్థేతు బహురోగవ్యయో భవేత్
వ్యయే శేభాగ్యసంస్థేతు సుఖేశే వ్యయరాశిగే
శుభాంశే కర్మేశసందృష్టే కర్మకృద్వ్యయకృన్నరః.

అష్టమాధిపతివ్యయమందున్న యెడల శరీరసంబంధంబగు రోగములకు ధనవ్యయముచేయువాడు అగును. వ్యయాధిపతి భాగ్యమందున్నను చతుర్థాధిపతి వ్యయమందున్నను వ్యయ చతుర్థాధిపతులు దశమాధిపతిచే చూడబడుచుండినను యజ్ఞాది క్రతువులు చేసి ధనవ్యయము చేయును. సుఖవంతుడు అగును.

శ్లో. గురుశుక్రౌ వ్యయేవాపి బుధచంద్రనిరీక్షితౌ
పారావతాదిభాగస్థౌ ధర్మమూలాద్ధనక్షయః.

గురుశుక్రులు వ్యయమందుండి బుధచంద్రులచే చూడ బడినను పారావతాంశలయందున్నను ధర్మమూలకముగా ధన వ్యయము చేయును.

శ్లో. వ్యయేపాపసమాయుక్తే తదీశే పాపఖేచరే
పాపగ్రహేణసందృష్టే పాపమూలాద్ధనక్షయః.

వ్యయస్థానమందు పాపగ్రహములుండి వ్యయాధిపతి పాపుడై పాపగ్రహములతో కూడిన యెడల పాపమూలకముగా ధనవ్యయమగును.

శ్లో. వ్యయస్థానగ తేజీవే శుభగ్రహనిరీక్షితేః
సకేతే తౌతుంగగే నాథేసంసారాన్ముచ్యతేనరః.

వ్యయస్థానమందు గురుఉండి శుభగ్రహముచే చూడబడును. వ్యయస్థానాధిపతి ఉచ్ఛయందుండి కేతువుతో కలిసిన యెడల జాతకుడు సంసారమువల్ల విముక్తుడగును.

శ్లో. వ్యయేశే శుభరాసిస్థే ద్వాదశే శుభసంయుతే
శుభగ్రహేణసందృష్టే స్వదేశాటనమాదిశేత్.

వ్యయాధిపతి శుభరాశియందుండి వ్యయస్థానమందు శుభగ్రహముండి శుభగ్రహము చూచినయెడల స్వదేశాటనము చేయును.

శ్లో. వ్యయేశేపాపసంయుక్తేరిప్ఫేపాపసమన్వితే
పాపగ్రహాలోకితేచ దేశభ్రష్టోభవేన్నరః.

వ్యయాధిపతి పాపగ్రహముతో కలిసిన వ్యయస్థానమందు పాపగ్రహమున్నను పాపగ్రహముచే చూడబడినను జాతకుడు దేశభ్రష్టుడగును

శ్లో. లగ్నాచంద్రాశ్చరిప్ఫస్యతద్గతస్యతదీశితుః
శుభత్వేతుశుభం బ్రూయాత్పాపత్వేత్వశుభంవ్రయం.

లగ్నము లగాయతున్ను చంద్రలగ్నము లగాయతున్ను ద్వాదశస్థానమును పొందినవాడున్ను స్థానాధిపతియున్ను ఆస్థానమును చూచుచున్నవాడున్ను పాపగ్రహములైనయెడల దుర్వ్యయమును శుభగ్రహములైనయెడల శుభవ్యయమును చేయును.

అథవ్యయస్థానేరవ్యాదిగ్రహస్థితిఫలం.

శ్లో. తేజోవిహీనేనయనేభ నేత్రాం
తాతేనసాకంగతచిత్తవృత్తిః
విరుద్ధబుద్ధిర్వ్యయభవనయాతే
కాంతేసలిన్యాః ఫలముక్తమార్తైః.

వ్యయమందు రవి యుండెనేని నేత్రరోగముగలవాడును చంచలమైన మనస్సుగలవాడును తండ్రితో విరోధించువాడును దుష్టబుద్ధి కలవాడును అగును.

మరిన్ని వ్యయస్థానమందు రవియున్నయెడల బాలారిష్టముగలవాడును స్వల్పపితృసౌఖ్యము గలవాడును, పిత్రార్జిత ధనము వ్యయము చేయువాడును అగును.

శ్లో. మిహింభవనసంస్థే క్షీణచంద్రేకృశాంగః
సతతధనవిహీనః క్రోధనోదీనవృత్తిః
అపిచసకలమూర్తౌ సద్గ్రహైర్వీక్షమాణే
భవతిచబహుదాతా డాంబికస్త్యాగశీలః.

క్షీణచంద్రుడు వ్యయమందున్నయెడల కృశించిన శరీరముగలవాడు ధనములేనివాడును క్రోధియును దైన్యవృత్తి గలవాడును అగును. పూర్ణచంద్రుడు వ్యయమందుండి శుభగ్రహముచే చూడబడిన యెడల మిక్కిలి దాతయును డాంబికమువల్ల ధనము వ్యయము చేయువాడును అగును. మరిన్ని క్షీణచంద్రుడు వ్యయమందుండెనేని దుష్టస్వ

భావముగలవాడును అవయవహీనుడును మాతృసౌఖ్యములేని వాడును దుర్వ్యయముచేయువాడును అగును. పూర్ణచంద్రుడు వ్యయమందున్న యెడల మంచిమంచి పుణ్యకార్యములు చేయువాడును కీర్తిగల పురుషుడు అగును.

శ్లో. స్వమిత్రవైరంవయనాతిబాధాం
క్రోధాభిభూతం వికలత్వమంగే
ధనవ్యయం బంధనమల్పతేజో
వ్యయేధరాజో విదధాతినూనం.

వ్యయమందు కుజుడుండెనేని మిత్రులతో విరోధము చేయువాడును నేత్రరోగముగలవాడును క్రోధియును అంగవైకల్యముగలవాడును ధనవ్యయము చేయువాడును బంధనయోగముగలవాడును అల్పతేజస్సుగలవాడును అగును.

మరిన్ని కుజుడు వ్యయమందున్నయెడల దుర్వ్యయము చేయువాడును కళత్రసౌఖ్యము లేనివాడును భూవ్యయము చేయువాడును ఆచారము లేనివాడును అగును.

శ్లో. భవతిరిప్ఫగతేశశినందనే విమలమూర్తిధరోధనవర్జితః
పరకళత్రధనేకుతికీభవేత్సతతమక్షరతత్పరతాంవ్రజేత్.

బుధుడు వ్యయమందున్నయెడల సుందరమైనవాడును ధనములేనివాడును పరకళత్రధనములయొక్క సౌఖ్యము అనుభవించువాడును అక్షరములు గూర్చువాడును అగును.

మరిన్ని బుధుడు వ్యయమందు నున్నయెడల న్యాయముగాను స్వల్పముగాను ఖర్చుచేయువాడును మిసగా లుబ్ధుడును జ్ఞాతిమూలకముగా ధనవ్యయము చేయువాడును నగును.

శ్లో. శైశవేపిబహురోగభాజనశ్చారుమూర్గుణధనవ్యయాన్వితః
డాంబికోభవతిధర్మసుబుద్ధిమాన్ రిష్ఫభావగతి జేతుగీష్పతౌ.

వ్యయమందు గురుడుండెనేని చిన్నతనమునందు రోగముచేత బాధపడు వాడును సుందరగుణముగల వాడును మిక్కిలి ఖర్చుచేయువాడును అనేక ధర్మకార్యములు చేయు వాడును డాంబికుడును నగును.

మరిన్ని గురుడు వ్యయమందున్నయెడల సంతాన విచారముగలవాడును ధనములేనివాడును విద్యావిఘ్నము గల వాడును ఉత్తమలోకము పొందువాడును నగును.

శ్లో. శుక్రకోవ్యయెస్త్రీవశగోధనాని
దత్వాముహుః ఖేదతిదీనవృత్తిః
ధనార్జనేచాప్యధికంచయత్నం
భంగంసమాప్నోతి నరస్సరోగః.

వ్యయమందు శుక్రుడున్న యెడల స్త్రీలకువశీకరుడై స్త్రీలకు ధనవశీకరముచేసి మాటిమాటికి దుఃఖము లనుభ వించువాడును ధైర్యవృత్తి గలవాడును ధనము సంపాదించ వలెనని మిక్కిలి ప్రయత్నముచేసి భంగమును పొందువాడు రోగియును అగును.

శ్లో. దయావిహీనో నిధనోవ్యయార్తః
సదాలసోనీచజనానుయాతః
సరోగభంగోంగితసర్వసౌఖ్యః
వ్యయస్థితే భానుసుతేప్రసూతౌ.

వ్యయమందు శనియున్నయెడల దయలేనివాడును నిర్ధనుడును విశేష ధనవ్యయముచేసి దుఃఖించువాడును మందుడును దుర్మార్గులతో సహవాసము చేయువాడును అంగవైకల్యము గలవాడును సౌఖ్యము లేనివాడును అగును.

మరిన్ని శని వ్యయమందున్నయెడల అల్పాయుర్దాయముగలవాడును అనేక చెడుకార్యములనుచేసి దుర్వ్యయము చేయువాడును అసత్యవాదియును బంధనయోగము గలవాడును దుర్మార్గుడును అగును.

శ్లో. వ్యయస్థితే చంద్రరిపౌమనుష్యో
ధర్మార్థహీనో బహుదుఃఖతప్తః
భిక్షాటనోవాధవిదేశవాసీ
దుఃఖాన్వితః పింగళకేశధారీ.

వ్యయస్థానమందు రాహువున్నయెడల దయాదాక్షిణ్యములులేనివాడును నిర్ధనుడును మిక్కిలి దుఃఖములనుభవించువాడునుభిక్షాటనముచేయువాడును విదేశవాసియునగును.

మరియు రాహువు వ్యయమునందున్న యెడల అన్యాయముగా ధనవ్యయము చేయువాడును నేత్రరోగము గలవాడును నీచవృత్తిగలవాడును నరకమును పొందువాడును నగును.

శ్లో. కర్ణరోగీశిరోరోగీ పరకార్యస్యవిఘ్నకృత్
నిందకోగుణహీనశ్చ మోక్షభాగ్వ్యయగధ్వజః.

కేతువు వ్యయమందున్న యెడల కర్ణరోగముగలవాడును పరకార్యములను విఘ్నముచేయువాడును నిందగలవాడును గుణహీనుడును మోక్షమును పొందువాడును నగును.

మరియు వ్యయమందు గ్రహములున్ననేని ధర్మకార్యములు చేయువాడును ఉత్తమలోకమును పొందువాడును నగును.

ద్వాదశభావఫలస్సమాప్తః

## సూర్యుడు మేషాదిరాసులయందుండగా ఫలము

1. మేషరాశియందు సూర్యుడుండగా బుట్టినవాడు ప్రఖ్యాతుడును నేర్పరియును తిరిగెడువాడును స్వల్పధనము ఈఫలము మేషరాశియందుండు సూర్యుడు తనపరమోచ్చ భాగమునకు పైన 21 భాగములోనున్నప్పుడు గలుగునని తెలియవలెను. పరమోచ్చభాగలయందు రవియుండగా బుట్టిన మనుజుడు బహుధనవంతుడును ఆయుధధరులచే సేవింపబడు వాడును ప్రఖ్యాతుడును నేర్పరియును అగునని తెలియవలెను.

2. వృషభమందు సూర్యుడుండగా బుట్టినవాడువస్త్ర

ములు సుగంధద్రవ్యములు క్రయవిక్రయములుచేసి జీవించు వాడును స్త్రీద్వేషియు గానవాద్యములయందు సమర్థుడును అగును.

3 మిథునరాశియందు సూర్యుడుండగా పుట్టినవాడు వ్యాకరణశాస్త్రజ్ఞుడును ధనికుడును అగును.

4 కర్కాటకరాశియందు సూర్యుడుండగా పుట్టినవాడు తీవ్రమైనవాడును దరిద్రుడును పరులకార్యములను చేయు వాడును త్రోవను నడచుటచే శ్రమగలవాడును దుఃఖములు అనుభవించువాడును అగును.

5 సింహరాశియందు రవియుండగా బుట్టినవాడు అరణ్యా పర్వతగోవాటికలయందు అనురాగము గలవాడును బలవంతు డును మూర్ఖుడును అగును.

6. కన్యారాశియందు సూర్యుడుండగా బుట్టినవాడు అక్షరములు వ్రాయుటయందును చిత్తరువులు వ్రాయుటయం దును కవిత్వము చెప్పుటయందును గణితము చేయుటయందును ఆత్మజ్ఞానము తెలిసికొనుటయందును సమర్థుడగును. మరియు స్త్రీ తుల్యశరీరుడును అగును.

7 తులారాశియందు సూర్యుడుండగా పుట్టినవాడు మద్యపానాసక్తుడును మద్యము విక్రయించువాడును త్రోవ నడచుటయందాసక్తిగలవాడు స్వర్ణకారుడును అనుచితకృత్య ములు చేయువాడును అగును.

8. వృశ్చికరాశియందు సూర్యుడుండగా బుట్టినవాడు ఉగ్రస్వభావుడును యుక్తాయుక్త విచారము చేయక స్థైర్యముచేత సాహసకృత్యములు చేయువాడును విషప్రయోగముచేత సంపాదింపబడిన ధనము గలవాడును శస్త్రవిద్యాపారగుడును శిక్షకుడును నాశకుడును అగును.

9 ధనూరాశియందు సూర్యుడుండగా బుట్టినవాడు సత్పురుషులచేత పూజింపదగినవాడును ధనికుడును కోపవంతుడును వైద్యక్రియా దక్షుండును శిల్పకర్మ తెలిసినవాడును అగును.

10 మకరరాశియందు సూర్యుడుండగా బుట్టినవాడు కులోచితముగా నీచకృత్యములు చేయువాడును మూర్ఖుడును కుత్సితబేరము చేయువాడును స్వల్పధనము గలవాడును లోభవంతుడును పరుల భాగ్యము ననుభవించువాడును అగును.

11 కుంభరాశియందు రవియుండగా బుట్టినవాడు అధమకృత్యములు చేయువాడును పుత్రులచేతను భాగ్యముచేతను విడువబడువాడును అగును.

12 మీనరాశియందు సూర్యుడుండగా బుట్టినవాడు నీటియందు ఉత్పత్తియగు ముత్యములు మొదలగువాని క్రయవిక్రయములుచేసి అందువల్ల లభియించు ఐశ్వర్యము గలవాడును స్త్రీలచేత ఆదరింపబడువాడును అగును.

## చంద్రుడు మేషాదిరాసులయందుండగా ఫలము

1. మేషమునందు చంద్రుడుండగా బుట్టినవాడు వర్తులములైన అంతట నెర్రనైన కన్నులుగలవాడున్ను ఉష్ణపదార్థ భోజియును అధికశాకభక్షకుడును అల్పాహారియును కోపకాలమునందు శీఘ్రముగా సుఖుడయ్యేడువాడును స్త్రీలోలుడును బలహీనములగు మోకాళ్ళుగలవాడున్ను స్త్రీలకుప్రియమైనవాడున్ను పరులను గొల్చుటయందు నేర్పుగువాడున్ను వుచ్చినగోళ్ళుగలవాడున్ను కురుపుల చిహ్నముగల శిరస్సుగలవాడును గర్వము గలవాడును తోడబుట్టినవారిలో నందరికంటె పెద్దవాడున్ను అంచేతియందు శక్తిరేఖగలవాడును మిక్కిలి చపలచిత్తుడున్ను నీటియందు భయపడువాడున్ను మిక్కిలి భయముగలవాడున్ను అగును.

2. వృషభమందు చంద్రుడుండగా బుట్టినవాడువిలాసగమనుడును విస్తీర్ణములైన తోడలును ముఖమునుగలవాడును మూపులుగలవాడును దుఃఖమును సహించువాడును స్త్రీజనకుడును వీపునందునగాని ముఖమునందుగాని ప్రక్కలయందుగాని మచ్చలుగలవాడును కఫాధిక్యముగలవాడును మొదటివారగు బంధుధనపుత్రుల నెడబాసినవాడును సౌభాగ్యముతో కూడుకొనినవాడును ఓర్పుగలవాడును మిక్కిలి యాకలిగలవాడును వనితాజనవల్లభుడున్ను దృఢమగు శరీరముగల

వాడును యౌవనవార్ధక్యములయందు సౌఖ్యముగలవాడును అగును.

3. మిధునరాశియందు చంద్రుడుండగా బుట్టినవాడు స్త్రీలయం దభిలాషగలవాడు కామశాస్త్రమందు నేర్పరియు ఎఱ్ఱని కన్నులుగలవాడును పండితుడును పరులకు రాయభార ము చేయువాడును వక్రములైన వెంట్రుకలుగలవాడును చతుర మైన బుద్ధికలవాడును అపహాస్యప్రియుడును ఇతరుల మనో భావమును యెరుగువాడును నగుమోముగలవాడును సరస మైన అవయవములుగలవాడు ప్రియభాషణుడును బహుభక్ష కుడును గానలోలుడును నాట్యము తెలిసినవాడును ఉన్నత నాసికుడును షండులతో క్రీడించువాడున్ను అగును.

4. కర్కాటకరాసియందు చంద్రుడుండగా బుట్టినవాడు కుటిలమైన శీఘ్రగమనముగలవాడున్ను ఉన్నతమైన జఘన ప్రదేశము గలవాడున్ను మంచి స్నేహితులు గలవాడున్ను జ్యోతిషశాస్త్ర వేత్తయును, అనేకములైన గృహములు గల వాడును, కొన్ని దినములు ధనవంతుడును కొన్ని దినములు ధనము లేనివాడును పొట్టివాడును బలిసిన కంఠము గలవా డును జలమందు ఉద్యానవనములయందును ఆసక్తిగలవా డున్ను అగును.

5. సింహరాశియందు చంద్రుడుండగా బుట్టినవాడు అమర్షణశీలుండును ఉబ్బిన చెక్కిళ్ళుగలవాడును విశాలమైన

ముఖము గలవాడును పచ్చని కన్నులుగలవాడు స్వల్పమైన సంతానము గలవాడును స్త్రీలకు శత్రువైనవాడును మాంస వనపర్వతములయం దిష్టమైనవాడును అకారణముగా కోపించు వాడును మనస్సువలనను ఆకలివలనను దాహమువలనను కడుపునొప్పివలన పంటినొప్పివలనను బాధచేత పీడింపబడిన వాడును, ఈనిగలవాడును పరాక్రమవంతుడును నిశ్చలమైన బుద్ధికలవాడున్ను అహంకారచిత్తుడును తల్లి చెప్పినట్లు విను వాడును.

6. కన్యారాశియందు చంద్రుడుండగా బుట్టినవాడు దేవబ్రాహ్మణసాధువులను పూజించువాడును లజ్జాసంబంధమైనట్టియు సుందరమైనట్టియు చూపులను భుజములును గమనమును గలవాడును ప్రలంబములైన మూపులును భుజములును గలవాడును సుఖవంతుడును మృదుశరీరుడును సత్యభాషియును నృత్యగీతవాద్యపుస్తక లేఖనాది క్రియలందు నిపుణుడును శాస్త్రార్థము తెలిసిన పండితుడును ధారణాసక్తి యుక్తమైన బుద్ధికలవాడును కామక్రీడాలోలుడును పరగృహముల తోడను పరధనములతోడను కూడుకొనినవాడును పరదేశము నందు సంచరించువాడును ప్రియభాషియు కన్యకల గనువాడును స్వల్పమగు పుత్రసంతానముగలవాడును అగును.

7. తులారాశియందు చంద్రుడుండగా బుట్టినవాడు ప్రజ్ఞకలవాడును పరదారాద్యభిలాషలేక పరిశుద్ధుడై యుండు

వాడును స్త్రీవశవర్తియును మిక్కిలి పొడవైనవాడును అత్యున్నతమైన ముక్కుగలవాడును పరిభ్రమణశీలుడును కృశమై చలించు దేహముగలవాడును ధనయుక్తుడును అపరిపూర్ణములగు అవయవములుగలవాడును క్రయవిక్రయములయందుసమర్థుడును మొదటిపేరుగాక తనప్రజ్ఞ సభాసదులయందు గనపరచి రెండవపేరును సంపాదించువాడును రోగయుక్తుడును స్వజనుల కుపకారము చేయువాడును బంధువులచేత తిరస్కరింపబడినవాడును అగును.

8. వృశ్చికరాశియందు చంద్రుడుండగా బుట్టినవాడు విశాలమైన కన్నులుగలవాడును వక్షస్థలమును గలవాడును వర్తులమైన పిక్కలు తొడలు మోకాళ్ళు గలవాడును తల్లిదండ్రులచేతను ఆచార్యునిచేతను విడువబడినవాడు బాల్యమందు వ్యాధిపీడితుడును రాజ్యపూజ్యుండును పింగళాక్షుండును క్రూరస్వభావముగలవాడును పాదములయందు మత్స్యవజ్రపక్షిరేఖలు గలవాడును దాచబడిన దోషములు గలవాడును అగును.

9. ధనూరాశియందు చంద్రుడుండగా బుట్టినవాడు అతిదీర్ఘములైన కంఠము ముఖము శిరస్సుగలవాడును పిత్రార్జితమైన ధనముకలవాడును దాతయును కావ్యముచదివినవాడును, బలవంతుడును మాటలాడుటయందు నేర్పుగలవాడును గొప్పవైన చెవులును క్రిందిపెదవియు ముక్కునుగలవాడును, బహుకార్య సమర్థుడును, లిపిపుస్తకచిత్రలేఖనాదివేత్తయు పొట్టి

మూపులుగలవాడును పుచ్చిగోళ్లుగలవాడును బలిసినభుజములు గలవాడును మిక్కిలి ప్రౌఢిమగలవాడును, ధర్మమార్గమెఱింగిన వాడును బంధుద్వేషియు బలాత్కారమునకు లొంగనివాడును సామోపాయముచేత సాధింపబడతగినవాడును అగును.

10. మకరరాశియందు చంద్రుడుండగా బుట్టినవాడు యెల్లప్పుడును స్వదారా పుత్రాదులను లాలన చేయువాడును ధర్మముచేసెదనని బొంకి ధనమార్జించువాడును కృశించిన తొడలుమొదలు క్రింది అవయవములు గలవాడును, చెప్పిన మాత్రమున గ్రహించువాడును, సౌభాగ్యసంపన్నుడును ఆలస్య వంతుడును, చలికి నోర్వలేనివాడును తిరిగెడు స్వభావము గలవాడును బలాధికుడును కవిత్వము చెప్పువాడును అతిలోభి యును హీనజాతిస్త్రీలయందున్ను వృద్ధస్త్రీలయందున్ను ఆసక్తి గలవాడున్ను సిగ్గులేనివాడున్ను దయలేనివాడున్ను అగును.

11. కుంభరాశియందు చంద్రుడుండగా బుట్టినవాడు ఒంటెమెడవలె పొడవైన వంకరయైన మెడగలవాడును ఉబ్బిన నరములు గలిగినట్టియు కఠినమైనట్టియు మిక్కిలి రోమములతో గూడినట్టియు అత్యున్నత మైనట్టియు శరీరముగలవాడును గొప్పవగు పాదములును, తొడలును, వీపును నితంబస్థానము నోరునుగలవాడును పరదారాధనములయందును పాపకర్మల యందును ఆసక్తిగలవాడును ఒకప్పుడు లేమిడితోను, మరి యొకప్పుడు సంపదతోడను గూడుకొనినవాడును పుష్పముల

యందును గంధాదిలేపనములయందును, స్నేహితులయందును ప్రీతిగలవాడును మార్గమందు క్లేశమును సహించువాడును అగును.

12. మీనరాశియందు చంద్రుడుండగా బుట్టినవాడు జలమునందు బుట్టిన ముత్యములు మొదలైనవస్తువులను క్రయవిక్రయములుచేసి సంపాదించిన ధనముగలవాడును పరద్రవ్యములను అనుభవించువాడును భార్యయందును వస్త్రములయందును అనురాగముగలవాడు కాంతియుక్తమైన దేహముగలవాడును ఉన్నతమైన ముక్కును గొప్ప తలయుగలవాడును శత్రువులను తిరస్కరించువాడును, స్త్రీవశవర్తియును, అందమైన కన్నులుగలవాడును, కాంతివిశేషము ధనము నీనియొక్క అనుభవముగలవాడును, శాస్త్రము తెలిసినవాడును అగును.

ఈ చెప్పిన ఫలములన్నియు జన్మకాలమందు చంద్రుడున్న రాశియు చంద్రస్థితరాశ్యధిపతియు చంద్రుడును బలయుక్తములై యున్నయెడల సంపూర్ణముగా నడచును. వీనిలో రెండుమాత్రమే బలయుక్తముగా నున్నయెడల కొంచెము తక్కువగా నడచును. ఒకటి బలయుక్తముగా నుండెనేని మిక్కిలి బలహీనముగా నడచును. అన్నియు బలహీనములై యుండెనేని రాశి స్వరూపఫలములు అనుభవమునకు రావని తెలియవలయును.

కుజుడు మేషాదిరాసులలో నుండగా ఫలము.

1. మేషరాశియందు కుజుడుండగా బుట్టినవాడు రాజ పూజితుడును, పరిభ్రమణశీలుండును క్రయవిక్రయములు తెలిసినవాడును ధనవంతుడును గాయముతగిలి మచ్చ తేర్పడు శరీరము గలవాడును దొంగయును, అధికమయిన విషయాసక్తి గలవాడును అగును.

2. వృషభరాశియందు కుజుడుండగా బుట్టినవాడు స్త్రీవిధేయుడును, బంధుమిత్రులయందు క్రూరస్వభావుడును పరస్త్రీరతుడును, ఇంద్రజాలికుడును మంచివేషము గలవారిని స్నేహరహితులను జలింపచేయువాడును అగును.

3. మిథునరాశియందు కుజుడుండగా బుట్టినవాడు పరులకు సహింపగూడని తేజస్సుగలవాడును పుత్రవంతుడును మిత్రరహితుడును, ఉపకారమును మరువక ప్రత్యుపకారము చేయువాడును గానమందును యుద్ధమందును సమర్థుడును, కార్పణ్యము గలవాడును, భయరహితుడును, యాచకుడును, అగును.

4. కర్కాటకరాశియందు అంగారకుడుండగా బుట్టినవాడు ధనికుడు, ఓడయొక్క సముద్రమున బోవుటచేత సంపాదింపబడిన ధనముగలవాడును, ప్రజ్ఞగలవాడును అంగహీనుడును, దుర్జనుడును అగును.

5. సింహరాశియందు కుజుడుండగా బుట్టినవాడు దరి

ద్రుడును కష్టమును సహించువాడును అరణ్యమధ్యమందు సంచరించువాడును మిత దారాపుత్రాదులుగలవాడును అగును.

6. కన్యారాశియందు కుజుడుండగా బుట్టినవాడు ఉపకారమును మరువక ప్రత్యుపకారముచేయువాడు పుత్రవంతుడును మిత్రరహితుడును ఇతరులనుచూచి సహింపలేని వాడును గానప్రియుడును కార్పణ్యము గలవాడును అగును.

7. తులారాశియందు కుజుడుండగా బుట్టినవాడు పరస్త్రీసక్తుడును, ఇంద్రజాలికుడును బంధుమిత్రులయందు క్రూరస్వభావుడును స్నేహరహితుడు వేషధారులను భయపరచువాడును అగును.

8. వృశ్చికరాశియందు కుజుడుండగా బుట్టినవాడు సేనాపతియును, పరిభ్రమణశీలుడును రాజపూజితుడును దొంగయును అధికమైన విషయాసక్తి గలవాడును గాయముతగిలి మచ్చలేర్పడు శరీరముగలవాడును అగును.

9. ధనూరాశియందు కుజుడుండగా బుట్టినవాడు అనేకమంది శత్రువులు గలవాడును రాజమంత్రియును ప్రసిద్ధుడును నిర్భయుడును స్వల్పసంతానము గలవాడు అగును.

10. మకరరాశియందు కుజుడుండగా బుట్టినవాడు బహుధనము పుత్రులుగలవాడును పుడమి రేడును అట్లుగాకున్న రాజసమానుడును అగును.

11. కుంభరాశియందు కుజుడుండగా బుట్టినవాడు

ఎల్లప్పుడు దుఃఖపీడితుడును దరిద్రుడును తిరిగెడువాడును బొంకులు పలికెడివాడును క్రూరుడును అగును.

2. మీనరాశియందు కుజుడుండగా బుట్టినవాడు రాజ రాజమంత్రియును నిర్భయుడును ప్రఖ్యాతుడును స్వల్పసంతాన ముగలవాడును అగును.

బుధుడు మేషాదిరాసులయందుండగా ఫలము.

1. మేషరాశి యందు బుధుడుండగా బుట్టినవాడు జూదరియు అప్పుచేసి యెగవేయువాడును కల్లుద్రావువాడును వేదబాహ్యుడై పరలోకమే లేదనువాడును దొంగయును చెడ్డ పెండ్లాము గలవాడును కపటియును బొంకులవాడును దరిద్రు డును అగును.

2. వృషభరాశియందు బుధుడుండగా బుట్టినవాడు ఉపకర్తయు బహుపుత్రులును అనేకభార్యలును గలవాడును ధనార్జనయం దిష్టముగలవాడును వదాన్యదాన శౌండీరుడును మాతృపితాచార్యులయందు భక్తిగలవాడును అగును.

3. మిథునరాశియందు బుధుడుండగా బుట్టినవాడు అసత్యవాదియును వ్యాకరణాదిశాస్త్రములు తెలిసినవాడును గీతకళావిద్యాదులయందు చాతుర్యముగలవాడును ఇంపుగా బలికెడువాడును సుఖాసక్తుడును అగును.

4. బుధుడు కర్కాటకరాశియందుండగా బుట్టినవాడు ఉదకముచేతను పరాక్రమముచేతను సంపాదింపబడిన ధనముగల వాడును స్వజనవిరోధియు నగును.

5. సింహారాశియందు బుధుడుండగా బుట్టినవాడు స్త్రీలకు ఇష్టము గానివాడును ధనసుఖపుత్రవివర్జితుడును తిరిగెడువాడు మూర్ఖుడును వనితాభిలాషియు మిక్కిలి తిరస్కరింపబడువాడును అగును.

6. కన్యారాశియందు బుధుడుండగా బుట్టినవాడు దాతయు పండితుడును అధికములైన విద్యాశౌర్యాదిగుణములు గలవాడును సుఖవంతుడును నేర్పుగలవాడును యుక్తిమంతుడును భయరహితుడును అగును.

7. తులారాశియందును బుధుడుండగా బుట్టినవాడు బహుదారాపుత్రులుగలవాడు ధనార్జనమునందు ఇష్టముగలవాడును తల్లిదండ్రులయందును ఆచార్యునియందును భక్తిగలవాడును లేదనక దానము చేయువాడును ఉపదేశకర్తయు అగును.

8. వృశ్చికరాశియందు బుధుడుండగా బుట్టినవాడు అప్పుచేసి యెగవేయువాడును, జూదమాడువాడును, కల్లుద్రాగెడువాడును, నాస్తికుడును చెడ్డభార్యలుకలవాడును బొంకులాడువాడును దొంగయును దరిద్రుడును అగును.

6. ధనూరాశియందు బుధుడుండగాబుట్టినవాడు రాజపూజితుడును, విద్వాంసుడును, వ్యవహారార్థము నెరిగి చక్కగా బలుకువాడగును.

10. మకరరాశియందు బుధుడుండగా బుట్టినవాడు పరప్రేష్యుడును, దరిద్రుడును శిల్పకర్మలయందు దాసక్తిగలవాడును, అప్పుచేయువాడును వెట్టిపనులు చేయువాడును అగును.

11. కుంభరాశియందు బుధుడుండగా బుట్టినవాడు దరిద్రుడును, అప్పుచేయువాడును వెట్టిపనులు చేయువాడును పరప్రేష్యుడును శిల్పకర్మలయం దాసక్తిగలవాడును అగును.

12. మీనరాశియందు బుధుడుండగా బుట్టినవాడు సేవకులచేత జయింపబడువాడును చర్మపాదుకా నిర్మాణాది నీచకర్మలు చేయువాడును అగును.

గురుడు మేషాది రాసులయందుండగా ఫలము.

1. మేషరాశియందు గురుడుండగా బుట్టినవాడు సేనానాయకుడును, బహు ధనపత్నీపుత్రులు గలవాడును, దానశీలుడును, మంచి భృత్యులు గలవాడును, ఓర్పుగలవాడును కాంతిగలవాడును, కళత్రసౌఖ్యము గలవాడును, ప్రసిద్ధుడును అగును.

2. వృషభరాశియందు గురుడుండగా బుట్టినవాడు స్వస్థదేహుండును, సుఖముగలవాడును ధనపుత్రమిత్రులు గలవాడును, దానశీలుడును సర్వజనప్రియుడును అగును.

3. మిథునరాశియందు గురుడుండగా బుట్టినవాడు

అనేకులయిన పుత్రమిత్రులును పరివారమును గలవాడును మంత్రిత్వమందు నియోగింపబడిన వాడును సుఖవంతుడు అగును.

4 కర్కాటకరాశియందు గురుడుండగా బుట్టినవాడు నవరత్నములు గలవాడును పుత్రులుగలవాడును, భార్యయు ఐశ్వర్యము గలవాడును, మంచిబుద్ధిగలవాడును, సౌఖ్యము గల వాడును అగును.

5 సింహరాశియందు గురుడుండగా బుట్టినవాడు నాపతియగును. ఇదిగాక కర్కాటమందున్న గురునకు నేఫలము చెప్పబడియున్నదో సింహరాశియందున్న గురునకు అదియే కలుగును.

6. కన్యారాశియందు గురుడుండగా బుట్టినవాడు సుఖ వంతుడును మంత్రిత్వమందు నియోగింపబడినవాడును అనేకు లయిన పరివారమును పుత్రమిత్రులు గలవాడును అగును.

7. తులారాశియందు గురుడుండగా బుట్టినవాడు సర్వ జనప్రియుడున్ను, దానశీలుడున్ను ధనపుత్రమిత్రులు గల వాడున్ను సుఖముగలవాడున్ను స్వస్థదేహుడున్ను అగును.

8. వృశ్చికరాశియందు గురుడుండగా బుట్టినవాడు సుప్రసిద్ధుడును కళత్రసౌఖ్యము గలవాడున్ను, కాంతివంతు డును, ఓర్పుగలవాడును మంచి భృత్యులు గలవాడును, బహు ధనపత్నీపుత్రులు గలవాడున్ను అగును.

9. ధనూరాశియందు గురుడుండగా బుట్టినవాడు మండ

లాధిపతి యైనను రాజమంత్రియైనను సేనానాయకు డైనను కేవలము ధనవంతు డయినను అగును.

10. మకరరాశియందు గురు డుండగా బుట్టినవాడు కులానుచితకృత్యములు జేయువాడును స్వల్పధనవంతుడున్ను దుఃఖితుడున్ను అగును.

11. కుంభరాశియందు గురు డుండగా బుట్టినవాడు నవరత్నములను సంపాదించువాడును పుత్రులు గలవాడును, సౌఖ్యము గలవాడును భార్యయు నైశ్వర్యములు గలవాడును, మంచిబుద్ధి గలవాడును అగును.

12. మీనరాశియందు గురుడుండగా బుట్టినవాడు కేవల ధనవంతుడైనను సేనానాయకుడైనను రాజమంత్రి యయినను అగును. బలాబలములను యోచించి ఫలములు చెప్పవలెను.

శుక్రుడు మేషాదిరాసులయం దుండగా ఫలము

1. మేషరాశియందు శుక్రుడుండగా బుట్టినవాడు పరస్త్రీలోలుడును పరస్త్రీల యూరడింపు మాటలచేత నప హరింపబడిన ధనముగలవాడును, కులనిందితుడును అగును.

2. వృషభరాశియందు శుక్రుడుండగా బుట్టినవాడు తన బలముచేతను బుద్ధిచేతను సంపాదింపబడిన ధనముగల వాడును రాజపూజ్యుడును తనవారిలో ముఖ్యుడైనవాడును ప్రసిద్ధుడును నిర్భయుండును అగును.

3. మిథునరాశియందు శుక్రుడుండగా బుట్టినవాడున్ను రాజకార్యములను చేయువాడున్ను ధనవంతుడున్ను శీతవాద్యములు తెలిసినవాడున్ను అగును.

4. కర్కటకరాశియందు శుక్రుడుండగా బుట్టినవాడు ఇద్దరు భార్యలుగలవాడును యాచకుడును భయశీలుడును అధికమైన మదదుఃఖములు గలవాడున్ను అగును.

5. సింహరాశియందు శుక్రుడుండగా బుట్టినవాడు స్త్రీవల్ల వచ్చిన ధనముగలవాడున్ను మంచి స్త్రీ గలవాడును స్వల్పపుత్రులు గలవాడును అగును.

6. కన్యారాశియందు శుక్రుడుండగా బుట్టినవాడు మిక్కిలి నీచకృత్యములు చేయువాడు అగును.

7. తులారాశియందు శుక్రుడుండగా బుట్టినవాడు నిర్భయుండును ప్రసిద్ధుడును తన బంధువులలో ముఖ్యమైనవాడున్ను రాజపూజ్యుడున్ను తనబలముచేతను బుద్ధిచేతను సంపాదించబడిన ధనముగలవాడును అగును.

8. వృశ్చికరాశియందు శుక్రుడుండగా బుట్టినవాడు కులనిందితుడును పరస్త్రీల యూరడింపు మాటలచే నపహరింపబడిన ధనము కలవాడును పరస్త్రీలోలుడు అగును.

9. ధనూరాశియందు శుక్రుడుండగా బుట్టినవాడు సద్గుణములచేత పూజింపబడ తగినవాడున్ను ధనవంతుడున్ను అగును.

10. మకరరాశియందు శుక్రుడుండగా బుట్టినవాడు సర్వజనప్రియుడును స్త్రీవశవర్తియును దుష్టస్త్రీలను రమించువాడును అగును.

11. శుభరాశియందు శుక్రుడుండగా బుట్టినవాడు దుష్టస్త్రీలను రమించువాడును. స్త్రీవశవర్తియును సర్వజనప్రియుడును. అగును.

12 మీనరాశియందు శుక్రుడుండగా బుట్టినవాడు పండితుడును ధనికుడును రాజపూజితుడును సర్వజనవల్లభుడుడును అగును.

## శని ఫలము

1. మేషరాశియందు శనియుండగా బుట్టినవాడు మూర్ఖుడును తిరిగెడువాడును, కపటముగలవాడును మిత్రులులేనివాడును అగును.

2. వృషభరాశియందు శనియుండగా బుట్టినవాడు అగమ్యాగమ్యము సందిష్టముగలవాడును అల్పైశ్వర్యముగలవాడును అనేకభార్యలు గలవాడును అగును.

3 మిధునరాశియందు శనియుండగా బుట్టినవాడు లజ్జలేనివాడును ధనములేనివాడవును పుత్రహీనుడును చిత్తరువులు వ్రాయుటయందు సమర్థుడును రక్షణాధికారియును ప్రధాననాధుడును అగును.

4. కర్కాటకరాశియందు శనియుండగా బుట్టినవాడు

దరిద్రుడును దంతపటుత్వము లేనివాడును తల్లిలేనివాడును పుత్రహీనుడును మూర్ఖుడును అగును.

5. సింహారాశియందు శనియుండగా బుట్టినవాడు మూర్ఖుడును సుఖములేనివాడును పుత్రులు లేనివాడును వెట్టి మూటలు మోయువాడును అగును.

6. కన్యారాశియందు శనియుండగా బుట్టినవాడు చిత్తరువులు వ్రాయుటయందు సమర్థుడును ప్రధాననాథుడును రక్షణాధికారియును, పుత్రహీనుడును లజ్జలేనివాడును ధనము లేనివాడును అగును.

7. తులారాశియందు శనియుండగా బుట్టినవాడు పట్టణస్థులచేతను ప్రజలచేతను సైన్యముచేతను పూజింపబడువాడును ధనవంతుడును అగును.

8. వృశ్చికరాశియందు శనియుండగా బుట్టినవాడు బంధనతాండనంబుల బొందెడువాడున్ను చంచలచిత్తుడును దయలేనివాడున్ను అగును.

9. ధనూరాశియందు శనియుండగా బుట్టినవాడు పరస్త్రీ పరధనములను అనుభవించువాడున్ను రాజగృహమందు నమ్మకమును బొందియుండువాడున్ను మంచిపుత్రులు మంచి పెండ్లాముగలవాడున్ను పట్టణములకు గ్రామములకు సేనలకు ప్రధాననాయకుడున్ను మంచిమరణమును పొందువాడున్ను అగును.

10. మకరరాశియందు శనియుండగా బుట్టినవాడు అంత్యకాలమునందు సౌఖ్యమును పొందువాడున్ను పరసేనా గ్రామములకు నాయకుడున్ను మందదృష్టి గలవాడున్ను మలినుడున్ను స్థిరములైన విత్తవైభవములు గలవాడున్ను ధనము కూడబెట్టక అనుభవించువాడున్ను అగును.

11. కుంభరాశియందు శనియుండగా బుట్టినవాడు ధనమును గూడబెట్టక అనుభవించువాడు స్థిరములైన విత్త వైభవములు గలవాడును మలినుడున్ను మందదృష్టి గలవాడున్ను అగును.

12. మీనరాశియందు శనియుండగా బుట్టినవాడు పట్టణములకు గ్రామములకు ప్రధాననాయకుడున్ను మంచిపుత్రులు మంచిపెండ్లాము గలవాడున్ను రాజగృహమందు నమ్మక మును పొందువాడున్ను ధనవంతుడున్ను మంచిమరణమును బొందువాడున్ను అగును.

## దృష్టి ఫలములు

1. మేషరాశియందున్న చంద్రునిగాని మేషలగ్న మును గాని, అంగారకుడు చూచుచుండగా బుట్టినవాడు పుడమిరేడగును. బుధుడు చూచుచుండగా బుట్టినవాడు పండితుడగును. గురుడు చూచుచుండగా బుట్టినవాడు రాజతుల్యుడగును. శుక్రుడు చూచుచుండగా బుట్టినవాడు గుణవంతుడగును. శని చూచుచుండగా బుట్టినవాడు చోరుడగును. రవి చూచుచుండగా బుట్టినవాడు దరిద్రుడగును.

2. వృషభరాశియందున్న చంద్రునిగాని వృషభలగ్న మునుగాని కుజుడు చూచుచుండగా బుట్టినవాడు దరిద్రుడును బుధుడు చూచుచుండగా బుట్టినవాడు చోరుడగును. గురుడు జూచుచుండగా బుట్టినవాడు సర్వజనపూజ్యుడును రాజశ్రేష్ఠుడును శుక్రుడు చూచుచుండగా బుట్టినవాడు రాజును శని చూచుచుండగా బుట్టినవాడు ధనవంతుడును రవి చూచుచుండగా పుట్టినవాడు పరిచారకుడు అగును.

౩. మిధునరాశియందున్న చంద్రునిగాని మిధునలగ్న మునుగాని కుజుడు జూచుచుండగా బుట్టినవాడు శస్త్రముల క్రయవిక్రయాదులవల్ల జీవనము చేయువాడును బుధుడు చూచుచుండగా బుట్టినవాడు రాజును, గురుడు చూచుచుండగా బుట్టినవాడు పండితుడును శుక్రుడు చూచుచుండగా బుట్టినవాడు భయములేనివాడును శనిచూచుచుండగా బుట్టినవాడు నేతనేయువాడు సూర్యుడు చూచుచుండగా బుట్టినవాడు దరిద్రుడును అగును.

4. కర్కాటరాశియందున్న చంద్రునిగాని కర్కాటలగ్నమునుగాని కుజుడుచూచుచుండగా బుట్టినవాడు యుద్ధము చేయువాడును బుధుడు చూచుచుండగా బుట్టినవాడు కవిత్వము చెప్పువాడును గురుడు చూచుచుండగా బుట్టినవాడు పండితుడును శుక్రుడు చూచుచుండగా బుట్టినవాడు రాజును

శని చూచుచుండగా బుట్టినవాడు ఆయుధముచే జీవించువాడును రవి చూచుచుండగా బుట్టినవాడు నేత్రవ్యాధిపీడితుడును అగును.

5. సింహరాశియందున్న చంద్రునిగాని సింహలగ్నమునుగాని బుధుడు చూచుచుండగా బుట్టినవాడు జ్యోతిషశాస్త్రజ్ఞుడును గురుడు చూచుచుండగా బుట్టినవాడు ధనికుడును శుక్రుడు చూచుచుండగా బుట్టినవాడు రాజసమానుడును శని చూచుచుండగా బుట్టినవాడు మంగలవాడును రవి చూచుచుండగా బుట్టినవాడు రాజును కుజుడు చూచుచుండగా బుట్టినవాడు భూపతియు నగును.

6. కన్యారాశియందున్న చంద్రునిగాని కన్యాలగ్నమునుగాని బుధుడు చూచుచుండగా బుట్టినవాడు పుడమిరేడును గురుడు చూచుచుండగా బుట్టినవాడు సేనాధిపతియు శుక్రుడు చూచుచుండగా బుట్టినవాడు సకలకార్యములయందును దూరదృష్టిగలవాడును పాపగ్రహములగు రవికుజశనులచే చూడబడినయెడల స్త్రీని ఆశ్రయించి జీవించువాడునుఅగును.

7 తులారాశియందున్న చంద్రునిగాని తులా లగ్నమునుగాని బుధుడు చూచుచుండగా బుట్టినవాడు రాజసమానుడును గురుడు చూచుచుండగా బుట్టినవాడు బంగారుపని చేయువాడును శుక్రుడు చూచుచుండగా బుట్టినవాడు వర్తకుడును మిగిలిన రవికుజులచే చూడబడుచుండగా బుట్టినవాడు పరకార్యవిముఖుడును అగును.

8. వృశ్చికరాశియందున్న చంద్రునిగాని వృశ్చికలగ్నమునుగాని బుధుడు చూచుచుండగా బుట్టినవాడు ఆడపిల్లలకు తండ్రి యగును. మరియు యిద్దరు తండ్రులుగలవాడును గురుడు చూచుచుండగా బుట్టినవాడు నమ్రుండును శుక్రుడు చూచుచుండగా బుట్టినవాడు వాచాలకుడు శనిచూచుచుండగా బుట్టినవాడు దరిద్రుడును కుజుడు చూచుచుండగా బుట్టినవాడు రాజును అగును.

9 ధనూరాశియందున్న చంద్రునిగాని ధనుర్లగ్నమునుగాని బుధుడు చూచుచుండగా బుట్టినవాడు స్వజనభర్తయు గురుడు చూచుచుండగా బుట్టినవాడు పుడమిరేడును శుక్రుడు చూచుచుండగా బుట్టినవాడు జనులకు ఆశ్రయభూతుడున్ను శని కుజరవులును చూచుచుండగా బుట్టినవాడు డాంభికుడును పరకార్యవిముఖుడును అగును.

10 మకరరాశియందున్న చంద్రునిగాని మకరలగ్నమునుగాని బుధుడు చూచుచుండగా బుట్టినవాడు రాజాధిరాజును గురుడు చూచుచుండగా బుట్టినవాడు విద్వాంసుడును, శుక్రుడు చూచుచుండగా బుట్టినవాడు విద్వాంసుడును శని చూచుచుండగా బుట్టినవాడు ధనవంతుడును రవి చూచుచుండగా బుట్టినవాడు దరిద్రుడును కుజుడు చూచుచుండగా బుట్టినవాడు పుడమిరేడగును.

11 కుంభరాశియందున్న చంద్రునిగాని కుంభలగ్నమునుగాని బుధుడుచూచుచుండగా బుట్టినవాడు రాజగును.

గురుడు చూచుచుండగా బుట్టినవాడు రాజసముడగును. శుక్రుడు చూచుచుండగా బుట్టినవాడు పరదారరతు డగును. మిగిలిన రవికుజశనులచే చూడబడుచుండగా బుట్టినవాడు పరస్త్రీ సంసక్తుడగును.

12. మీనరాశియం దున్న చంద్రునిగాని మీనలగ్నమునుగాని బుధుడు చూచుచుండగా బుట్టినవాడు హాస్యరసాభిజ్ఞుండును గురుడు చూచుచుండగా బుట్టినవాడు రాజును శుక్రుడు చూచుచుండగా బుట్టినవాడు పండితుడును రవికుజశనులచే చూడబడుచుండగా బుట్టినవాడు పాపకర్ముడును అగును.

అధమహాదశాంతర్దశాఫలానిలిఖ్యంతే

రవిమహాదశాఫలం

శ్లో. బలవతిశుభయోగేభాస్కరే తద్దశాయాం
ధనకనకసమృద్ధిర్ధాన్యపశ్వాదిలాభః
నృపతిజనవశత్వంగౌరవందాధికారః
పితృసుఖమపిచారోగ్యాదికం నేత్రసౌఖ్యం.

లగ్నము లగాయతు కేంద్రకోణములయందుగాని ఉచ్ఛయందుగాని స్వక్షేత్రమందుగాని శుభగ్రహ సంబంధముగాని వీక్షణముగాని గలిగి రవిబలముగా నున్నయెడల ఆరవి మహాదశలో ధనకనకసమృద్ధియున్ను ధాన్యవృద్ధియును రాజసన్మాన

మును రాజకీయోద్యోగమును పితృసౌఖ్యమును శరీరారోగ్య
మును నేత్రసౌఖ్యమును గలుగును.

మరిన్ని రవిశుభక్షేత్రములయందుండి బలముగానున్న
ఆరవి మహాదశలో రాజకీయసంబంధమైన మంచి అధికారము
వలన గొప్పయుద్యోగము సంపాదించును. విశేష ధనమార్జిం
చును. విశేషఖ్యాతి సంపాదించును.

శ్లో. అథతరణిదశాయాంక్రూరభూపాలయుద్ధే
ధనమనలచతుష్పాత్పీడనం నేత్రరోగః
అనశనమపిచోష్ణం పైతృకంచింతనంస్యా
దశుభబలవిహీనే కార్యభంగప్రవాసః.

ఆరవి నీచయందుగాని శత్రుక్షేత్రమందుగాని షష్టాష్టమ
వ్యయస్థానములయందుగాని పాపగ్రహములతో కలిసినగాని
బలహీనముగా నున్నయెడల శత్రువులవల్లనుంచి విశేషధన
వ్యయమున్ను అగ్నివల్లను జంతువులవల్లనున్ను, భయమున్ను
నేత్రరోగమును భోజనసౌకర్యము లేకపోవుటయున్ను జ్వర
బాధయున్ను పితృవిచారమును కలుగును. మరిన్ని రవి దుర్బల
ముగా నున్నయెడల ఉద్యోగభ్రష్టత్వమును శరీరపీడయును
శత్రువృద్ధియును పిత్రార్జితధనవ్యయమును సంతానవిచారమును
కుటుంబసంబంధమైన చిక్కులు మొదలైన చెడుఫలములు
కలుగును.

అథరవిమహాదశాయాంరవ్యంతర్దశాఫలం

శ్లో. సూర్యస్యాంతర్గతేభానౌ శుభత్వేరాజపూజనం

ఆరోగ్యం ధనలాభశ్చగౌరవం పితృసౌఖ్యదం
నేత్రవాహనసౌఖ్యంచ రాజమూలాద్ధనాగమం.

అనగా రవి కేంద్రకోణములయందు బలముగానున్న యెడల రాజపూజ్యతయు శరీరారోగ్యమును ధనలాభమును గౌరవమున్ను పితృసౌఖ్యమున్ను నేత్రసౌఖ్యమును వాహన యోగమున్ను రాజమూలకముగా ధనలాభమున్ను మొదలగు మంచి ఫలములు కలుగును.

శ్లో. సూర్యస్యాంతర్గతేభానౌ నీచేషష్ఠాష్టరిష్ఫగే
రాజశతృభయంమృత్యుః ధనహానిః పితుర్భయం
పిత్తజ్వరశ్శిరోరోగః ప్రవాసఃకుక్షిపీడనం
బంధుహానిశ్చయుద్ధంచ దారిద్ర్యం మానభంజనం.

యీరవి నీచయందుగాని షష్ఠాష్టమ వ్యయస్థానముల యందుగాని బలముగా నున్నయెడల రాజులవల్లనుంచిన్ని శతృవులవల్లనుంచిన్ని భయమున్ను మృత్యుభయమున్ను ధనహాని యును పితృశరీరపీడయును పిత్తజ్వరబాధయును శిరోరోగ మున్ను విదేశవాసమును ఉదరరోగమున్ను బంధుహానియును విరోధమున్ను దరిద్రమును మానహానియు కలుగును.

రవిలోచంద్రాంతర్దశాఫలం

శ్లో. సూర్యస్యాంతర్గతేచంద్రే స్వోచ్చకేంద్రత్రికోణగే
సువస్త్రాభరణంకాంతిం భోజనం సౌఖ్యమేవచ

సర్వేషాం ప్రియదర్శీచ వ్యాపారేణధనాగమః
మాతృసౌఖ్యం విశేషంచ రాజసన్మానవైభవం.

చంద్రుడు పూర్ణచంద్రుడై ఉచ్చయందుగాని కేంద్ర కోణములయందుగాని ఉన్నయెడల ఈచంద్రాంతర్దశలో సువస్త్రాభరణ ప్రాప్తియును తేజస్సును సుఖభోజనమున్ను సర్వజనులకు ప్రియముగా నుండుటయున్ను వ్యాపారమువల్ల ధనాగమమున్ను మాతృసౌఖ్యమున్ను రాజసన్మానమును వైభవము కలుగును.

శ్లో. సూర్యస్యాంతర్గతేచంద్రే నీచె షష్ఠాష్టరిప్పగే
మాతృపీడావిశేషంచవ్యాపారేణధనవ్యయః
ఋణవృద్ధిర్విశేషం చవిదేశగమనంతథా
స్వల్పసంతాననష్టంచశరీరేరోగవర్ధనం.

చంద్రుడు క్షీణచంద్రుడైనను నీచయందున్నను షష్టాష్టవ్యయస్థానములయందున్నను దశానాథుడగు రవికి షష్టాష్టమములయందున్నను ఈచంద్రాంతర్దశలో తల్లికి విశేషముగా నల్తచేయును. వ్యాపారమువల్ల ధనవ్యయము కలుగును. ఋణవృద్ధియున్ను విదేశగమనమున్ను కలుగును. సంతాననష్టమును శరీరనల్తయున్ను కలుగును.

## రవిలో కుజాంతర్దశాఫలం

శ్లో. సూర్యస్యాంతర్గతేభౌమె స్వోచ్చకేంద్ర త్రికోణగే
భూలాభం భ్రాతృసౌఖ్యంచ రాజమూలాద్ధనాగమం.

ధనవాహనసౌఖ్యంచ వ్యవసాయస్యాభివర్ధనం.

కుజుడు ఉచ్ఛయందుగాని కేంద్రత్రికోణములయందు గాని స్వక్షేత్రమిత్రక్షేత్రములయందుగాని బలముగా నున్న యెడల భూలాభమున్ను భ్రాతృసౌఖ్యమున్ను రాజమూలక ముగా ధనలాభమున్ను ధనవాహనసౌఖ్యమున్ను వ్యవసాయాభివృద్ధియున్ను కలుగును.

శ్లో. సూర్యస్యాంతర్గతేభౌమే నీచే షష్టాష్టరిష్ఫగే
మానహానిర్మహద్దుఃఖం భూతావేశంతథైవచ
శస్త్రాగ్ని పీడనంచైవ కృషిమూలాద్ధనవ్యయం
భ్రాతృదుఃఖంమనోరోగం భూనష్టంచవిశేషతః.

కుజుడు నీచయందుగాని షష్టాష్టమవ్యయస్థానములయందుగాని దశానాధునకు షష్టాష్టవ్యయములయందుగాని ఉన్న యెడల మానహానియున్ను విశేషదుఃఖమున్ను గ్రహబాధయున్ను ఆయుధమువల్లగాని అగ్నివల్లగాని మశూచికమువల్లగాని బాధయున్ను వ్యయసాయమువల్లధనలాభమున్నుభ్రాతృదుఃఖమున్ను మనోరోగమున్ను భూనష్టమున్ను కలుగును.

రవిలో రాహ్వంతర్దశాఫలం

శ్లో. రవేరంతర్గతేరాహౌ కేంద్రలాభత్రికోణగే
ధనలాభం విశేషంచ కృషిసౌఖ్యంసుపుష్టిదం
ఉద్యోగాదర్ధలాభంచ రాజసన్మానవైభవం.

రాహువు కేంద్రకోణములయందుగాని లాభమందు

గాని ఉన్నయెడల విశేషధనలాభమున్ను వ్యవసాయమువల్ల సౌఖ్యమున్ను దేహారోగ్యమున్ను ఉద్యోగమువల్ల ధనలాభమున్ను రాజసన్మానమున్ను వైభవమున్ను కలుగును.

శ్లో. రవేరంతర్గతే రాహావష్టావ్యయసంస్థితే । పిత్రారిష్టం కార్యహానిః విషచోరోష్ణజంతుభిః సహావకై రర్థహానిశ్చశరీరే రోగవర్ధనం.

రాహువు షష్ఠాష్టవ్యయములయం దున్నను రవి రాహువు లన్యోన్యషష్టాష్టకమం దున్నను పితృారిష్టమున్ను కార్యహానియును సర్పభీతిన్ని చోరులవల్లనుంచిన్ని శత్రువుల వల్లనుంచిన్ని ధననష్టమున్ను శరీరపీడయున్ను కలుగును.

రవిలో గుర్వంతర్దశా ఫలం

శ్లో. రవేరంతర్గతేజీవే స్వోచ్చకేంద్రత్రికోణగే
కీర్తిశ్చరాజసన్మానం వైభవంధర్మసంగ్రహాః
పుత్రసౌఖ్యంగౌరవంచ ధనలాభోవిశేషతః.

గురుడు ఉచ్చయందుగాని కేంద్రకోణములయందున్నను విశేషకీర్తియున్ను రాజసన్మానమును వైభవమున్ను ధర్మకార్యములు చేయుటయున్ను విశేషకీర్తియున్ను పుత్రలాభమున్ను గౌరవమున్ను ధనలాభమున్ను కలుగును.

శ్లో. రవేరంతర్గతేజీవే షష్టాష్టవ్యయసంస్థితే
ధననష్టంవిశేషంచ ధర్మమూలాద్ధనవ్యయః
పరదేశేనివాసంచ చోరాగ్నినృపపీడనం.

గురుడు షష్టాష్టమ వ్యయస్థానములయం దున్నయెడల విశేష ధననష్టమున్ను ధర్మమూలకముగా ధనవ్యయమున్ను పరదేశవాసమున్ను చోరులవల్లను అగ్నివల్లను రాజులవల్లను అపకారమున్ను కలుగును.

## రవిలో శన్యంతర్దశా ఫలం

శ్లో. రవేరంతర్గతేమందే స్వోచ్చ కేంద్రత్రికోణగే
సుతాప్తిం రాజపూజ్యంచ వేదాంత శ్రవణాదికం
నృపద త్తధనం సౌఖ్యం గంధమాల్యాంబరాదికం.

శని ఉచ్చయందుగాని కేంద్రకోణముల యందుగాని యున్నయెడల పుత్రసంతానమును రాజసన్మానమును వేదాంత శ్రవణమున్ను రాజమూలకముగా ధనలాభమున్ను గంధ మాల్యాదులున్ను కలుగును.

శ్లో. రవేంతర్గతేమందే షష్టాష్టవ్యయగోయది
అర్థనాశ మహద్దుఃఖం ధనధాన్యవినాశనం
స్వజనైః కలహాం యాతిశత్రువృద్ధిర్విశేషతః.

శని షష్టాష్ట వ్యయములయం దున్నయెడల ధననష్ట మున్ను గొప్పదుఃఖమున్ను ధనధాన్యాదినాశనమున్ను బంధు వులతో కలహమున్ను శత్రు వృద్ధియున్ను విశేషముగా కలుగును.

రవిలో బుధాంతర్దశా ఫలం

శ్లో. రవేరంతర్గతేసౌమ్యే స్వోచ్ఛకేంద్రత్రికోణగే
అర్థలాభోయశోధైర్యం వస్త్రాభరణసంపదః
విద్యాశిల్పంచకీర్తించ శరీరేసౌఖ్యమేవచ.

బుధుడు ఉచ్చయందుగాని కేంద్రత్రికోణములయందు గాని ఉన్నయెడల విశేషధనలాభమున్ను కీర్తియున్ను ధైర్యమున్ను వస్త్రాభరణములున్ను విశేషసంపత్తున్ను శిల్పవిద్యా ప్రవీణతయున్ను కీర్తియును, శరీరసౌఖ్యమున్ను కలుగును.

శ్లో. రవేరంతర్గతేసౌమ్యే షష్ఠాష్టవ్యయగాయది
విదేశవాసదుఃఖంచ నానాపరిభవక్రియాం
చోరాగ్నిభూపతిభయం వ్యాపారేణధనవ్యయం.

బుధుడు షష్ఠాష్టవ్యయములయం దున్నయెడల విదేశవాసమువల్ల దుఃఖమున్ను అన్నివిధములచేత పరాభవమున్ను చోరులవలనను అగ్నివలనను రాజులవలనను భయమున్ను వ్యాపారమువల్లనుంచి ధనవ్యయమున్ను కలుగును.

రవిలో కేత్వంతర్దశాఫలం

శ్లో. సూర్యస్యాంతర్గతేకేతౌ కేంద్రలాభత్రికోణగే
కృషిగోభూమిలాభంచ విద్యాబంధుసమాగమం
భోజనాంబరసౌఖ్యంచ స్వబంధుజనపూజ్యతాం

కేతువు కేంద్రకోణములయందుగాని లాభమందుగాని

ఉన్న యెడల వ్యవసాయమువల్ల ధనలాభమున్ను గోలాభ మున్ను విద్యాసౌఖ్యమున్ను బంధుసమాగమమున్ను భోజ నాంబర సౌఖ్యమున్ను తనయొక్క బంధువులవల్ల పూజ్యత్వ మున్ను కలుగును.

శ్లో. సూర్యస్యాంతర్గతే కేతౌ షష్ఠాష్టవ్యయగో యది
పదచ్యుతిర్నృపాద్భీతిశ్చోరారివ్యాధిపీడనం
వంచనంచాపి వైరాగ్యం శత్రుమూలాచ్చబంధనం.

కేతువు షష్ఠాష్టవ్యయములయందున్న యెడల స్థానభ్ర ష్టత్వమున్ను రాజువల్లభీతియున్ను చోరులవల్లనుంచిన్ని శత్రు వులవల్లనుంచిన్ని పీడయున్ను వంచనమున్ను వైరాగ్యమున్ను శత్రువులవల్ల బంధనమున్ను కలుగును.

రవిలోశుక్రాంతర్దశాఫలం

శ్లో. రవేరంతర్గతే శుక్రే స్వోచ్చ కేంద్రత్రికోణగే
రాజ్యలాభో ధనప్రాప్తిశ్ఛత్రచామరవైభవం
వాహనం రాజసన్మానం వ్యాపారేణధనాగమం

శుక్రుడు ఉచ్చయందుగాని కేంద్రకోణములయందు గాని ఉన్న యెడల రాజ్యలాభము ధనలాభము ఛత్రచామ రాది వైభవమున్ను వాహనమున్ను రాజసన్మానమున్ను వ్యాపారమువల్ల ధనలాభమున్ను కలుగును.

శ్లో. రవేరంతర్గతే శుక్రేనీచషష్ఠాష్టగో యది
జాయాపీడా మహాదుఃఖం
ధనధాన్యాది నాశనం

శత్రువృద్ధి ర్వి శేషశ్చ వ్యాపారేణధనవ్యయం.

శుక్రుడు నీచయందుగాని షష్ఠాష్టవ్యయములయందు గాని ఉన్నయెడల భార్యకుశరీరములో నష్టియున్ను మహా దుఃఖమున్ను ధనధాన్యాదినాశనమున్ను శత్రువృద్ధియున్ను వ్యాపారమువల్ల ధననష్టమున్ను కలుగును.

అథచంద్రమహాదశాప్రారంభః

శ్లో. హిమకిరణదశాయాం మంత్రదేవద్విజోర్వీ
ప్రణతజనవిభూతిః స్త్రీధనక్షేత్రవృద్ధిః
కుసుమవసనభూషాగంధ నానాధనాప్తిః
భవతిఫలసమృద్ధిర్భూపతేర్వల్లభత్వం
ఆరోగ్యమర్థలాభంచ సంతానంరత్నసంపదః
మాతృసౌఖ్యం మనస్సౌఖ్యం కృషిసౌఖ్యం సుపుష్టిదం
దారపుత్రాదిసౌఖ్యంచ శుభచంద్రదశాల్లభేత్.

పూర్ణచంద్రుడు ఉచ్చక్షేత్రమిత్రక్షేత్ర కేంద్రకోణ ములయందున్న యెడల మంత్రములవల్లనుంచిన్ని ఐశ్వర్యము గలవాడును స్త్రీధనక్షేత్రవృద్ధి కలవాడును వస్త్రాలంకార ములు గలవాడును పరిమళద్రవ్యములవల్ల ధనము సంపాదించు వాడును రాజానుగ్రహము కలవాడును ఆరోగ్యవంతుడు ధనము సంతానము రత్నములు గలవాడును సుఖవంతుడును వ్యవసాయాభివృద్ధి కలవాడును బలమైనవాడును దారపుత్రాది సౌఖ్యములు గలవాడును అగును.

శ్లో. పాపచంద్రదశాయంతు నీచేషష్ఠాష్టరిష్ఫగే
కృషిభంగోధాన్యహానిః మాతృపీడాచదుఃఖితః
వ్యాపారేధననష్టంచ వాతరోగేణపీడనం
పరదేశేనివాసంచ శత్రువృద్ధిర్విశేషతః.

చంద్రుడు నీచషష్ఠాష్ట వ్యయములయం దున్నను క్షీణ చంద్రుడైనను చంద్రమహాదశలో వ్యవసాయములవల్ల నష్టమున్ను ధాన్యహానియును మాతృపీడవల్ల దుఃఖమున్ను వ్యాపారమువల్ల ధననష్టమున్ను వాతరోగమువల్ల పీడయున్ను పరదేశమందు నివాసమున్ను శత్రువృద్ధియున్ను కలుగును.

చంద్రదశాయాం అంతర్దశాఫలాని
చంద్రునిలో చంద్రాంతర్దశాఫలం

శ్లో. చంద్రస్యాంతరతేచంద్రస్వోచ్చ కేంద్రత్రికోణగే
ఆరోగ్యంధనసంప త్తి ర్భూషణంవాహనంతిథా
మిత్రాణాంవర్ధనంచైవ వ్యాపారేణధనాగమం
దారాపుత్రాదసౌఖ్యంచ వ్యవసాయస్యాభివర్ధం.

చంద్రుడు ఉచ్ఛయందుగాని కేంద్రత్రికోణములయందుగాని ఉన్నయెడల శరీరారోగ్యమును ధనలాభమును వాహనాలంకార ప్రాప్తియును మిత్రవృద్ధియును వ్యాపారములవల్ల ధనలాభమును దారాపుత్రాది సౌఖ్యమును, వ్యయసాయాభివృద్ధియు కలుగును.

శ్లో. చంద్రస్యాంతర్గతేచంద్రె నీచషష్ఠాష్టరిష్ఫగే
దారాపుత్రాదిపీడాచ శరీరేరోగవర్ధనం
ఋణవృద్ధిర్విశేషంచ వ్యాపారేణధనవ్యయం.

చంద్రుడు నీచయందున్ను షష్టాష్టవ్యయములయందున్ను ఉన్నయెడల దారాపుత్రాది పీడయున్ను జాతకునకు శరీర పీడయున్ను ఋణవృద్ధియున్ను వ్యాపారమువల్ల ధననష్టమున్ను కలుగును.

చంద్రునిలో కుజాంతర్దశాఫలం

శ్లో. చంద్రస్యాంతర్గతేభౌమే స్వోచ్చ కేంద్రత్రికోణగే
వ్యవసాయాత్ఫలాధిక్యం భ్రాతౄణాంవర్ధనంభవేత్
భూలాభం పుత్రలాభంచ రాజమూలాద్విశేషతః.

కుజుడు ఉచ్చయందుగాని కేంద్రకోణములయందుగాని ఉన్నయెడల వ్యవసాయమువల్ల విశేషఫలమును భ్రాతృవృద్ధియును పుత్రసౌఖ్యమును రాజమూలకముగా విశేషభూలాభమున్ను కలుగును.

శ్లో. చంద్రస్యాంతర్గతేభౌమే నీచషష్ఠాష్టరిప్ఫగే
జ్వరోన్మాదాతిసారాశ్చభూతావేశోగ్నిజంభయం
ధననష్టంవిశేషంచ రాజమూలాచ్చశత్రుభిః
రక్తస్రావోజంతుపీడాభూవ్యయంకురుతేనరః.

కుజుడు నీచయందుగాని షష్టాష్టవ్యయములయందుగాని ఉన్నయెడల జ్వరమున్ను ఉన్మాదమున్ను అతిసారమున్ను భూతావేశమున్ను అగ్నివల్ల బాధయున్ను రాజమూలకముగానున్ను శత్రుమూలకముగాను ధనవ్యయమున్ను రక్తస్రావమున్ను జంతువులవల్ల పీడయున్ను భూవ్యయమున్ను కలుగును.

## చంద్రునిలో రాహ్వంతర్దశాఫలం.

శ్లో. చంద్రేరంతర్గతేరాహౌ కేంద్రలాభత్రికోణగే
స్వల్పలాభం స్వల్పసౌఖ్యం కృషిసామాన్యవర్ధనం
ఉద్యోగలాభంభంగంచ మిత్రశత్రుసమాగమం.

రాహువు కేంద్రకోణములయందుగాని లాభమందుగాని ఉన్న యెడలలాభవ్యయములున్ను సుఖదుఃఖములున్ను సమానముగానుండును. వ్యవసాయమువల్ల సామాన్యముగా లాభముకలుగును. ఉద్యోగలాభమున్ను తద్విఘ్నమున్ను కలుగును. మిత్రులయొక్కయు శత్రువులయొక్కయు సమాగమము కలుగును.

శ్లో. చంద్రస్యాంతర్గతేరాహౌషష్ఠాష్టవ్యయగాయది
త్వగ్రోగసంప్రాప్తిః విషచోరభయంతథా
మానహానిరపస్మారో వ్రణం చాపిదరిద్రతా
వనవాసఃక్షుధార్తిశ్చ శత్రువృద్ధిర్విశేషతః.

రాహువు షష్ఠాష్టవ్యయములయందుండినయెడల చర్మవ్యాధివిషమువల్లనున్ను చోరులవల్లనుభయమున్ను మానహానియున్ను అపస్మారమున్ను వ్రణబాధయున్ను దరిద్రతయున్ను మాతృనష్టము పితృనష్టమున్ను బంధువిరోధమున్ను వనవాసమును ఆకలిబాధయును శత్రువృద్ధియు కలుగును.

## చంద్రునిలో గుర్వంతర్దశాఫలం.

శ్లో. రాజాశ్రయాద్ధనప్రాప్తిః పుణ్యకర్మపరిశ్రమః
పాపక్షయశ్చకీర్తిశ్చ పుత్రానందశ్చభూషణం
వాహనంవిభవంభాగ్యం విజయోదేహపోషణం
విద్వత్సన్మానంచైవ చంద్రెంతర్గతేగురౌ.

చంద్రునిలో గురుడు శుభుడై యుండెనేని రాజాశ్రయమువల్ల ధనలాభమున్ను పుణ్యకార్యములయందు పరిశ్రమయున్ను పాపక్షయమున్ను విశేషకీర్తియున్ను పుత్రునివల్ల ఆనందమున్ను భూషణలాభమున్ను వాహనలాభమున్ను వైభవమును విశేషభాగ్యమున్ను విజయమున్ను దేహసౌఖ్యమున్ను విద్వత్సన్మానమును కలుగును.

శ్లో. చంద్రస్యాంతర్గతేజీవే నీచషష్టాష్టరిష్ఫగే
ఉద్యోగాచ్చలనంచైవ ధర్మమూలాద్ధనవ్యయం
శరీరవ్యాధిపీడాచధనధాన్యవినాశనం.

గురుడుషష్టాష్టవ్యయములయందుగాని నీచయందుగాని ఉన్నయెడల ఉద్యోగచలనమున్ను ధర్మమూలకముగా ధనవ్యయమున్ను శరీరమందు వ్యాధియున్ను ధనధాన్యాదినాశనమున్ను కలుగును.

## చంద్రునిలో శనిఫలం.

శ్లో. చంద్రస్యాంతర్గతేమందే కేంద్రలాభత్రికోణగే
కృషివాణిజ్యలాభంచదారాపుత్రాభివర్ధనం
రాజమూలాద్ధనాప్తించ ఋణదుఃఖవిమోచనం.

శని కేంద్రకోణములయందుగాని లాభమందుగానిఉన్న యెడల వ్యవసాయమువల్లను వర్తకమువల్లను ధనలాభమున్ను దారాపుత్రుల అభివృద్ధియున్ను రాజమూలకముగా ధనలాభమున్ను ఋణనాశమున్ను అగును.

శ్లో. చంద్రస్యాంతర్గతేమందే నీచేషష్టాష్టరిఫ్ఫగే
స్థానచ్యుతింప్రవాసంచనృపచోరాగ్ని పీడనం
దారార్థసుతబంధూనాం మరణం కర్మనాశనం.

శని షష్టాష్టమవ్యయములయందున్న యెడల స్థానభ్రష్టతయున్ను ప్రవాసమున్ను రాజువల్లనుంచి చోరులవల్లనుంచి భయమున్ను, దారాపుత్రాదినాశనమున్ను ధననాశనమున్ను కలుగును.

## చంద్రునిలో బుధునిఫలం

శ్లో. చంద్రస్యాంతర్గతేసౌమ్యే కేంద్రలాభ త్రికోణగే
జ్ఞానాధిక్యం నృపాత్ప్రీతింకృషిగోభూమివర్ధనం
ఆరోగ్యమతిసౌఖ్యంచ పురాణశ్రవణాదికం.

బుధుడు కేంద్రకోణములయందుగాని లాభమందుగాని ఉన్నయెడల జ్ఞానాభివృద్ధియును రాజప్రీతియున్ను వ్యవసాయ అభివృద్ధియున్ను భూలాభమున్ను ఆరోగ్యమున్ను అత్యంతసౌఖ్యమున్ను పురాణశ్రవణమున్ను కలుగును.

శ్లో. చంద్రస్యాంతర్గతేసౌమ్యేనీచేషష్టాష్టరిప్ఫగే
కృషివాణిజ్య నాశంచబంధునాశమథాపివా
శత్రువృద్ధిర్విశేషంచతన్మూలాచ్చ ధనవ్యయం.

బుధుడు షష్టాష్టవ్యయములయందు గాని నీచయందు గాని ఉన్న యెడల వ్యవసాయమువల్ల వర్తకమువల్ల ధననష్టమున్ను శత్రువృద్ధివల్ల విశేషధనవ్యయమున్ను కలుగును.

చంద్రునిలో కేత్వంతర్దశాఫలం

శ్లో. చంద్రస్యాంతర్గతే కేతౌ కేంద్రలాభత్రికోణగే
దేహారోగ్యకరం సౌఖ్యం బంధుభిశ్చసమాగమః
వాహనం భూమిలాభంచ భోజనాంబరభూషణం.

కేతువు కేంద్రకోణములయందు గాని లాభమందుగాని ఉన్న యెడల దేహారోగ్యమున్ను సౌఖ్యమున్ను బంధుమిత్ర సమాగమమున్ను భోజనసౌఖ్యమున్ను అంబరభూషణాదిలాభమున్ను కలుగును.

శ్లో. చంద్రస్యాంతర్గతే కేతౌ నీచేషష్టాష్టరిప్ఫగే
కళత్రపుత్రహానిశ్చస్వకులోద్భవనాశనం
పరదేశేనివాసంచరాజచోరాదిపీడనం.

కేతువు షష్టాష్టవ్యయములయందున్న యెడల కళత్ర పుత్రభంగమున్ను వంశనాశనమును పరదేశ నివాసమున్ను రాజులవల్లనుంచి చోరులవల్లనుంచి బాధయున్ను కలుగును.

చంద్రునిలో శుక్రఫలం

శ్లో. చంద్రస్యాంతర్గతేశుక్రే కేంద్రలాభత్రికోణగే
ఉత్సాహం కీర్తిసంపన్నం స్త్రీపుత్రధనసంపదః
భాగ్యోత్తరం మనోధైర్యం రాజద్వారాధిపత్యకం

శుక్రుడు కేంద్రకోణములయందుగాని లాభమందుగాని

ఉన్న యెడల ఉత్సాహమున్ను యశోవృద్ధియు స్త్రీపుత్ర ధన సంపత్తున్ను ఉత్తరఖండమందు భాగ్యమున్ను మనోధైర్యమున్ను కలుగును.

శ్లో. చంద్రస్యాంతర్గతేశుక్రేషష్టాష్టవ్యయగాయది
శుభోజనంకువస్త్రంచ శుభకర్మవినాశనం
అనారోగ్యమమర్యాదం ఋణశత్రువివర్ధనం
కుస్త్రీవశంకువార్తాంచ బంధుద్వేషంమతిభ్రమం.

చంద్రునిలో శుక్రుడు షష్టాష్టవ్యయములయం దున్న యెడల సౌఖ్యములేని భోజనమున్ను మలినవస్త్రమున్ను శుభకర్మనాశనమున్ను ఋణవృద్ధియు శత్రువృద్ధియు నీచస్త్రీ సంగమమున్ను దుష్టవార్తయున్ను బంధుద్వేషమున్ను కలుగును.

చంద్రునిలోరవ్యంతర్దశాఫలం

శ్లో. చంద్రస్యాంతర్గతేభానౌ కేంద్రలాభత్రికోణగే
ధైర్యం విత్తసుతాప్తించ సమరేజయమాప్నుయాత్
కరోతివిపులంరాజ్యం కీర్తిమాచంద్రతారకం.

రవి లాభమందుగాని కేంద్రకోణముల యందుగాని ఉన్న యెడల ధైర్యమున్ను విత్తలాభమున్ను పుత్రలాభమున్ను యుద్ధమందు జయమున్ను మంచిఉద్యోగమున్ను విపులమగు కీర్తియున్ను కలుగును.

శ్లో. చంద్రస్యాంతర్గతేభానౌ షష్టాష్టవ్యయరిఫ్ఫగే
స్థానచ్యుతింప్రవాసంచమేహాపిత్రాదిపీడనం
కరోతికర్మనాశంచ నృపచోరాగ్నిపీడనం.

రవి షష్టాష్టవ్యయములయం దున్నయెడల స్థానచలనమున్ను ప్రవాసమున్ను మేహరోగమున్ను కర్మనాశనమున్ను రాజులవల్లనుంచి చోరులవల్లనుంచి భయమున్ను కలుగును.

చంద్రదశాంతర్దశాఫలస్సమాప్తః

కుజమహాదశాఫలం

శ్లో. క్షితితనయదశాయాం లాభగే కేంద్రకోణే
విపులధరణిలాభం రాజమూలాద్ధనంచ
భవతిసహజవృద్ధిశ్చాయురారోగ్యవృద్ధి
ర్భవనపశుసమృద్ధి ర్భూపసన్మాననంచ.

కుజుడు ఉచ్చయందుగాని కేంద్రమందుగాని లాభమందుగాని కోణమందుగాని ఉన్నయెడల విశేషభూలాభమున్ను రాజమూలకముగా ధనలాభమున్ను సోదరవృద్ధి రాజసన్మానము మొదలగునవి కలుగును.

శ్లో. ధరణిసుతదశాయాం నీచషష్టాష్టరిష్ఫే
రిపుభయమతిపీడాదారపుత్రార్థనాశః
జ్వరభయమతిపిత్తం రక్తదోషశ్చమిత్రైః
కలహమపివివాదస్సోదరై రగ్నిభీతిః.

కుజుడు నీచయందున్ను షష్టాష్టమవ్యయస్థానములయందున్ను ఉన్నయెడల శత్రువులవల్ల భయమున్ను బాధయున్ను దారాపుత్రాది విచారమున్ను ధననష్టమున్ను జ్వరభయము

పిత్తదోషము రక్తసారము, మిత్రులతోను సోదరులతోను, విరోధము, అగ్నిభీతియును కలుగును.

### కుజదశలో కుజాంతర్దశ

శ్లో. కుజస్యాంతర్గతే భౌమేసోచ్చలాభత్రికోణగే
భూలాభం ధనలాభంచదారాపుత్రాభివర్ధనం
భ్రాతృసౌఖ్యం మనోత్సాహం కృషిమూలాద్ధనాగమః.

కుజుడు లాభమందుగాని ఉచ్చయందుగాని కోణమందుగాని తృతీయషష్ఠస్థానములయందుగాని వున్నయెడల కుజాంతర్దశలో భూలాభము, ధనలాభము దారాపుత్రాది సౌఖ్యము భ్రాతృసౌఖ్యము మనస్సంతోషము వ్యవసాయము వలన విశేష ధనలాభము కలుగును.

శ్లో. కుజస్యాంతర్గతే భౌమేవ్యయే నీచాష్టమస్థితే
స్త్రీనాశోబంధుకలహోగృహాదాహోధనక్షయః
భ్రాతృహానిశ్చదుర్వృత్తిస్ఫోటకం వ్రణపీడనం
స్థానభ్రష్టంబంధనంచశత్రువృద్ధిర్విశేషతః.

కుజుడు నీచయందుగాని, అష్టమస్థానమందుగాని వ్యయస్థానమందుగాని, ఉన్నయెడల యీకుజాంతర్దశలో కళత్రపీడయున్ను బంధువులతోవిరోధమున్ను గృహనష్టమున్ను, ధనవ్యయమున్ను సోదరహానియు చెడ్డవృత్తియున్ను, మశూచిక వ్రణబాధయున్ను స్థానభ్రష్టత్వము బంధనము విశేషముగా శత్రువృద్ధియు కలుగును.

## కుజదశలో రాహ్వంతరం

శ్లో. కుజస్యాంతర్గతే రాహౌ కేంద్రలాభత్రికోణగే
లాభనష్టసమాయుక్తో మిత్రశత్రుసమాగమం
శరీరే రోగపీడాచ శీఘ్రమేవనివారణం
ఉద్యోగాద్ధనలాభంచ వ్యయం విపులమశ్నుతే.

రాహువు కేంద్రమందుగాని లాభమందుగాని కోణములయందుగాని శుభగ్రహ సంబంధముగలిగి బలముగానున్న యెడల యీరాహ్వంతర్దశలో లాభనష్టములు సమానముగా నుండును. మిత్రులు శత్రులు సమానముగా నుందురు. శరీరమునకు నలతచేసి వెంటనే నివారణయగును. ఉద్యోగమువలన విశేష ధనమార్జించునుగాని సంపాదించినధనమంతయు ఖర్చు అగును.

శ్లో. కుజస్యాంతర్గతే రాహౌ వ్యయేనీచారిసంయుతే
దశానాథాచ్ఛుభేమాచ్ఛషష్ఠాష్టవ్యయసంస్థితే
గోమహిష్యాదరాశశ్చ స్త్రీనాశో గర్భపాతనం
అజ్ఞామపవాదశ్చ తుద్రజంత్వరిచోరభిః.
పతనంస్థలనంచాపి ప్రహారశ్శత్రుద్భయంతథా
భూతావేశో మహారోగో నిగళం బంధనంతథా.

రాహువువ్యయస్థానమందుగాని, నీచయందుగాని, శత్రుక్షేత్రమందు గాని దశానాథుడైన కుజునకు, షష్టాష్టమ వ్యయములయందుగాని, ఉన్న యెడల విషశస్త్రములవల్లను విదేశగమనమువల్లను, మరణమును, గోమహిష్యాది నాశమును గర్భపాతమువల్ల స్త్రీనాశనమును, అజ్ఞానమువల్ల అపవాద

యును, నీచజంతులవల్లనుంచిన్ని శత్రువులవల్లనుంచి చోరుల వల్లనుంచిన్ని భయమున్ను, ఆకలిబాధయున్ను, భూతావేశమున్ను, మేహారోగమువల్ల బాధయున్ను, నిగళబంధనమున్ను మొదలగు చెడుఫలములు కలుగును.

కుజమహాదశాయాంగుర్వంతర్దశాఫలం

శ్లో. కుజస్యాంతర్గతే జీవేస్వోచ్చకేంద్రత్రికోణగే
ధనధాన్యసమృద్ధిశ్చ దాసీదాసవివర్ధనం
పుత్రలాభోన్నదానంచ వాహనోద్యోగవైభవం
రాజసన్మానకీర్తించ ధర్మమూలాద్ధనాగమం.

గురుడు ఉచ్ఛయందుగాని, కేంద్రకోణములయందుగాని ఉన్నయెడల ధనధాన్యాదివృద్ధియును దాసదాసీజనవృద్ధియును పుత్రలాభమును, అన్నదానఫలమును, వాహనసౌఖ్యమును ఉద్యోగాభివృద్ధియును రాజసన్మానమును యశోవృద్ధియున్ను ధర్మమూలముగా ధనసంపాదనయు కలుగును.

శ్లో. కుజస్యాంతర్గతే జీవేనీచేషష్టాష్టరిప్ఫగే
దారాపుత్రాదిపీడాచ ధర్మమూలాద్ధనవ్యయం
పరదేశేనివాసంచ శరీరేరోగవర్ధనం
ఉద్యోగాత్స్వల్పలాభంచ విశేషంచధనవ్యయం.

గురుడు నీచయందు షష్టాష్టమవ్యయస్థానములయందుగాని ఉన్నయెడల దారాపుత్రాదులకు శరీరపీడయున్ను, ధర్మమూలముగా ధనవ్యయమున్ను పరదేశమందు నివాసమున్ను

శరీరపీడయున్ను ఉద్యోగమువల్ల లాభము స్వల్పమును ఖర్చు విశేషమున్ను అగును.

కుజదశలో శన్యంతరం

శ్లో. కుజస్యాంతర్గతే మందేస్వోచ్చేలాభేచకోణగే
ఉద్యోగాద్ధనలాభంచ సేవకావృత్తిజీవనం
అన్యాయార్జితవిత్తంచ పుత్రపౌత్రప్రవర్ధనం
క్షేత్రవాహనసౌఖ్యంచ నీచప్రభుసమాగమం.

కుజదశలో శన్యంతర్దశలో యీశని ఉచ్చయందుగాని, లాభమందుగాని కోణమందుగాని యున్నయెడల ఉద్యోగమువల్ల ధనలాభమున్ను సేవకావృత్తివల్ల జీవనమున్ను అన్యాయముగా ధనసంపాదనయు పుత్రపౌత్రాభివృద్ధియు భూలాభము వాహనసౌఖ్యము నీచప్రభువులతో సమాగమము కలుగును.

శ్లో. కుజస్యాంతర్గతేమందే నీచేషష్టాష్టరిష్ఫగే
రోదనం శత్రుపీడాచ బంధునాశోపశుక్షయః
విశేషరోగపీడాచ దారాపుత్రాదినాశనం
శత్రువృద్ధిర్విశేషంచ ప్రభుమూలాచ్చబంధనం
పరదేశేనివాసంచ స్వకీయోద్యోగనాశనం
ధనహానిర్మానహానిర్మిత్ర బంధువిరోధతః.

కుజదశలో శన్యంతర్దశలో అనగా యీశనిలగ్నము లగ్నాయతు నీచయందుగాని 6, 8, 12 స్థానములందుగాని, దశానాథుడైన కుజునికి షష్టాష్టమవ్యయముల యందుగాని,

వున్నయెడల శస్త్రబాధయును, దుఃఖమున్ను, బంధునష్టము న్ను, పశునాశనము న్ను, విశేషరోగపీడయున్ను, దారాపుత్రా దినాశనమున్ను, విశేషశత్రువృద్ధియున్ను రాజులవల్ల బంధన మున్ను, పరదేశనివాసమున్ను, ఉద్యోగభ్రష్టత్వమున్ను, ధన హానియు, మానహానియు, మిత్రులతోను బంధువులతోను విరోధమున్ను కలుగును.

కుజమహాదశలో బుధాంతర్దశ

శ్లో. కుజస్యాంతర్గతేసౌమ్యే స్వోచ్చకేంద్రత్రికోణగే
ద్రవ్యార్జనేతుకౌశల్యం లిపివిద్యాదిసాహసైః
శిల్పవాణిజ్యకర్మభ్యాం భ్రాతృమిత్రసహాయతా
వివాదేవిజయశ్చైవ స్వవిద్యార్జనజీవనం.

కుజదశలో బుధుడు ఉచ్ఛయందుగాని కేంద్రమందు గాని కోణమందుగాని, బలముగానున్నయెడల లిపివిద్యవల్లను వర్తకమువల్లను, శిల్పవిద్యవల్లను, మిక్కిలి నేర్పుగలవాడై విశేషధనమార్జించును. సోదరులయొక్కయుమిత్రులయొక్కయు సహాయముగలవాడును, వాదములభించునప్పుడు పూర్ణజయ ముసు పొందువాడును, స్వతంత్రవిద్యవల్ల ధనమార్జించువా డునునై విశేషఖ్యాతిసంపాదించును.

శ్లో. కుజస్యాంతర్గతేసౌమ్యే నీచేషష్టాష్టరిష్ఫగే
పిత్తరోగేణపీడాచ వ్యాపారేణధనవ్యయం
శత్రువృద్ధిర్విశేషేణ జ్ఞాతిపీడాచనిశ్చయం
కుటుంబకలహంచైవ బంధుమిత్రవిరోధితా.

బుధులు నీచయందుగాని, లగ్నమునకు లగాయతుగాని దశానాధుడైన కుజునిలగాయతుగాని, షష్ఠాష్టమవ్యయముల యందు ఉన్నయెడల పైత్యరోగబాధయును, వ్యాపారమువల్ల ధననష్టమున్ను శత్రువృద్ధియును, జ్ఞాతులవల్ల బాధయును కుటుంబకలహమున్ను బంధుమిత్రవిరోధమున్ను కలుగును.

కుజదశలో కేతువు

శ్లో. కుజస్యాంతర్గతే కేతౌ కేంద్రలాభత్రికోణగే
ఉద్యోగాద్ధనలాభంచ నీచమూలాద్ధనాగమం
శరీరరోగపీడాచ శీఘ్రమేవనివారణం
కుటుంబవిరహంచైవ పురాణశ్రవణాదికం.

కేతువు కేంద్రమందుగాని లాభమందుగాని కోణముల యందుగాని వున్నయెడల ఉద్యోగమువల్ల ధనలాభమున్ను నీచులవల్ల ధనప్రాప్తియు, రోగమువల్ల బాధయున్ను, శీఘ్రముగా నివారణయున్ను, సంసారమందు విరక్తియున్ను, పురాణశ్రవణము మొదలగు ధర్మకార్యచింతయున్ను కలుగును.

శ్లో. కుజస్యాంతర్గతే కేతౌ రంధ్రే రిష్ఫేచసంస్థితే
దశానాధకుజాచ్చైవ షష్ఠేరంధ్రేచరిష్ఫగే
నీచై ర్విరోధఃకలహో దుర్వృత్తిశ్చధనక్షయః
వాగ్దోషఃపాపవృద్ధిశ్చ ధర్మమూలాద్ధనవ్యయం
ఋణవృద్ధిర్విశేషంచ దారాపుత్రాదిపీడనం
శత్రువృద్ధిర్విశేషంచ ప్రభుమూలాచ్చబంధనం
స్ఫోటకవ్రణబాధైశ్చ మనోదుఃఖం ధనవ్యయం.

కుజదశలో కేతువు లగ్నముగాయతుగాని, కుజుని లగాయతుగాని షష్టాష్టమవ్యయస్థానములయందు దుర్బలముగా నున్న యెడల యీ కేత్వంతర్దశలో నీచులతో విరోధమున్ను దుష్టవ్యాపారమున్ను, ధననష్టమున్ను, వాగ్దోషమువల్ల పాప వృద్ధియున్ను ధర్మమూలకముగా ధనవ్యయమున్ను, ఋణవృద్ధి యున్ను, దారాపుత్రాదిపీడయున్ను, విశేషముగా శత్రువృద్ధి యున్ను ప్రభువువల్ల బంధనయోగమున్ను, మశూచికము వ్రణము, వీనివల్ల బాధయున్ను మనోదుఃఖమున్ను ధనవ్యయ మున్ను కలుగును.

కుజదశలో శుక్రాంతర్దశ

శ్లో. కుజస్యాంతర్గతే శుక్రే స్వోచ్ఛ కేంద్రత్రికోణగే
హేమమక్తికలాభశ్చ సద్యుక్తిర్బుద్ధికౌశలం
స్త్రీభోగోధనలాభశ్చ రాజమూలాద్ధనాగమం
సమానప్రభుసన్మానం దారాపుత్రాభివర్ధనం.

కుజమహాదశలో శుక్రుడు ఉచ్ఛయందుగాని కేంద్ర కోణములయందుగాని ఉన్నయెడల యీ శుక్రాంతర్దశలో బంగారము ముత్యములు దొరకును. మంచియుక్తియు బుద్ధి కుశలతయు కలుగును. స్త్రీసంభోగము ధనలాభము రాజ మూలకముగా ధనలాభము గొప్పప్రభువులయొక్కయు సన్మా నము దారాపుత్రాభివృద్ధియు మొదలగు శుభఫలములు గలుగును.

శ్లో. కుజస్యాంతర్గతేశుక్రే నీచషష్టాష్టరిష్ఫగే
పరదేశేనివాసంచ శరీరేవ్యాధిపీడనం

దారాపుత్రవిరోధంచ కృషిమూలాద్ధనవ్యయం
స్థానభ్రంశంచ దుఃఖంచ నీచవృత్త్యానుజీవనం.

శుక్రుడు నీచయందుకాని 6, 8, 12 స్థానములయందు గాని యున్నయెడల పరదేశనివాసము రోగవృద్ధియు భార్యాపుత్రులతో విరోధము వ్యవసాయమువల్ల ధననష్టము స్థానభ్రష్టత్వము దుఃఖము నీచవృత్తివల్ల జీవనము కలుగును.

కుజమహాదశలో రవ్యంతరం

శ్లో. కుజస్యాంతర్గతే భానౌస్వోచ్ఛ కేంద్రత్రికోణగే
ఉద్యోగాద్వాహనాప్తిశ్చ రాజసన్మానవైభవం
దారాపుత్రాదిసౌఖ్యంచ బంధుమిత్రసమాగమం
గృహక్షేత్రాభివృద్ధిశ్చ పశుధాన్యాభివర్ధనం.

కుజమహాదశలో రవి ఉచ్ఛయందుగాని కేంద్రత్రికోణములయందుగాని ఉన్నయెడల యీరవ్యంతర్దశలో ఉద్యోగలాభము వాహనసౌఖ్యము రాజసన్మానమువల్ల సంతోషము దారాపుత్రాదసౌఖ్యము బంధుమిత్రులతో సమాగమము గృహలాభము భూలాభము పశువృద్ధి ధాన్యవృద్ధి మొదలగునవి కలుగును.

శ్లో. కుజస్యాంతర్గతేభానౌ నీచేషష్టాష్టరిష్ఫగే
దశానాథరవేశ్చైవ షష్టాష్టవ్యయ సంస్థితే
శత్రువృద్ధిర్విశేషంచ మాతృహాని స్తథైవచ
దారాపుత్ర వినాశంచ ఋణరోగవివర్ధనం.

కుజుడు మహాదశలో రవి నీచయందుడున్నను లగ్నము లగాయతుగాని దశానాధుడైన రవిలగాయతుగాని షష్టాష్టమ వ్యయస్థానముల యందున్నను ఈ రవ్యంతర్దశలో విశేషముగా శత్రువృద్ధియు వారివల్ల మానహానియు దారాపుత్రాదిపీడయు ఋణవృద్ధియు రోగవృద్ధియు కలుగును.

కుజదశలో చంద్రాంతరం

శ్లో. కుజస్యాంతర్గతేచంద్రేస్వోచ్ఛే కేంద్రత్రికోణగే
వస్త్రాభరణలాభశ్చ స్త్రీసహాయోధికారితా
జలాగ్నిధనలాభశ్చ పుత్రదారాభివర్ధనం
గంగాస్నానఫలప్రాప్తిః పురాణశ్రవణాదికం.

కుజదశలో చంద్రాంతర్దశలో ఉచ్ఛయందుగాని కేంద్ర కోణములయందుగాని చంద్రుడు పూర్ణచంద్రుడై బలముగానున్న యెడల మంచివస్త్రములును మంచి అలంకారములును స్త్రీసహాయమువల్ల ఉద్యోగమున్ను జలమువల్లను అగ్నివల్లను ధనలాభము పుత్రదారాభివృద్ధియును గంగాస్నానఫలప్రాప్తి యును పురాణశ్రవణము మొదలగు శుభఫలములు కలుగును.

శ్లో. కుజస్యాంతర్గతేచంద్రే నీచేషష్టాష్టరిష్ఫగే
జలగండాద్భయంచాపి మాతారిష్టంతథైవచ
దేశాంతరేనివాసంచ శత్రుమూలాద్ధనవ్యయం
ఋణవృద్ధి ర్విశేషంచవ్యాపారేణ వినాశనం
శరీరేరోగపీడాచ వాతరోగేణబాధ్యతే
బంధుమిత్రవిరోధంచ మనోదుఃఖం విశేషతః.

కుజమహాదశలో చంద్రుడు నీచయందుగాని లగ్నము లగాయతుగాని కుజుని లగాయతుగాని షష్టాష్టమ వ్యయస్థానములయందున్నను యీచంద్రాంతర్దశలోజలగండంవల్ల భయమున్ను మాతృపీడయు పరదేశనివాసము శతృమూలకముగా ధనవ్యయము ఋణవృద్ధియున్ను వ్యాపారమువల్ల నష్టమున్ను శరీరమందు రోగవృద్ధియున్ను వాతరోగమువల్ల బాధయున్ను మొదలగు చెడుఫలములు కలుగును

రాహుమహాదశాఫలం

శ్లో. రాహోర్దశాయాముచ్ఛస్థ కేంద్రకోణస్థితస్యచ
రాజ్యంకరోతిపుత్రాప్తిం ధనధాన్యాభివర్ధనం
రాజమూలాద్ధనాప్తించ విశేషసుఖమశ్నుతే
అధికారాధికైశ్వర్యం పుత్రపౌత్రప్రవర్ధనం
తీర్ధయాత్రాదిలాభంచ పురాణశ్రవణాదికం.

రాహువు ఉచ్ఛయందుగాని కేంద్రకోణములయందుగాని శుభక్షేత్రములయందు బలముగానున్నయెడల యీ రాహు మహాదశలో రాజ్యలాభమున్ను పుత్రలాభమున్ను విశేషసుఖమున్ను అధికారమువల్ల విశేషధనలాభమున్ను పుత్రపౌత్రాభివృద్ధియును ధనధాన్యాభివృద్ధియును రాజమూలకముగా ధనలాభమున్ను తీర్థయాత్రాదలాభమున్ను పురాణశ్రవణము మొదలగు పుణ్యకార్య చింతయు కలుగును.

శ్లో. రాహోర్దశాయాం నీచస్థ రిప్పరంధ్రస్థితస్యచ
విదేశయానం దుఃఖాప్తిం వనవాసాద్భయంధ్రువం

దారాపుత్రాదిపీడాచ నీచవృత్త్యానుజీవనం
కుభోజనంకుదారంచ కుపుత్రాన్ లభతేతథా
ఉద్యోగభంగందేహార్తిం చోరాగ్నినృపపీడనం
దశాదౌదుఃఖమాప్నోతి దశామధ్యేసుఖంయశః
దశాంతేస్థాననాశంచ గురుపిత్రాదినాశనం.

రాహువు నీచయందుగాని వ్యయమందుగాని అష్టమమందుగాని దుర్బలముగా నున్నయెడల ఈ రాహుదశలో దూరదేశప్రయాణమున్ను దుఃఖమున్ను అరణ్యావాసమువల్ల భయమున్ను దారాపుత్రాదిపీడయున్ను నీచవృత్తివల్ల జీవనమున్ను సౌఖ్యములేనిభోజనమును సుఖములేనిభార్యయున్ను దుష్టపుత్రసంతానమున్ను ఉద్యోగభంగమున్ను దేహపీడయున్ను చోరులవల్లను అగ్నివల్లను రాజులవల్లను భాధయున్ను కలుగును. రాహుదశయొక్క ప్రారంభమందు దుఃఖమున్ను దశామధ్యమందు సౌఖ్యమున్ను కీర్తియున్ను దశాంత్యమందు స్థానభ్రష్ఠత్వమున్ను గురుపిత్రాదినాశనమున్ను కలుగును.

రాహుమహాదశలో రాహ్వాంతర్దశాఫలం

శ్లో. రాహోరంతర్గతేరాహౌస్వోచ్ఛలాభత్రికోణగే
ఉద్యోగాద్ధనలాభంచ గృహేక్షేత్రార్థసంపదః.
పశుధాన్యాభివృద్ధించ కృషిమూలాద్ధనాగమం
రాజమాననమర్థాప్తిం బంధూనాంమరణం ధృవం.

రాహువులో రాహ్వంతర్దశలో యీరాహువు ఉచ్ఛ

యందుగాని కోణములయందుగాని లాభమందుగాని 3, 6, స్థానములయందు గాని ఉన్న యెడల ఈ రాహ్వాంతరంలో ఉద్యోగమువల్ల ధనలాభము గృహలాభము భూలాభము ధన వృద్ధి పశుధాన్యాభివృద్ధి వ్యవసాయమువల్ల ధనసంపాదనయు రాజసన్మానమువల్ల ధనలాభము బంధువులయొక్క మరణము మొదలగునవి కలుగును.

శ్లో. రాహోరంతర్గతే రాహౌనీచేవావ్యయరిప్ఫగే
పాపగ్రహయుతేదృష్టే పాపమూలాద్ధనవ్యయం
పితృమాతృవినాశంచ నృపమూలాచ్చబంధనం
దారాపుత్రాదిపీడాచ ఋణశత్రువివర్ధనం.

రాహువు నీచయందుగాని వ్యవసాయస్థానమందుగాని అష్టమమందుగాని వున్నను పాపగ్రహము కలిసినను పాప గ్రహములచేత చూడబడినను యీరాహ్వాంతర్దశలో పితృ మాతృవినాశనమున్ను శత్రుఋణవృద్ధియున్ను రాజుమూలక ముగా బంధనప్రాప్తియును అన్యాయముగా ధనవ్యయమున్ను దారాపుత్రాదిపీడయున్ను మొదలగు చిక్కులు కలుగును.

రాహుదశలో గుర్వాంతర్దశాఫలం

శ్లో. రాహోరంతర్గతేజీవే స్వోచ్చకేంద్రత్రికోణగే
మిత్రస్థానేధనేలాభే శుభ గ్రహయుతేక్షితే
ఉత్తమైస్సహసంవాసః స్త్రీపుత్రసుఖమేవచ
తీర్థస్నానంసాహసంచ స్వర్ణరత్నాదిభూషణం
ఉద్యోగంవాహనంచైన ధనలాభంవిశేషతః.

రాహుమహాదశలో గుర్వంతర్దశలో ఈ గురుడు ఉచ్ఛయందుగాని కేంద్రకోణములయందుగాని, మిత్రస్థానమందు ధనలాభస్థానములయందుగాని వున్నను యీ గురుడు శుభగ్రహములతో కలసినను శుభగ్రహములచేత చూడబడినను, ఉత్తమపురుషులతో సహవాసమున్ను, స్త్రీపుత్రసౌఖ్యమున్ను తీర్థస్నానఫలమున్ను ఔదార్యసాహసములును స్వర్ణరత్నభూషణప్రాప్తియున్ను, ఉద్యోగలాభము, వాహనసౌఖ్యము, విశేషధనలాభము మొదలయినవి కలుగును.

శ్లో. రాహోరంతర్గతేజీవే నీచేషష్టాష్టరిష్ఫగే
కుటుంబేకలహంచైవ బంధుమిత్రవిరోధితా
ఋణవృద్ధిర్విశేషంచ శుభమూలాద్ధనవ్యయం
క్వచిద్దుఃఖం క్వచిత్సౌఖ్యం పుణ్యాపాపఫలప్రదం.

రాహువులోగురుడు నీచయందుగాని, షష్టాష్టమవ్యయస్థానములయందుగాని యున్నయెడల, కుటుంబకలహమున్ను బంధుమిత్రులతో విరోధమున్ను శుభకార్యములవల్లధనవ్యయమున్ను ఋణవృద్ధియున్ను, కొంచెముదుఃఖమును, కొంచెము సౌఖ్యమున్ను పుణ్యాపాపమిశ్రఫలమున్ను కలుగును.

రాహుదశలోశన్యంతర్దశాఫలం

శ్లో. రాహోరంతర్గతేమందేస్వోచ్ఛేలాభత్రికోణగే
షష్టేసహజభాగస్థే శుభదృష్టియుతేక్షితే.
అధికోద్యోగసన్మానం శూద్రమూలాద్ధనాగమం

ఆందోళికాదిసౌఖ్యం చదారాపుత్రవివర్ధనం
దేహారోగ్యం మనోత్సాహం యశోవృద్ధిర్విశేషతః
కృషిగోభూమిపుత్రాదిభ్రాతృమాతృసుఖం భవేత్ !

రాహు మహాదశలో శన్యంతర్దశలో, అనగా యీ శని ఉచ్చయందుగాని లాభమందుగాని కోణములయందుగాని, తృతీయవష్టమములయందుగాని యుండి, శుభగ్రహములతో కలిసినను శుభగ్రహములుచూచినను గొప్ప పుట్యోగమున్ను విశేషగౌరవమున్ను శూద్రమూలకముగా ధనలాభమున్ను ఆందోళికాదివాహనసౌఖ్యమున్ను, దారాపుత్రవృద్ధియున్ను దేహారోగ్యమున్ను, మనస్సంతోషమున్ను, యశోవృద్ధియున్ను వ్యవసాయాభివృద్ధి పశువృద్ధి భూలాభము, సంతానలాభము భ్రాతృమాతృసౌఖ్యము మొదలగునవి కలుగును.

శ్లో. రాహోరంతర్గతేమందేనీచే కేంద్రాష్టరిఫ్ఫగే
రోదనం మానభంగశ్చ వృత్తౌత్పతనజంభయం
దుస్సంగతిర్దుష్టకృత్యం పరయోషిత్పరిగ్రహః
పత్నీత్యాగః కుక్షిరోగో నేత్రరోగో జలాద్భయం.

రాహువులోశని నీచయందుగాని కేంద్రములయందు గాని వ్యయాష్టమములయందుగాని దుర్బలముగానున్న యెడల యీశన్యంతర్దశలో దుఃఖమున్ను మానభంగమున్ను చెట్టుమీా దనుంచిపడుటవలనభయమున్ను, దుస్సాంగత్యము దుష్టకార్యములుచేయుటయు, పరస్త్రీసంభోగము, భార్యావియోగము

కుక్షిరోగము నేత్రరోగము జలగండము మొదలగు చెడుఫల
ములు కలుగును.

రాహుదశలో బుధాంతర్దశాఫలం

శ్లో. రాహోరంతర్గతే సౌమ్యే కేంద్రలాభత్రికోణగే
వివాహాదిసుఖ యానం పుత్రలాభేధనాగమః
కుటుంబబంధుసౌఖ్యంచ వేశ్యాదిషుమహారతిః
అనాచారోతిడంబత్వం వ్యాపారేధన సంభవః
ఋణబాధాద్విముక్తిశ్చ జ్ఞాతిమూలాద్ధనాగమః.

రాహువులో బుధుడు కేంద్రకోణముల యందుగాని
లాభమందుగాని యున్నయెడల యీబుధాంతర్దశలో వివా
హాదిసౌఖ్యమున్ను వాహనసౌఖ్యమున్ను పుత్రలాభము ధన
వృద్ధియు కుటుంబసౌఖ్యము బంధుసౌఖ్యము వేశ్యాసంభోగము
అనాచారము డాంబికము వ్యాపారమువల్ల ధనలాభము ఋణ
విముక్తియు జ్ఞాతులవల్ల ధనలాభము మొదలగు మంచి ఫల
ములు కలుగును.

శ్లో. రాహోరంతర్గతేసౌమ్యే నీచేషష్ఠాష్టరిష్ఫగే
జ్ఞాతివృద్ధిర్విశేషంచ వ్యాపారేణధనవ్యయం
కృషివాణిజ్యనాశంచ బంధునాశనమథాపివా
పదభ్రష్టంమహాద్వేషం బంధుద్వేషంలభేన్నరః.

రాహువులో బుధుడు నీచయందున్నను, షష్టాష్టమ
వ్యయస్థానములయందున్నను, జ్ఞాతివృద్ధియు, వ్యాపారమువల్ల

ధనవ్యయమును, వ్యవసాయమువల్లను, వర్తకమువల్లను నష్టము లున్ను, బంధునాశనము, పదభ్రష్టత్వము, మహాద్వేషము బంధుద్వేషము కలుగును.

రాహువులో కేత్వంతర్దశాఫలం

శ్లో. రాహోరంతర్గతే కేతౌ లాభేకోణేచసంస్థితే
తృతీయేషష్ఠగేవాపి స్వబంధుజనపూర్ణతాం
వాహనం భూమిలాభంచబంధమూల్యాదిలేపనం
కృషిగోభూమిలాభంచ విద్యాబంధుసమాగమం.

రాహువులో కేతువు, లాభమందుగాని కోణముల యందుగాని తృతీయషష్ఠ స్థానములయందుగాని ఉన్నయెడల యీ కేత్వంతర్దశలో బంధుసన్మానమును వాహనసౌఖ్యము, భూలాభము, సుగంధపరిమళ ద్రవ్యప్రాప్తియు, పశువృద్ధియు, వ్యవసాయమువల్లను భూములవల్లను విశేషధనలాభమున్ను విద్యాభివృద్ధియు బంధువులతో స్నేహము మొదలగునవి కలుగును.

శ్లో. రాహోరంతర్గతే కేతౌ రిప్ఫేరంధ్రేచసంస్థితే
ధనేచసప్తమస్థానే పాపగ్రహ యుతేక్షితే
పుత్రమిత్రకళత్రాణాం నాశనం మహదాపదం
రాజ్ఞాచోరేణవాపిత్తం ప్రీయతేబంధునాశనం
విశేషరోగపీడాచశిరోక్షిగుదపీడనం
ఉద్యోగభంగంచలనమకస్మాత్కలహం లభేత్.

రాహువులో కేతువు అష్టమమందుగాని వ్యయస్థాన

మందుగాని ధనసప్తమస్థానములయందుగాని వుండి పాపగ్రహా ములతో కలిసినను పాపగ్రహాములు చూచుచున్నను యీ కేత్వాంతర్దశలో సంతానవిచారము మిత్రనష్టము కళత్రపీడ గొప్ప ఆపత్తును రాజులవల్లగాని దొంగలవల్లగాని ధననాశన మున్ను బంధునష్టమున్ను వ్యాధియున్ను శిరోరోగము నేత్రరోగము మూలవ్యాధియున్ను ఉద్యోగభంగము స్థానచల నము అకస్మాత్తుగా విరోధమున్ను మొదలగు చెడుఫలములు కలుగును.

## రాహువులో శుక్రాంతరం

శ్లో. రాహోరంతర్గతే శుక్రే కేంద్రలాభత్రికోణగే
భూలాభః పుత్రలాభశ్చ గృహకళ్యాణవై భవం
గోమహిష్యాదిభశ్చధనధాన్యాభివర్ధనం
విశేషోద్యోగమాప్నోతితస్మాద్వాహనవై భవం.

రాహువులో శుక్రుడు కేంద్రకోణములయందు గాని లాభమందుగాని బలముగా నున్నయెడల భూలాభము పుత్ర సౌఖ్యము గృహమందు శుభకార్యములు జరుగుటయు పశు వృద్ధియు ధనధాన్యాభివృద్ధియు గొప్పవుద్యోగప్రాప్తియు అందు వల్ల వాహనసౌఖ్యము మొదలగునవి కలుగును.

శ్లో. రాహోరంతర్గతే శుక్రేనీచేషష్ఠాష్టరిష్ఫగే
అనారోగ్యమమర్యాదం నృపచోరాగ్నిపీడనం
ఉద్యోగభంగం క్లేశంచదారాపుత్రవినాశనం
శత్రువృద్ధిర్విశేషంచబుణరోగవివర్ధనం.

రాహువులో శుక్రుడు నీచయందుగాని లగ్నము లగాయతుగాని రాహువు లగాయతుగాని షష్టాష్టమ వ్యయస్థానములయందున్నను యీశుక్రాంతర్దశలో అనారోగ్యమున్ను అమర్యాదయున్ను రాజులవల్ల చోరులవల్లను అగ్నివల్లను బాధయున్ను ఉద్యోగభంగమున్ను దుఃఖమున్ను కళత్రపుత్రచారమున్ను విశేషముగా శతృవృద్ధియు ఋణవృద్ధియు శరీర పీడయు మొదలగు చెడ్డఫలములు గలుగును.

రాహుదశలో రవ్యంతరం

శ్లో. రాహోరంతర్గతే భానౌ కేంద్రలాభత్రికోణగే
దారాపుత్రాదిసౌఖ్యంచ రాజమూలాద్ధనాగమః
కరోతివిపులం రాజ్యంకీర్తిమాచంద్రతారకం
విద్యాలాభం నృపాత్ప్రీతిం వస్త్రవాహనభూషణం.

రాహువులో రవి కేంద్రకోణములయందుగాని లాభమందుగాని యున్నయెడల యీరవ్యంతర్దశలో దారాపుత్రాది సౌఖ్యమున్ను రాజమూలక ధనలాభమున్ను రాజ్యలాభమున్ను యశోవృద్ధియును విద్యాలాభము రాజానుగ్రహము వస్త్రవాహనాలంకార ప్రాప్తియును కలుగును.

శ్లో. రాహోరంతర్గతే భానౌ నీచేరిప్ఫేచరంధ్రగే
రాహోశ్చైవంచాష్టమేషష్ఠేవావ్యయగేపివా
ఉష్ణజ్వరాతిసంతాపశ్శిరోభ్రమణమేవచ
భయం జనవిరోధశ్చ నేత్రరోగం మహద్భయం.

స్థానచ్యుతిం ప్రవాసంచగురుపిత్రాదినాశనం
శత్రువృద్ధిర్విశేషంచ శత్రుమూలాద్ధనవ్యయం.

రాహుమహాదశలో రవ్యంతర్దశలో యీరవి నీచ యందుగాని లగ్నములగాయతుగాని దశానాథుడైనరాహువు లగాయతుగాని షష్టాష్టమవ్యయస్థానములయందున్నను ఈ రవ్యంతర్దశలో ఉష్ణజ్వరముఃవలన సంతాపమున్ను శిరోభ్రమణమున్ను భయమున్ను జనవిరోధమున్ను నేత్రరోగమున్ను మహాభయమున్ను స్థానభ్రష్టత్వమున్ను పరదేశనివాసమున్ను గురునాశము పితృనాశనమున్ను విశేషశత్రువృద్ధియును వారి వలన ధననష్టమున్ను కలుగును.

రాహుదశలో చంద్రాంతరం

శ్లో. రాహోరంతర్గతేచంద్రే స్వోచ్చకేంద్రత్రికోణగే
జలయానధనాప్తిశ్చ క్షేత్రవాహనసంభవః
కళత్రపుత్రసంపత్తిం రాజ్యశ్రీధనసంపదః
స్వకర్మనిరతంశాంతం దానధర్మపరాయణం.

రాహుమహాదశలో చంద్రాంతర్దశలో యీ చంద్రుడుచ్చయందున్నను కేంద్రత్రికోణములయందున్నను జలము మీాద ప్రయాణమువలన ధనలాభమున్ను క్షేత్రవృద్ధియు వాహనసౌఖ్యము కళత్రసౌఖ్యము సంతానవృద్ధిరాజ్యలాభము ధనవృద్ధి స్వకులోచితకర్మచేయుటయు శాంతము దానధర్మములు చేయుటయు మొదలగు శుభఫలములు గలుగును.

శ్లో. రాహోరంతర్గతేచంద్రే నీచేషష్ఠాష్టరిఃఫగే
రాహోశ్శైత్రవం చాష్టమేవాషష్ఠేవావ్యయగేపివా
కృషినాశంబుణగ్రస్తం వ్యాపారేధనవ్యయం
దారాపుత్రాదిపీడాచ కృషిగోభూమినాశనం.

రాహుదశలో చంద్రాంతర్దశలో యీచంద్రుడు నీచయందుగాని లగ్నములగాయతున్ను రాహువులగాయతున్ను 6, 8, 12 స్థానములయందుగాని పున్నయెడల వ్యవసాయము వల్ల నష్టము ఋణవృద్ధి వర్తకమువల్ల నష్టము దారాపుత్రులకు శరీరపీడయు భూనాశనము పశునష్టము మొదలగు చెడుఫలములు కలుగును.

రాహుదశలో కుజాంతరం

శ్లో. రాహోరంతర్గతేభౌమే స్వోచ్ఛేలాభత్రికోణగే
షష్ఠస్థానేతృతీయేవా శుభగ్రహాయుతేక్షితే
రాజ్యపూజ్యంసుతావాప్తి విద్యావాహనభూషణం
భూలాభంధనలాభంచ రాజానుగ్రహకాంక్షయా
భోజనాంబరసౌఖ్యంచ కృషిమూలాద్ధనాగమః.

రాహుమహాదశలో కుజాంతర్దశలో యీ కుజుడు ఉచ్ఛయందుగాని లాభమందుగాని కోణములయందుగాని తృతీయషష్ఠస్థానములయందుగాని శుభగ్రహములతో కలిసినను చూడబడినను రాజపూజ్యతయు పుత్రసంతానలాభము విద్యాభివృద్ధి వాహనసౌఖ్యము అలంకారప్రాప్తియు భోజన

సౌఖ్యము వస్త్రలాభము వ్యవసాయమువల్ల ధనలాభము మొద లగునవి కలుగును.

శ్లో. రాహోరంతర్గతేభౌమే నీచేష్టస్థారిష్ఫగే
రాహోశ్శేవంచాష్టమేవాషష్ఠేవావ్యయగేపినా
గృహక్షేత్రవినాశంచ నృపచోరాగ్నిపీడనం
మనోవైకల్యమాప్నోతిభ్రాతృవర్గవినాశనం
శత్రువృద్ధిర్విశేషంచరాజమూలాచ్చబంధనం
స్ఫోటకక్షయపీడాచ శరీరేరోగపీడనం
కళత్రపుత్రపీడాచ కారాగృహానివేశనం.

రాహువులో కుజుడు నీచయందుగాని లగ్నములగాయ తున్న రాహువులగాయతున్న గాని షష్టాష్టమవ్యయస్థానముల యందున్న గృహక్షేత్రనాశనము అగ్నివల్లను రాజులవల్లను దొంగలవల్లను బాధయున్ను మనోవికలత్వమున్ను సోదరనష్ట మున్ను స్ఫోటకక్షయబాధయున్ను విశేష శరీరపీడయున్ను విశేషశత్రువృద్ధియు రాజులవల్ల బంధనము కారాగృహప్రవే శము కళత్రపుత్రవిచారము మొదలగు చెడ్డఫలములు రాహు మహాదశలో కుజాంతర్దశలో జరుగును.

గురుమహాదశఫలం

శ్లో. అమరగురుదశాయాం కేంద్రకోణేచసంస్థే
స్వజనసుతసుఖంస్యాత్పుణ్యకర్మప్రచారః
సుహృదయసహవాసస్సాధువిద్యా ప్రసంగో
ధనకనకసమృద్ధిర్భ్యాపశ్వాదిలాభః

గురుడు కేంద్రకోణములయందు బలముగానున్న యెడల దారాపుత్రాదులతో సౌఖ్యమున్ను పుణ్యకార్యములుచేయుటయు మంచివారితో స్నేహమున్ను సాధుజనులతో ప్రసంగమున్ను ధనకనకసమృద్ధియు ధాన్యవృద్ధియు పశువృద్ధియు మొదలగు మంచిఫలములు కలుగును.

శ్లో. షష్ఠాష్టమవ్యయస్థస్యగురోఃపాపే ధనవ్యయం
కృషిగోభూమినాశంచనిరోధోబంధుభిస్సహా
భూవివాదంమనోదుఃఖంవ్యాధినాభయమేవనా
విదేశవాసంకష్టంచ నానాదుఃఖపరిభ్రమం.

గురుడు షష్ఠాష్టమవ్యయస్థానములయందున్న యెడల ఆ గురుదశలో వ్యయస్థానమువల్ల నష్టము పశునష్టము భూవ్యయము బంధువులతో విరోధము భూమికొరకు వివాదము మనోదుఃఖము రోగభయము విదేశవాసము కష్టము సమస్తదుఃఖములు కలుగును.

గురుదశలో గుర్వంతర్దశాఫలం

శ్లో. గురోంతర్గతేజీవే కేంద్రలాభత్రికోణగే
స్వోచ్చేద్వితీయరాశిస్థే శుభగ్రహాయుతేక్షితే
రాజ్యలాభం మనోత్సాహ వస్త్రవాహనభూషణం
విదేశయానాదర్థాప్తిం యశోవిద్యా జయంసుఖం
దారాపుత్రాదిసౌఖ్యంచరాజసన్మానవైభవం.

గురుమహాదశలో గురుడు కేంద్రకోణములయందుగాని ఉచ్ఛయందుగాని ద్వితీయలాభములయందుగాని యుండిశుభ గ్రహములతోకలిసినను శుభగ్రహములచేత చూడబడినను యీగుర్వంతర్దశలో రాజ్యలాభము మహాసంతోషము వస్త్ర వాహనాలంకార ప్రాప్తియు విదేశగమనమువల్ల ధనసంపాదన యశోవృద్ధి విద్యయందు జయము సౌఖ్యము దారాపుత్రాదులతో సౌఖ్యము రాజులవల్ల సన్మానము మొదలగు మంచిఫలములు గలుగును.

శ్లో. జీవస్యాంతర్గతేజీవే నీచేషష్టాష్టరిఫ్ఫగే
కరోతిదుఃఖబాహుళ్యం రాజ్ఞాంహృతధనంతథా
ఉద్యోగభంగదుఃఖం ధనధాన్యవినాశనం
కుటుంబకలహంచైవ దారాపుత్రాదిపీడనం.

గురుదశలో గురుడు నీచయందుగాని షష్టాష్టమవ్యయములయందుగాని దుర్బలము నున్నయెడల యీగుర్వంతర్దశలో విశేషదుఃఖమున్ను రాజులవల్ల ధననష్టమున్ను ఉద్యోగభంగమున్ను దుఃఖమున్ను ధనధాన్యనాశనమున్ను కుటుంబకలహమున్ను దారాపుత్రులకు శరీరపీడయున్ను కలుగును.

గురుదశలో శన్యంతర్దశాఫలం

శ్లో. గురోరంతర్గతేమందే స్వోచ్ఛేలాభత్రికోణగే
తృతీయేభిష్ఠభావస్థేశరీరారోగ్యవర్ధనం
రాజపూజ్యంకృషేర్లాభం స్థలధాన్యవివర్ధనం

స్వబంధుదారపుత్రాణా మారోగ్యంభూషణాదికం
ఉద్యోగాదభివృద్ధించ రాజసన్మానవైభవం.

గురుమహాదశలో శని ఉచ్ఛయందుగాని కేంద్రకోణములయందుగాని తృతీయషష్ఠలాభములయందుగాని బలముగానున్నయెడల యీశన్యంతర్దశలో శరీరారోగ్యాభివృద్ధియున్ను రాజపూజ్యతయున్ను కృషివల్లలాభము స్థలవృద్ధి ధాన్యవృద్ధి బంధువులయొక్కయు భార్యపుత్రులయొక్కయు ఆరోగ్యము అలంకారప్రాప్తి ఉద్యోగాభివృద్ధి రాజపూజ్యత మొదలగు మంచిఫలములు గలుగును.

శ్లో. గురోరంతర్గతేమందే నీచేవాష్టమరిఫ్ఫగే
అరిషడ్వర్గదుఃఖంచ తాపత్రయకృతంభయం
మిత్రబంధువిరోధశ్చ వ్యభిచారమహాగదః
ధర్మహీనోవిత్తహానిర్గ్రామైశ్వర్యం చాపసాక్ష్యకం
కుటుంబకలహాశ్చైవ గృహచ్ఛిద్రంమనోవ్యథా
శత్రువృద్ధిర్విశేషంచ కారాగృహనివేశనం.

గురుమహాదశలో శన్యంతర్దశలో యీశనినీచయందుగాని షష్ఠాష్టమ వ్యయస్థానముయందుగాని యున్నయెడల కామక్రోధాదులవల్ల దుఃఖము తాపత్రయమువల్ల భయము మిత్రులతోను బంధులతోను విరోధము వ్యభిచారమువల్ల రోగము అధర్మప్రవర్తన ధనహాని గ్రామాధిపత్యము అబద్ధసాక్ష్యము కుటుంబకలహము గృహనాశనము మనోదుఃఖము

విశేషశత్రువృద్ధి కారాగృహప్రవేశము మొదలగు చెడుఫల
ములు కలుగును.

గురుదశలో బుధాంతర్దశాఫలం

శ్లో. గురోరంతర్గతేసౌమ్యే స్వోచ్ఛకేంద్రత్రికోణగే.
శ్లో. కుసుమశయనవస్త్రాలంకృతిః క్షేత్రలాభ
స్స్వజనసుఖముదారంగేహ కల్యాణవృద్ధిః
వివిధకుశలవిద్యావైభవంవాగ్విలాసో
గణితకృషిఫలాప్తిర్వైశ్యవిత్తాప్తిభోగః
బహుపరిజనయోగోవాహనకగౌరవంనా.

గురుమహాదశలో బుధుడు ఉచ్ఛయందు గాని కేంద్ర
కోణములయందుగాని బలముగానున్న యెడల కుసుమశయ
నము వస్త్రాలంకారము భూలాభము కుటుంబసౌఖ్యము
ఔదార్యము కుటుంబమందు శుభకార్యవృద్ధి సమస్తవిద్యల
యందు నేర్పరితనము గణితమువల్లను వ్యవసాయమువల్లను
ధనలాభమున్ను వైశ్యులయొక్క ధనమువల్ల భోగమున్ను
అనేకమంది జనులతో స్నేహము వాహనము గౌరవము మొద
లగు మంచిఫలములు కలుగును.

శ్లో. గురోంతర్గతే సౌమ్యేనీచేషష్టాష్టరిప్ఫగే
గురోస్తథైవషష్ఠేవావ్యయేవాష్టమసంస్థితే
ఉత్సాహభంగంగోభూమి హిరణ్యాంబరనాశనం
స్థానచ్యుతింమహాద్వేషం విద్యానాశంలభేత్సదా

కృషివాణిజ్యనాశంచ బంధునాశమథాపివా
స్వబంధుమరణం క్లేశంభృత్యస్త్రీపుత్రపీడనం.

గురుమహాదశలో బుధుడు నీచయందుగాని లగ్నము లగాయతునున్న దశానాధుడైన గురుని లగాయతున్న షష్టాష్టమ వ్యయ స్థానములయందుగాని దుర్భలముగా నున్నయెడల యీ బుధాంతర్దశలో ఉత్సాహభంగమున్ను పశునష్టము భూవ్యయము సువర్ణవస్త్రనాశనము స్థానభ్రష్టత్వము ద్వేషము విద్యావిఘ్నము వ్యవసాయనష్టము వర్తకమువల్ల ధననష్టము బంధునష్టము ముఖ్యుడైన బంధునష్టము దుఃఖము దాసదాసీ జననష్టము భార్యాపుత్రులయొక్క శరీరపీడ మొదలగునవి కలుగును.

## గురుమహాదశలో కేత్వంతర్దశాఫలం

శ్లో. గురోరంతర్గతే కేతౌ షష్టలాభతృతీయగే
కృషిగోభూమిలాభంచ విద్యాబంధుసమాగమం
భోజనాంబరసౌఖ్యంచ స్వబంధుజనపూజ్యతాం
దారాపుత్రాదిసౌఖ్యంచ పుణ్యకర్మనివర్ధనం.

గురుమహాదశలో కేత్వంతర్దశలో యీ కేతువు తృతీయ షష్టలాభములయందున్నయెడల వ్యవసాయము పశువృద్ధి భూలాభము విద్యాభివృద్ధి బంధువులలో స్నేహము భోజన సౌఖ్యము వస్త్రసౌఖ్యము తనబంధువులవల్ల గౌరవము దారాపుత్రాదులయొక్క సౌఖ్యము విశేషముగా పుణ్యకర్మలు చేయుట మొదలగు మంచిఫలములు లభించును.

శ్లో. గురోరంతర్గతే కేతౌ వ్యయేవాష్టమసంస్థితే
స్థానచ్యుతిం ప్రవాసంచ రాజపీడాక్షినాశనం
గురోర్వ్యాపిపదందుఃఖం శుభకర్మవినాశనం
ఋణవృద్ధిర్వి శేషంచ ధర్మమూలాద్ధనవ్యయం.

గురుదశలో కేతువు అష్టమమందుగాని వ్యయస్థానమందుగాని వున్నయెడల యీ కేత్వంతర్దశలో స్థానభ్రష్టత్వము పరదేశనివాసము రాజులవల్లను బాధ నేత్రరోగము గురునివల్ల ఆపత్తు పుణ్యకర్మయొక్క విఘ్నము ధర్మమూలముగా ధనవ్యయము ఋణవృద్ధియు కలుగును.

గురుదశలో శుక్రాంతరం

శ్లో. గురోరంతర్గతే శుక్రేస్వోచ్చ కేంద్రత్రికోణగే
ద్వితీయేలాభరాశిస్థే శుభగ్రహయుతేక్షితే
రాజ్యాప్తిం రాజసన్మానం యానాంబరవిభూషణం
ఉత్సాహంకీర్తిసంపన్నం స్త్రీపుత్రధనసంపదః.
భాగ్యోత్తరం మనోధైర్యం రాజద్వారాధిపత్యకం.

గురుదశలో శుక్రుడు ఉచ్చయందుగాని కేంద్రకోణముల యందుగాని ద్వితీయలాభములయందుగాని శుభసంబంధముగాని వీక్షణముగాని కలిగియున్నయెడల యీ శుక్రాంతర్దశలో రాజ్యలాభమును రాజసన్మానమువస్త్రవాహనాలంకారప్రాప్తియు, సంతోషము యశోవృద్ధి స్త్రీపుత్రధనసంపత్తు ఉత్తరఖండమందు భాగ్యము మనోధైర్యము రాజానుగ్రహమువల్ల మంచి ఉద్యోగప్రాప్తియు మొదలగు మంచిఫలములుగలుగును.

శ్లో. గురోరంతర్గతేశుక్రే నీచేషష్టాష్టరిప్ఫగే
ఉద్యోగభంగం క్లేశంచ ధనధాన్యవినాశనం
భూవివాదం స్వబంధూనాం నాశనంస్వపదచ్యుతిం
దారాపుత్రాదిపీడాచ ఋణరోగవివర్ధనం.

శుక్రుడు నీచయందుగాని షష్టాష్టమ వ్యయములయందుగాని దుర్బలముగా నున్నయెడల గురుమహాదశలో శుక్రాంతర్దశలో ఉద్యోగభంగమున్ను దుఃఖమున్ను ధనధాన్యనాశనము స్థానభ్రష్టత్వము కళత్రశరీరపీడయు భూమికొరకు వివాదయు బంధునష్టము పుత్రవిచారము రోగవృద్ధియు ఋణవృద్ధియు కలుగును.

గురుదశలో రవ్యంతర్దశాఫలం

శ్లో. జీవస్యాంతర్గతేభానౌ స్వోచ్ఛకేంద్రత్రికోణగే
లాభేవాశుభరాశిస్థే శుభగ్రహయుతేక్షితే
ధనాప్తింరాజసన్మానం దారపుత్రసృపాత్ప్రియం
జయేదరీన్ ప్రయాసేన చిరాద్భోగమవాప్నుయాత్.

గురుదశలో రవి ఉచ్ఛయందుగాని కేంద్రకోణముల యందుగాని లాభమందుగాని యున్నను శుభమిత్రరాశియందున్నను శుభగ్రహములతో కలసినను శుభగ్రహములచేత చూడబడినను ధనలాభము రాజసన్మానము దారాపుత్రాదుల వల్లనుంచిన్ని రాజులవల్లనుంచిన్ని క్షేమయున్ను కలుగును.

ప్రయాసముచేతను శత్రువులను జయించును. చిరకాలభోగము కలుగును.

శ్లో. జీవస్యాంతర్గతేభానౌ నీచేషష్ఠాష్టరిష్ఫగే
రాజశత్రుభయందుఃఖంధనహానిఃపితుర్భయం
పిత్తజ్వరశ్శిరోరోగః నేత్రరోగప్రవర్ధనం
పరదేశేనివాసంచ స్థానభ్రంశమవాప్నుయాత్.

గురుమహాదశలో రవ్యంతర్దశలో యీరవి నీచయందుగాని షష్టాష్టమవ్యయములయందుగాని దుర్బలముగా నున్న యెడల రాజులవల్లను శత్రువులవల్లను భయమున్ను దుఃఖమున్ను ధనహానియు శతృశరీరపీడ పిత్తజ్వరము శిరోరోగము నేత్రరోగము మొదలగు చెడుఫలములు కలుగును.

శ్లో. జీవస్యాంతర్గతేచంద్రేస్వోచ్ఛే కేంద్రత్రికోణగే
సురతంచోత్తమస్త్రీషుసువస్త్రంచసుభోజనం
వ్యాపారేధనలాభంచ స్త్రీప్రజావృద్ధిమేవచ
ఆరోగ్యంధనసంపత్తి ర్భూషణంవాహనంతథా
మాతృసౌఖ్యంమనస్సౌఖ్యం దారాపుత్రాభివర్ధనం

చంద్రుడు ఉచ్ఛయందుగాని కేంద్రకోణములయందుగాని బలముగా నున్నయెడల ఉత్తమస్త్రీలతో భోగమును మంచివస్త్రానుభవమును భోజనసౌఖ్యమును వ్యాపారమువల్ల ధనలాభము స్త్రీసంతానవృద్ధియు, శరీరారోగ్యము, ధనవృద్ధి,

వాహనసౌఖ్యము లింగాగ్రప్రాప్తిగు మాతృసౌఖ్యము మన స్సంతోషము దారాపుత్రులయొక్క అభివృద్ధి మొదలగు మంచిఫలములు కలుగును.

శ్లో. జీవస్యాంతర్గతేచంద్రేనీచేషష్ఠాష్టరిష్ఫగే
కృషి భంగోధాన్యహానిర్మాతృనష్టంధనవ్యయం
త్వగ్దోషోరోగసంప్రాప్తి ర్విషచోరభయంతథా
పుత్రమిత్రార్ధహానిశ్చ భార్యాబంధువిరోధితా.

గురుదశలో చంద్రాంతర్దశలో యీ చంద్రుడు నీచ యందుగాని షష్ఠాష్టమ వ్యయస్థానములయందుగాని నిర్మల ముగా నున్నయెడల వ్యవసాయనష్టము ధాన్యహాని మాతృ నష్టము ధనవ్యయము చర్మవ్యాధి విషమువల్లను దొంగల వల్లను భయము పుత్రులయొక్కయు మిత్రులయొక్కయు నష్టము భార్యతోను బంధువులతోను విరోధముకలుగును.

గురుదశలో కుజాంతర్దశ

శ్లో. జీవస్యాంతర్గతేభౌమే తృతీయేషష్ఠలాభగే
స్వోచ్ఛేవాశుభసంయుక్తే కృషిగోభూమివర్ధనం
దేవస్థానాద్గురుస్థానా న్రాజసంస్థానతోపివా
గజాశ్వఛత్రభృత్యాది బిరుదాప్తిశ్చవై భవం
ప్రాభవంజనపూజ్యత్వం శౌర్యంసాహసమేవచ
ఆద్యైన్యైనదనాప్తిశ్చ భ్రాతృసౌఖ్యాభివర్ధనం.

గురుమహాదశలో కుజుడు ఉచ్ఛయందుగాని తృతీయ షష్ఠలాభముల యందుగాని శుభగ్రహాసంబంధము కలిగిన యెడల వ్యవసాయము పశువృద్ధి భూలాభము దేవస్థానమువల్ల నుంచిగాని గురుస్థానమువల్లనుంచిగాని రాజసంస్థానమువల్లనుంచి గాని గజము ఛత్రము అశ్వము దానదాసీజనులు ఈ మొదలగు బిరుదాంకితములు లభించును. ప్రభుత్వము జనులవల్ల సన్మానము శౌర్యము సాహసము మంచివృత్తివలన ధనలాభము సోదర సౌఖ్యము మొదలగునవి కలుగును.

శ్లో. జీవస్యాంతర్గతేభౌమే నీచేనాష్టమరిష్ఫగే
కేంద్రే కోణరాశిస్థే భ్రాతృ ర్గవినాశనం
గృహక్షేత్రనివాసంచ స్ఫోటకవ్రణపీడనం
ఉద్యోగభంగం క్లేశంచ కృషిమూలాద్ధనవ్యయం
దారాపుత్రవినాశంచ కారాగృహనివేశనం.

గురుదశలో కుజుడు నీచయందుగాని అష్టమమందుగాని వ్యయమందుగాని కేంద్రములయందుగాని కోణములయందు గాని దుర్బలముగా నున్న యెడల యీ కుజాంతర్దశలో భ్రాతృ నష్టమున్ను గృహనష్టము భూవ్యయము స్ఫోటకమువల్ల వ్రణమువల్ల బాధయున్ను ఉద్యోగభంగము దుఃఖము వ్యవ సాయమువల్ల ధనవ్యయము భార్యాపుత్రులయొక్క నష్టము కారాగృహప్రవేశము మొదలగు చెడుఫలములు కలుగును.

## గురుదశలో రాహ్వాంతర్దశాఫలం

శ్లో. జీవస్యాంతర్గతే రాహౌ తృతీయే షష్ఠలాభగే స్వోచ్చే శుభయుతే దృష్టే గృహక్షేత్రాభివర్ధనం రాజసన్మానం చైవ దారాపుత్ర వివర్ధనం ఉద్యోగాద్ధనలాభంచ మిత్ర బంధుసమాగమం.

గురుమహాదశలో రాహువు తృతీయమందుగాని షష్ఠ లాభములయందుగాని ఉచ్చయందుగాని వుండి శుభగ్రహసం బంధముగాని దృష్టిగాని కలిగినయెడల యీ రాహ్వాంతర్దశలో గృహలాభము, భూవృద్ధి, రాజసన్మానము, భార్యాపుత్రుల యొక్క సౌఖ్యము, ఉద్యోగమువల్ల ధనలాభము, మిత్రులతోను బంధువులతోను స్నేహవృద్ధి మొదలగు మంచిఫలములు కలుగును.

శ్లో. జీవస్యాంతర్గతేరాహౌ కేంద్రేవాకోణసంస్థితే రంధ్రేవా రిష్ఫరాశిస్థే పాపగ్రహాయుతేక్షితే కుభోజనం కువస్త్రంచ స్థాననాశం నృపాద్భయం కృషిగోభూమి వస్త్రాదిబంధు పుత్రార్థనాశనం అకస్మాత్కలహంచైవ నిజాచారవినాశనం ఋణవృద్ధిర్విశేషంచ శత్రురోగ వివర్ధనం.

గురుదశలో రాహ్వాంతర్దశలో యీ రాహువు కేంద్ర కోణములయందుగాని అష్టమమందుగాని వ్యయస్థానమందు గాని వుండి పాపగ్రహములతో కలిసినను చూడబడినను, యీ రాహ్వాంతర్దశలో సౌఖ్యములేని భోజనము, జీర్ణవస్త్రము, స్థాన

భ్రష్టత్వము, రాజులవల్ల భయము, కృషి, పశువులు భూమి వస్త్రములు బంధువులు సంతానము ధనము వీనియొక్క నాశనము. ఋణవృద్ధి శత్రువృద్ధి శరీరపీడ మొదలగు చెడుఫలములు కలుగును.

శనిమహాదశాఫలం

శ్లో. స్వోచ్చేవా షష్టలాభస్థే తృతీయేవాత్రికోణగే
తత్రస్థిత శనేర్దాయే కృషిగోధనసంపదః
రాజపూజ్యంధనాప్తించ దేశదేశగ్రామాధిపత్యకం
స్వబంధుదారాపుత్రాణామారోగ్యంభూషణాదికం
శత్రునాశం మహోత్సాహం ధనధాన్యవివర్ధనం.

శని ఉచ్చయందుగాని తృతీయ షష్ఠలాభములయందు గాని కోణములయందుగాని వున్నయెడల ఆశనిమహాదశలో రాజసన్మానము ధనలాభము దేశాధిపత్యము లేక గ్రామాధిపత్యము తనయొక్క బంధువుల యొక్కయు భార్యాపుత్రుల యొక్కయు శరీరారోగ్యమున్ను అలంకారప్రాప్తియు శత్రునష్టము మనోత్సాహము ధనధాన్యాభివృద్ధియు కలుగును.

శ్లో. నీచేవా కేంద్రరాశిస్థేవ్యయే వాష్టమసంస్థితే
ద్వితీయస్థశనేర్దాయే గృహక్షేత్రవినాశనం
స్థానచ్యుతింప్రవాసంచ శరీరేరోగవర్ధనం
శత్రువృద్ధి ర్విశేషంచ నీచవృత్త్యానుజీవనం
పుత్రదారాది పీడాచ కారాగృహనివేశనం.

శని నీచయందుగాని కేంద్రములయందుగానివ్యయస్థానమందుగాని అష్టమమందుగాని ద్వితీయమందుగాని వున్న యెడల అట్టి శనిమహాదశలో గృహానష్టము భూవ్యయము స్థానభ్రష్టత్వము పరదేశనివాసము శరీరపీడ విశేషశత్రువృద్ధి నీచవృత్తివల్ల జీవనము భార్యాపుత్రులయొక్క శరీరపీడ కారాగృహాప్రవేశము మొదలగు చెడ్డఫలములు కలుగును.

శనిమహాదశలో శన్యంతర్దశాఫలం

శ్లో. శనేరంతర్గతే మందేతృతీయే షష్టలాభగే
స్వోచ్ఛేశుభయుతే దృష్టేరాజపూజ్యోభవేన్నరః.

శ్లో.పరోపకారంనృపలబ్ధభాగ్యంకృష్ణానిధాన్యానికృషించలాభం
జనాధిపత్యం సుఖభోజనంచకళత్రమిత్రాత్మజసౌఖ్యమేతి.

శనిమహాదశలో శన్యంతర్దశలో అనగా యీశని ఉచ్ఛయందుగాని షష్టమమందుగాని తృతీయమందుగాని లాభమందుగాని ఉన్నయెడల రాజసన్మానమున్ను పరోపకారమున్ను రాజులవల్ల పొందబడిన భాగ్యమున్ను నల్లధాన్యమున్ను వ్యవసాయమువల్ల లాభము నరాధిపత్యము సుఖభోజనము మిత్రులయొక్కయు దారాపుత్రుల యొక్కయు సౌఖ్యము మొదలగు మంచిఫలములు లభించును.

శ్లో. శనేరంతర్గతే మందేవ్యయేవాష్టమసంస్థితే
నీచేవాకేంద్రకోణస్థే పాపగ్రహాయుతేక్షితే
స్థానాచ్యుతీం ప్రవాసంచ మాతృతద్వర్గనాశనం.

కళత్రపుత్రహానిశ్చ పితృమాతృ విరోధితా
శరీరేవ్యాధిపీడాచనీచ స్త్రీసంగమంలభేత్.

శని మహాదశలో శన్యంతర్దశలో అనగా యీ శని నీ చయందుగాని, అష్టమవ్యయస్థానములయందుగాని, కేంద్రకోణములయందుగాని వుండి పాపగ్రహములతో కలిసినను చూడబడినను, స్థానభ్రష్టత్వము, పరదేశనివాసము, మాతృనష్టము, కళత్రనష్టము, సంతానవిచారము, తలిదండ్రులతో విరోధము నీచస్త్రీసంగమము, గొప్పరోగము, సంభవించును.

ఈశని కేంద్రకోణముల యందున్నప్పుడు స్వల్పదోష ములున్ను నీచయందున్ను వ్యయమందున్ను అష్టమమందున్ను ఉన్నప్పుడు పూర్తిగా చెడుఫలములు లభించును.

(శనిమహాదశలో బుధాంతరం)

శ్లో. శనేరంతర్గతే సౌమ్యే కేంద్రలాభత్రికోణగే
స్వోచ్చేవాశుభరాశిస్థేశుభగ్రహాయుతేక్షితే
స్థిరాణిపుణ్యాకర్మాణి కృషిగోభూమివర్ధనం
మనోధైర్యంమనోత్సాహంవిదేశాద్వస్తుసంచయం
యజ్ఞంవైవాహికం కర్మపురాణాధికం
బంధుపూజ్యం యశోవృద్ధిర్వాణిజ్యేనధనాగమం.

శనిమహాదశలో బుధాంతర్దశలో యీబుధుడు కేంద్ర కోణములయందుగాని, యుచ్చయందుగాని, లాభమందుగాని వుండి శుభరాశియందున్నను, శుభగ్రహములతో కలిసినను

చూడబడినను శాశ్వతమైన పుణ్యకర్మలుచేయును. పశువృద్ధి వ్యవసాయాభివృద్ధి భూలాభము, మనోధైర్యము సంతోషము విదేశవస్తులాభము యజ్ఞముచేయుట వివాహము పురాణశ్రవణము బంధువులవల్ల పూజ్యత ధనసంపాదన మొదలగు మంచి ఫలములు కలుగును.

శ్లో. శనేరంతర్గతే సౌమ్యే నీచేషష్ఠాష్టరిష్ఫగే
చోరారివహ్నిభీతించ కుస్త్రీభవనసేవనం
కర్మహీనం కృషేర్నాశం వ్యాపారేణధనవ్యయం
శత్రువృద్ధిర్విశేషంచ ఋణరోగైశ్చబాధ్యతే.

శని మహాదశలో బుధాంతర్దశలో అనగా యీ బుధుడు నీచయందుగాని షష్టాష్టమవ్యయములయందుగాని వున్నయెడల, చోరులవల్లను, శత్రువులవల్లను, అగ్నివల్లను, భయమున్ను, నీచస్త్రీలయొక్క గృహమందు నివాసము, కులోచితకర్మలు విడిచిపెట్టుట, వ్యయమువల్ల నష్టము, వ్యాపారమువల్ల ధనవ్యయము, విశేషముగా శత్రువృద్ధి ఋణము, రోగము మొదలగు చెడుఫలములు కలుగును.

(శనిదశలో కేత్వంతరం)

శ్లో. శనేరంతర్గతే కేతౌత్రికోణేషష్టలాభగే
శుభగ్రహాయుతే దృష్టేసుఖం స్త్రీపుత్రవర్ధనం
వాహనం భూమిలాభంచ స్వబంధుజనపూజ్యతాం
దీర్ఘయాత్రాదిలాభంచపుణ్యకర్మ సమాచరేత్.

శని మహాదశలో కేత్వంతర్దశలో అనగా యీ కేతువు తృతీయషష్టలాభములయందువుండి శుభగ్రహములతో కలిసినను, శుభగ్రహదృష్టి కలిగినను, యీ కేత్వంతర్దశలో సౌఖ్యము, దారాపుత్రులయొక్క అభివృద్ధి వాహనసౌఖ్యము భూలాభము, బంధుపూజ్యత, తీర్థయాత్రాదిలాభము, పుణ్యకర్మలుచేయుట ఈమొదలగు మంచిఫలములు జరుగును.

శ్లో. శనేరంతర్గతే కేతౌరంధ్రేనావ్యయసంస్థితే
ధనేనా కేంద్రకోణస్థే పాపగ్రహాయుతేక్షితే
వాతపిత్తాగ్ని పీడాచపుత్ర దారాదివిగ్రహః
స్థానచ్యుతిం మనోదుఃఖం శరీరేవ్యాధివర్ధనం
అకస్మాత్కలహంచైవబంధుభిస్స్వజనైస్సహ.

శనిలో కేతువు అష్టమమందుగాని వ్యయమందుగాని, ధనస్థానమందుగాని, కేంద్రకోణములయందుగాని, యుండిపాపగ్రహములతో కలిసినను, చూడబడినను యీ కేత్వంతర్దశలో వాతమువల్లను, పిత్తమువల్లను, అగ్నివల్లను, బాధయున్ను, దారాపుత్రులతో విరోధమున్ను, స్థానభ్రష్టత్వమున్ను మనోదుఃఖమున్ను రోగవృద్ధియును, కుటుంబముతోను, బంధువులతోను అకస్మాత్తుగా కలహమున్ను కలుగును.

(శని మహాదశలో శుక్రాంతరం)

శ్లో. శనేరంతర్గతే శుక్రే కేంద్రలాభత్రికోణగే
స్వోచ్చేద్వితీయ రాశిస్థె శుభగ్రహాయుతేక్షితే

గోభూమిధనలాభంచదూరదేశాద్ధనాయుతః
రాజసన్మానమర్థాప్తి పుత్ర స్త్రీధనసంపదః
కృషిమూలాద్ద్రవ్యలాభముద్యోగస్యాభివర్ధనం.

శని మహాదశలో శుక్రుడు ఉచ్చయందుగాని కేంద్రకోణములయందుగాని, ధనలాభములయందుగాని, వుండి శుభగ్రహములతో గలిసినను చూడబడినను పశువృద్ధి భూలాభము ధనలాభము, దూరదేశమునుంచి ధనరాబడి, రాజులవల్ల సన్మానము, ధనలాభము, పుత్రవృద్ధి కళత్రసౌఖ్యము, సంపత్తు వ్యవసాయమువల్ల ద్రవ్యలాభము ఉద్యోగాభివృద్ధి మొదలగు మంచిఫలములు కలుగును.

శ్లో. శనేరంతర్గతే శుక్రేనీచే షష్టాష్టరిష్ఫగే
శనేశ్చైవంచాష్టమేవారిష్ఫేవాషష్టసంస్థితే
ఉద్యోగభంగం దుఃఖంచ దారాపుత్ర వినాశనం
ఋణవృద్ధిర్విశేషంచ కృషిమూలాద్ధనవ్యయం
చోరాగ్ని దేహపీడాచ స్వబంధు జననాశనం
మహాదుఃఖ మవాప్నోతిధనధాన్య వినాశనం.

శనిమహాదశలో శుక్రాంతర్దశలో అనగా యీశుక్రుడు నీచయందుగాని లగ్నము లగాయతున్న దశానాథుడైన శని లగాయతున్న షష్టాష్టమవ్యయస్థానములయందుగాని దుర్బలముగా నున్నయెడల, యీశుక్రాంతర్దశలో ఉద్యోగభంగము, దుఃఖము, భార్యాపుత్రులయొక్క నాశనము, ఋ

ణావృద్ధి, వ్యవసాయమువల్ల నష్టము, చోరులవల్లను అగ్నివల్లను బాధయు, శరీరపీడయు, బంధునష్టము, గొప్పదుఃఖము ధనధాన్యనాశనము యీమొదలగు చెడుఫలములు లభించును.

శనిమహాదశలో రవ్యంతర్దశాఫలం

శ్లో. శనేరంతర్గతే భానౌతృతీయేషష్ట లాభగే
స్వోచ్ఛేవాశుభరాశిస్థే శుభగ్రహాయుతేక్షితే.

శ్లో. ఆరోగ్యం ధనలాభంచ గౌరవం పితృసౌఖ్యదం
నేత్రవాహన సౌఖ్యంచరాజసన్మానవై భవం.

రవి తృతీయషష్టలాభములయందున్నయెడల ఆరోగ్యము ధనలాభము గౌరవము పితృసౌఖ్యము నేత్రసౌఖ్యము వాహనసౌఖ్యము రాజసన్మానము మొదలైనవి కలుగును.

శ్లో. శనేరంతర్గతేభానౌ కేంద్రేవాకోణసంస్థితే । నీచేవాష్టమరిష్ఫేచ పాపగ్రహాయుతేక్షితే రాజశత్రుర్భయం మృత్యుర్ధనహానిః పితుర్భయం । పితజ్వరశ్శిరోరోగః ప్రవాసఃకుక్షీపీడనం । బంధుహానిశ్చ యుద్ధంచదారిద్ర్యంమానభంజనం మానహానిర్మహాద్దుఃఖం కారాగృహ నివేశనం.

రవి కేంద్రకోణములయందుగాని నీచయందుగాని అష్టమవ్యయములయందుగాని పాపగ్రహములతో కలిసివున్నయెడల రాజులవల్లను శత్రువులవల్లను భయమున్ను మృత్యుభయమును ధనహానియు పితృపీడ పిత్తజ్వరము శిరోరోగము ప్రవాసము ఉదరరోగము బంధుహానియు యుద్ధమున్ను దారిద్ర్యమున్ను మానహానియున్ను కారాగృహప్రవేశమున్ను కలుగును.

శనిలో చంద్రాంతర్దశాఫలం

శ్లో. శనేరంతర్గతే చంద్రే కేంద్రలాభత్రికోణగే
ఆరోగ్యధనసంపత్తి ర్భూషణంవాహనంతథా
మిత్రాణాంవర్ధనంచైవ కృషివాణిజ్యవర్ధనం.

చంద్రుండు కేంద్రకోణములయందుగాని లాభమందు గాని ఉన్నయెడల ఆరోగ్యమున్ను ధనసంపత్తియున్ను భూషణమున్ను వాహనమున్ను మిత్రులయొక్క అభివృద్ధియున్ను వర్తక వ్యవసాయాభివృద్ధియున్ను కలుగును.

శ్లో. శనేరంతర్గతే చంద్రేనీచే షష్టాష్టరిప్ఫగే
కృషిబంధోధాన్యహానిః కువస్త్రంచ కుభోజనం
మాతాపితృవిపత్తిశ్చ స్వజనేషు విరోధితా.

చంద్రుడు నీచయందుగాని షష్టాష్టవ్యయములయందుగాని దుర్బలముగా నున్నయెడల వ్యసాయమువల్ల నష్టమున్ను ధాన్యహానియును మలినవస్త్రములున్ను సౌఖ్యములేనిభోజనమున్ను తల్లిదండ్రులయొక్క శరీరపీడయును స్వజనులలో విరోధమున్ను కలుగును.

శనిలో కుజాంతర్దశాఫలం

శ్లో. శనేరంతర్గతేభౌమే తృతీయేషష్టలాభగే
భూలాభశ్చాధికారాప్తి రారోగ్యంవిజయోధనం
భ్రాతృసౌఖ్య బలంమానం వాహనంశుభమాప్నుయాత్
భూలాభంధనలాభంచ మిత్రబంధుసమాగమం.

కుజుడు తృతీయమందుగాని అష్టమమందుగాని లాభమందుగాని ఉన్నయెడల భూలాభమున్ను అధిక ఆరోగ్యమున్ను విజయమున్ను ధనలాభమున్ను భ్రాతృసౌఖ్యమున్ను బలమున్ను మానమున్ను వాహనమున్ను శుభకార్యమున్ను భూలాభమున్ను బంధుమిత్ర సమాగమమున్ను కలుగును.

శ్లో. మందస్యాంతర్గతేభౌమే నీచేవాష్టమరిష్ఫగే
కేంద్రవాకోణసంస్థేచ పాపగ్రహాయుతేక్షితే
ఉష్ణవాతామయశ్చైవ దుఃఖందేశాటనంతథా
కష్టాధిక్యం ఫలాల్పత్వం దారాపుత్రాదిపీడనం.

కుజుడు నీచయందుగాని అష్టమవ్యయస్థానములయందు గాని కేంద్రకోణములయందుగాని ఉన్నయెడల మహావాత రోగ మున్ను దుఃఖమున్ను దేశాటనమున్ను విశేషశ్రమయు స్వల్ప ధనలాభమున్ను దారాపుత్రవిచారమున్ను కలుగును.

### శనిలో రాహ్వంతర్దశాఫలం

శ్లో. శనేరంతర్దశేరాహౌ తృతీయేషష్టలాభగే
క్వచిత్సౌఖ్యం క్వచిద్ధాన్యం క్వచిత్కీర్తింక్వచిద్ధనం
వస్త్రవాహనభూషాప్తిం క్రయవిక్రయభూషణం.

రాహువు తృతీయషష్టలాభముల యందున్నయెడల స్వల్పసౌఖ్యమున్ను స్వల్పధనమున్ను స్వల్పకీర్తియున్ను వస్త్ర వాహన భూషణలాభమున్ను భూషణక్రయవిక్రయములు అధికముగా అమ్ముటయు కొనుటయు కలుగును.

శ్లో. శనేరంతర్గతేరాహౌ నీచేవాష్టమరిష్ఫగే
కేంద్రేవాకోణసంస్థైచ పాపగ్రహాయుతేక్షితే
గృహదాహోక్షిరోగశ్చ దారపుత్రమహద్భయం
స్థానచ్యుతిం మనోదుఃఖం నిజాచారవివర్జితం.

రాహువు నీచయందుగాని వ్యయమందుగాని అష్టమమందుగాని కేంద్రకోణములయందుగాని ఉన్నయెడల గృహము దగ్ధమగుటయన్ను నేత్రరోగమున్ను దారాపుత్రాది భయమున్ను స్థానభ్రష్టత్వమున్ను మనోదుఃఖమున్ను ఆచారము విడిచిపెట్టుటయున్ను కలుగును.

శనిలో గుర్వంతర్దశాఫలం

శ్లో. శనేరంతర్గతేజీవే స్వోచ్చకేంద్రత్రికోణగే
లాభేవాధనరాశిస్థే భార్యావిభవతోషితః
దేవద్విజార్చనం చైవ పుత్రదారధనాన్వితం
జయమానాన్వితంసౌఖ్యం రాజసన్మానవైభవం.

గురుడు ఉచ్చయందుగాని కేంద్రకోణములయందుగాని ధనలాభములయందుగాని ఉన్నను భార్యాసౌఖ్యమున్ను దేవబ్రాహ్మణపూజయున్ను పుత్రదారాసౌఖ్యమున్ను రాజసన్మానమున్ను జయమున్ను కలుగును.

శ్లో. శనేరంతర్గతేజీవేనీచేష్టాష్టరిష్ఫగే
ధర్మతీర్థోవి త్తహాని గ్లాని సూణ్యంచాపసాత్యకం
కుటుంబకలహంచైవ మహద్దుఃఖంభవిష్యతి.

గురుడు నీచషష్టాష్టవ్యయములయం దున్నయెడల ధర్మ క్షయమున్ను విత్తహానియున్ను గ్రామాధికారమున్ను అప సాఖ్యమున్ను కుటుంబ కలహమున్ను మహాదుఃఖమున్ను కలుగును.

శనిమహాదశాంత ర్దశాఫలన్సమాప్తః

బుధమహాదశా ఫలం

శ్లో. బుధే కేంద్రత్రికోణస్థే ధనేవ లాభసంస్థితే
శుభరాశిగ తేవాపి శుభగ్రహయుతేక్షితే
ఆరోగ్యం భూషణం వస్త్రం వాహనం గృహమేవచ
విత్తంకుటుంబవృద్ధిశ్చ వాణిజ్యేన ధనాగమం
పుత్రోత్పత్తిశ్చకీర్తిశ్చ నృత్తగీతమహోత్సవం.

బుధుడు కేంద్రకోణములయం దున్నను ధనస్థానమం దున్నను లాభమందుగాని శుభరాశియందుగాని శుభగ్రహ ములతో కలిసినను చూడబడుచున్నను ఆ బుధమహాదశలో ఆరోగ్యమున్ను భూషణలాభమున్ను మంచివస్త్రమున్ను వాహనమున్ను గృహమున్ను ధనలాభమున్ను కుటుంబవృద్ధి యున్ను వర్తకమువల్ల ధనలాభమున్ను పుత్రోత్పత్తియున్ను నృత్తగీతాదిమహోత్సవములున్ను కలుగును.

శ్లో. బుధేషష్టాష్టమేరిష్ఫే నీచేవా పాపసంయుతే
వాతపిత్తాగ్నిపీడాచ కృషిమూలాద్ధనవ్యయం
ఋణవృద్ధిర్విశేషంచ శత్రురోగవివర్ధనం
క్లేశేనార్జయేద్విత్తం చిరాద్భోగమవాప్నుయాత్.

బుధుడు షష్టాష్టవ్యయస్థానములయందుగాని నీచయందుగాని వుండి పాపగ్రహములతో కలిసియుండెనేని వాతపైత్యములవల్ల కలిగిన ఉడుకువల్ల పుట్టిన బాధయున్ను వ్యవసాయమువల్ల ధనవ్యయమున్ను ఋణవృద్ధియున్ను శత్రువృద్ధియున్ను రోగవృద్ధియున్ను కలుగును. కష్టమువల్ల ధనలాభమున్ను చిరకాలమునకు భోగమున్ను కలుగును.

బుధమహాదశాయాం బుధాంతర్దశాఫలం

శ్లో. బుధస్యాంతర్గతేసౌమ్యే కేంద్రలాభత్రికోణగే
స్వోచ్ఛేవాధనరాశిస్థే శుభగ్రహయుతేక్షితే
కృషివాణిజ్యలాభశ్చ బంధుమిత్రసమాగమం
గణితం శిల్పకౌశల్యం దారాపుత్రాభివర్ధనం.

బుధుడు కేంద్రకోణములయందుగాని లాభమందుగాని ఉచ్ఛయందుగాని ధనస్థానమందుగాని శుభగ్రహములతో కలిసినను చూడబడినను వర్తకవ్యవసాయములవల్ల ధనలాభమున్ను బంధుమిత్ర సమాగమమున్ను గణితమందును శిల్పవిద్యయందున్ను నేర్పును దారాపుత్రాభివృద్ధియున్ను కలుగును.

శ్లో. బుధస్యాంతర్గతేసౌమ్యే నీచేషష్టాష్టరిష్ఫగే
పుత్రదారార్థ పీడాచ రోగోత్పత్తిర్మహద్భయం
కుటుంబకలహంచైవబుద్ధినాశో ధనవ్యయం.

బుధుడు షష్టాష్టవ్యయములయందు గాని నీచయందుగాని ఉన్నయెడల పుత్రదారధనపీడయున్ను రోగోత్పత్తియున్ను విశేష భయమున్ను కుటుంబకలహమును బుద్ధినాశనమున్ను [illegible] కలుగును.

బుధునిలో కేత్వంతర్దశాఫలం

శ్లో. బుధస్యాంతర్గతే కేతౌ కేంద్రలాభత్రికోణగే క్వచిద్దుఖం
క్వచిత్సౌఖ్యం మిత్రశత్రుసమాగమం వాణిజ్యాత్స్వ
ల్పలాభంచ ధర్మమూలాద్ధనవ్యయం.

కేతువు కేంద్రకోణములయందు గాని ఉచ్చయందు గాని ఉన్నయెడల స్వల్పదుఃఖమున్ను స్వల్పసౌఖ్యమున్ను శత్రువులతోటిన్ని మిత్రులతోటిన్ని స్నేహమున్ను వర్తక వ్యాపారములవల్ల సామాన్య ధనలాభమున్ను ధర్మమూలక ముగా ధనవ్యయమున్ను కలుగును.

శ్లో. బుధస్యాంతర్గతే కేతౌ షష్టాష్టవ్యయరిష్ఫగే
పుత్రమిత్రాది మరణం పితుర్నాశమథాపివా
స్థానార్థకలహాయాసం మిత్రబంధువిరోధితా.

బుధుడు షష్టాష్టవ్యయములయం దుండెనేని పుత్రుల యొక్కయు మిత్రులయొక్కయు మరణమున్ను పితృమరణ మున్ను స్థానముకొరకు కలహామున్ను మిత్రులతోటిన్ని బంధు వులతోటి విరోధమును కలుగును.

శ్లో. బుధస్యాంతర్గతే శుక్రే స్వోచ్చేవా కేంద్రకోణగే
రాజసన్మానమర్థాప్తిం పుత్రస్త్రీధన సంపదః
వస్త్రవాహన భూప్రాప్తిం దేహారోగ్యం మహత్సుఖం.

శుక్రుడు ఉచ్చయందు గాని కేంద్రకోణములయందు గాని ఉన్నయెడల రాజసన్మానమును, ధనలాభమున్ను పుత్ర

లాభమున్ను స్త్రీ ధనలాభమున్ను వస్త్రవాహన భూషణ ప్రాప్తియున్ను దేహారోగ్యమున్ను సౌఖ్యము కలుగును.

శ్లో. బుధస్యాంతర్గతే శుక్రే నీచే షష్టాష్టరిఫ్ఫగే
ఉద్యోగభంగం క్లేశంచ స్వబంధుజననాశనం
భూవివాదం స్వబంధూనాం నాశనం స్వపదచ్యుతిః.

శుక్రుడు నీచయందుగాని షష్టాష్టవ్యయభావముల యందుగాని ఉన్నయెడల ఉద్యోగభంగమున్ను మనఃక్లేశము న్ను బంధుజననాశనమున్ను భూవివాదమున్ను స్థానభ్రష్ట తయు కలుగును.

బుధునిలో రవ్యంతర్దశాఫలం

శ్లో. బుధస్యాంతర్గతేభానౌ స్వోచ్ఛకేంద్రత్రికోణగే ధైర్యం
విత్తసుతాప్తించసమరేజయమాప్నుయాత్ విద్యాలాభం
నృపాత్ప్రీతిం వస్త్రవాహనభూషణం.

రవి కేంద్రకోణములయందు గాని ఉచ్చయందుగాని ఉన్నయెడల ధైర్యము ధనలాభము సంతానసౌఖ్యము యుద్ధ మందు జయము విద్యాలాభము రాజులవల్ల సంతోషము వస్త్రవాహనాలంకార ప్రాప్తియు కలుగును.

శ్లో. బుధస్యాంతర్గతేభానౌ నీచే షష్టాష్టరిఫ్ఫగే వాక్పారు
ష్యం మనోదుఃఖం నేత్రరోగం మహద్భయం పితృనాశం
శతృవృద్ధిశ్చోరాది నృపపీడనం.

రవి నీచయందుగాని షష్టాష్టమవ్యయములయందుగాని ఉన్నయెడల పరుషవాక్యములు పల్కుటయు దుఃఖము, నేత్ర

రోగము మిక్కిలి భయము పితృనష్టము శత్రువృద్ధి చోరులవల్ల పీడయున్ను కలుగును.

బుధునిలో చంద్రాంతర్దశాఫలం

శ్లో. బుధస్యాంతర్గతే చంద్రే కేంద్రలాభత్రికోణగే
శుభగ్రహాయుతే దృష్టే దారపుత్రాభివర్ధనం
మాతృసౌఖ్యం మనోత్సాహం వాహనాంబరభూషణం
ధర్మం యజ్ఞం వివాహంచ రాజ్యశ్రీధనసంపదః.

చంద్రుడు కేంద్రకోణముల యందున్ను లాభమందున్ను ఉన్నయెడల దారాపుత్రాభివృద్ధియును మాతృసౌఖ్యమును మనోత్సాహమున్ను వస్త్రవాహనాలంకార ప్రాప్తియున్ను ధర్మము యజ్ఞము వివాహ సౌఖ్యము రాజ్యలాభము ధన సంపదయు కలుగును.

శ్లో. బుధస్యాంతర్గతే చంద్రే నీచే షష్టాష్టరిప్ఫగే
మాతృసౌఖ్యవిహీనంచ కృషిగోభూమినాశనం
వ్యాపారే ధననష్టంచగృహదారార్ధనాశనం.

చంద్రుడు నీచయందు గాని షష్టాష్టమ వ్యయభావముల యందుండెనేని మాతృసౌఖ్యము లేకపోవుటయున్ను వ్యవసాయనష్టమున్ను గోభూనష్టమున్ను వ్యాపారమువల్ల ధననష్టమున్ను గృహదారార్ధనాశనమున్ను కలుగును.

బుధునిలో కుజఫలం

శ్లో. బుధస్యాంతర్గతేభౌమె కేంద్రలాభత్రికోణగే
భ్రాతృసౌఖ్యం మనోత్సాహం విద్యావాహనభూషణం
భూలాభం ధనలాభంచ రాజసన్మానవైభవం.

కుజుడు కేంద్రకోణములయందు గాని లాభమందుగాని ఉన్నయెడల భ్రాతృసౌఖ్యమున్ను మనోత్సాహమున్ను విద్యా వాహనభూషణ సౌఖ్యమున్ను భూలాభమున్ను ధనలాభ మున్ను రాజసన్మానమున్ను వైభవమున్ను కలుగును.

శ్లో. బుధస్యాంతర్గతే భౌమె నీచెవష్టాష్టరిష్ఫగే
గృహక్షేత్రవినాశంచ భ్రాతృవర్గవినాశనం
పూర్వవిత్తవినాశంచ రాజమూలాద్ధనవ్యయం.

కుజుడు షష్టాష్ట వ్యయములయందుగాని నీచయందు గాని ఉన్నయెడల గృహనాశనమున్ను భూనాశనమున్ను భ్రాతృ నాశనమున్ను పూర్వవిత్త నాశనమున్ను రాజమూలకముగా ధనవ్యయమున్ను కలుగును.

బుధునిలో రాహ్వాంతర్దశాఫలం

శ్లో. బుధస్యాంతర్గతే రాహౌ తృతీయేషష్టలాభగే
ఉద్యోగాద్ధన లాభంచ గృహక్షేత్రాభివర్ధనం
క్రయవిక్రయవిత్తాప్తిం నృపమానం ధనాగమం.

రాహువు తృతీయమందుగాని షష్టమమందుగాని లాభ మందుగాని ఉన్నయెడల ఉద్యోగమువల్ల ధనలాభమున్ను భూలాభమున్ను గృహలాభమున్ను వర్తక వ్యాపారములవల్ల ధనలాభమున్ను రాజమూలకముగా ధనలాభమున్ను కలుగును.

శ్లో. బుధస్యాంతర్గతే రాహౌ నీచేవా కేంద్రకోణగే
వ్యయస్థానేష్టమె వాపిపాపగ్రహాయుతేక్షితే

కరోతిదుఃఖబాహుళ్యం ఋణశత్రువివర్ధనం
శరీరేరోగపీడాచకారాగృహనివేశనం.

రాహువు నీచయందుగాని కేంద్రకోణములయందు గాని వ్యయమందుగాని అష్టమమందుగాని ఉన్నను పాపగ్రహములతో కలిసినను చూడబడినను విశేషదుఃఖమున్ను ఋణశత్రు, రోగవృద్ధియున్ను కారాగృహనివేశనమున్ను కలుగును.

బుధునిలోగుర్వంతర్దశాఫలం

శ్లో. బుధస్యాంతర్గతే జీవేస్వోచ్ఛే కేంద్రత్రికోణగే
విదేశయానాదర్థాప్తిః యశోవిద్యాంజయంసుఖం
దేశాధిపత్యం మంత్రిత్వం లభతేనాత్రసంశయః
దారాపుత్రాదిసౌఖ్యంచన్యాయమూలాద్ధనాగమం.

గురుడు కేంద్రకోణములయందుగాని లాభమందుగాని ఉన్నయెడల విదేశవ్యాపారమువల్లధనలాభమున్ను కీర్తియున్ను విద్యయున్ను జయమున్ను సుఖమున్ను దేశాధిపత్యమున్ను మంత్రిత్వమున్ను దారాపుత్రాదిసౌఖ్యమున్ను న్యాయముగా ధనలాభమున్ను కలుగును.

బుధునిలో శన్యంతర్దశాఫలం

శ్లో. బుధస్యాంతర్గతే మందే తృతీయేషష్టలాభగే
రాజపూజ్యంకృషేర్లాభం ధనధాన్యవివర్ధనం
స్వబంధుదారాపుత్రాణామారోగ్యంభూషణాదికం
భృత్యమిత్రార్థసంపత్తిర్లభతే కర్మసంగ్రహం.

శని తృతీయమందుగాని షష్ఠమమందుగాని లాభమందుగాని ఉన్నయెడల రాజపూజ్యమున్ను వ్యవసాయమువల్ల లాభమున్ను భూషణలాభమున్ను బంధుమిత్రసౌఖ్యమున్ను ధనలాభమున్ను కలుగును.

శ్లో. బుధస్యాంతర్గతే మందే కేంద్రేవాష్టమసంయుతే
కోణేవారిప్ఫసంస్థేచగుల్మశూలాదిపీడనం
పరాపవాదం బంధూనాంమరణం ధననాశనం
ఉద్యోగభంగం దుఃఖంచ స్థలధాన్యవినాశనం.

శని కేంద్రకోణములయందుగాని అష్టమమందుగాని ఉన్నయెడల గుల్మవ్యాధియున్ను శూలవ్యాధియున్ను పరులవల్ల అపవాదమున్ను బంధువులమరణమున్ను ధననాశనమున్ను ఉద్యోగభంగమున్ను దుఃఖమున్ను ధనధాన్యవినాశనమున్ను కలుగును.

బుధదశాంతర్దశాఫలస్సమాప్తః
అథ కేతుమహాదశాఫలం

శ్లో. తృతీయషష్టలాభస్థ కేతోర్దాయెమహత్సుఖం
భ్రాతృవర్గాదిసౌఖ్యంచ యజ్ఞదానవివర్ధనం
రాజ్యార్థగృహలాభంచ రాజపూజ్యంయశస్సుఖం.

కేతుమహాదశలో కేతువు తృతీయషష్టలాభములయందున్నయెడల విశేషసుఖమున్ను భ్రాతృవర్గాది సౌఖ్యమున్ను

యజ్ఞదానాభివృద్ధియున్ను రాజ్యలాభమున్ను ధనలాభమున్ను గృహలాభమున్ను రాజపూజ్యతయున్ను యశస్సున్ను కలుగును.

శ్లో. కేతోర్దశాయాం కేంద్రేవాకోణేవాష్టమరిప్ఫగే
స్ఫోటకం విషభీతిశ్చ బంధుహానిర్ధనక్షయః
దుస్సంగతించ దౌర్జన్యం నీచవృత్యానుజీవనం.

కేతువు కేంద్రకోణములయందుగాని అష్టమ వ్యయస్థానములయందుగాని ఉన్నయెడల స్ఫోటకమున్ను విషమువల్ల భయమున్ను బంధుహానియున్ను ధనవ్యయమున్ను దౌర్జన్యమున్ను నీచవ్యాపారమువల్ల జీవనమున్ను కలుగును.

అథ కేతుమహాదశాయాం కేత్వంతర్దశాఫలం

శ్లో. కేతోరంతర్గతే కేతౌ తృతీయేషష్టలాభగే
జ్ఞానమీశ్వరభక్తిశ్చరోగా ర్త్రిర్బంధమోచనం
ధర్మమూలాద్ధనాప్తించ పురాణశ్రవణాదికం.

కేతువులో కేతువు తృతీయ షష్టలాభముల యందున్న యెడల జ్ఞానమున్ను, ఈశ్వరభక్తియున్ను, రోగమువల్లనుంచిన్ని దుఃఖమువల్లనుంచిన్ని విముక్తియును కలుగును.

శ్లో. కేతోరంతర్గతే కేతౌ వ్యయేవాష్టమ సంయుతే
శరీరేవ్యాధిపీడాచస్థానభ్రష్టం ధనక్షయం
ఉద్యోగభంగం దుఃఖంచ కారాగృహ నివేశనం

కేతువు వ్యయస్థానమందు గాని అష్టమమందు గాని

యున్నయెడల శరీరపీడయున్ను, స్థానభ్రష్టత్వమున్ను, ధన నష్టము, ఉద్యోగభంగము, దుఃఖము, కారాగృహప్రవేశము న్ను కలుగును.

కేతు మహాదశలో శుక్రాంతరం

శ్లో. కేతోరంతర్గతే శుక్రే స్వోచ్చే కేంద్రత్రికోణగే
క్షేత్రపుత్రార్థలాభంచ వాహనాంబరభూషణం
విద్యాలాభం యశోవృద్ధిం గృహేకల్యాణవర్ధనం.

కేతువులో శుక్రుడు ఉచ్ఛయందుగాని కేంద్రకోణముల యందుగాని బలముగానున్నయెడల భూలాభము, ధనలాభము, పుత్రలాభము, వాహనాలంకార ప్రాప్తియు, విద్యాలాభము, కీర్తి, గృహమందు కల్యాణము మొదలగు మంచిఫలములు కలుగును.

శ్లో. కేతోరంతర్గతేశుక్రేనీచే షష్టాష్టరిష్ఫగే
దారాపుత్రాది పీడాచదేహకార్శ్యంధనక్షయం
రాజ్యకార్యవిరోధశ్చ ధర్మమూలాద్ధనవ్యయం.

కేతువులో శుక్రుడు నీచయందు, 6, 8, 12 స్థానముల యందుగాని ఉన్నయెడల దారాపుత్రులయొక్క శరీరపీడయు, దేహము కృశించుటయు, ధనవ్యయము రాజకార్యములవల్ల విరోధము, ధర్మమూలకముగా ధనవ్యయము కలుగును.

కేతువులో రవ్యంతర్దశ

శ్లో. కేతోరంతర్గతేభానౌ తృతీయేషష్ఠలాభగే
స్వోచ్చేశుభయుతేదృష్టే వస్త్రవాహన భూషణం
ధనాప్తింరాజసన్మానందారాపుత్రవివర్ధనం.

కేతువులో రవి తృతీయషష్టలాభముల యందుగాని ఉచ్ఛయందుగాని శుభగ్రహములతో కలిసినను చూచినను వస్త్రవాహనాలంకార ప్రాప్తియు ధనలాభము, రాజసన్మానము దారాపుత్రాభివృద్ధియు గలుగును.

శ్లో. కేతోరంతర్గతేభానౌనీచేవాష్టమరిప్ఫగే
పాపగ్రహయుతే దృష్టే పాపమూలాద్ధనవ్యయం
జ్వరాతిసారకృచ్ఛంచమేహాపిత్తాదిపీడనం
ఉద్యోగభంగం దుఃఖంచ రాజమూలాచ్చబంధనం.

కేతువులో రవి నీచయందుగాని అష్టమమందుగాని వ్యయమందుగాని ఉన్నయెడల పాపులతో కలిసినను కూడబడినను అన్యాయముగా ధనవ్యయము. జ్వరాతిసారమువల్ల బాధయు, మేహపైత్యవ్యాధియు, ఉద్యోగభంగము, దుఃఖము రాజమూలకముగాబంధనము కలుగును.

కేతుదశలో చంద్రాంతర్దశ

శ్లో. కేతోరంతర్గతే చంద్రే కేంద్రలాభత్రికోణగే
స్వోచ్ఛేవాధనగేశ్రేష్ఠే శుభగ్రహయుతేక్షితే
దేహారోగ్యం నృపప్రీతిం వాహనాంబరభూషణం
కళత్రపుత్రసంపత్తిం వ్యాపారేణధనాగమం.

కేతువులో చంద్రుడు ఉచ్ఛయందుగాని, కేంద్రకోణములయందుగాని వుండి శుభగ్రహములతో కలిసినను చూడ

బడినను దేహారోగ్యము రాజులవల్ల సంతోషము, వస్త్రవాహ నాలంకారప్రాప్తియు కళత్రపుత్రసంపత్తును వ్యాపారమువల్ల ధన లాభమున్ను కలుగును.

శ్లో. కేతోరంతర్గతేచంద్రేనీచేవాష్టమరిప్పగే
షష్ఠేవాపాపసంయుక్తేపాపగ్రహాయుతేక్షితే
మాతృసౌఖ్యవిహీనశ్చవాణిజ్యేనధనవ్యయం
ఋణవృద్ధిర్విశేషంచరోగశత్రువివర్ధనం.

చంద్రుడు నీచయందుగాని అష్టమమందుగాని వ్యయ మందుగాని, షష్టమమందుగాని పాపగ్రహములందు కూడినను చూడబడినను మాతృసౌఖ్యము లేకపోవుటయున్ను వర్తక వ్యాపారములవల్ల ధనవ్యయమున్ను ఋణవృద్ధియున్ను రోగ వృద్ధియున్ను శత్రువృద్ధియున్ను కలుగును.

శ్లో. కేతోరంతర్గతేభౌమే తృతీయేషష్టలాభగే
స్వోచ్చేవాశుభరాశిస్థే శుభగ్రహాయుతేక్షితే
భ్రాతృసౌఖ్యంమనోత్సాహంస్వార్జితక్షేత్రవర్ధనం
భోజనాంబరసౌఖ్యంచకృషిభూషణవాహనం.

కుజుడు తృతీయమందుగాని షష్టమమందుగాని లాభ మందుగాని ఉచ్చయందుగాని శుభరాశియందుగాని యుండి శుభగ్రహముతోకూడినను చూడబడినను భ్రాతృసౌఖ్యము న్ను మనస్సునకు ఉత్సాహమును భూసంపాదనయున్ను భో

జనసౌఖ్యమున్ను మంచివస్త్రములున్ను వ్యవసాయమువల్ల లాభమున్ను భూషణములున్ను కలుగును.

శ్లో. కేతోరంతర్గతేభౌమే నీచకేంద్రత్రికోణగే
కురాజదస్యువ్యాళేభ్యో మృత్యుంబంధనమేవవా
విపదంపరదారేభ్యో మూత్రరోగమపస్మృతిం
వహ్నివిరోచనవ్యాధిః కష్టంనష్టంచ సాహసం.

కుజుడు నీచయందుగాని కేంద్రకోణముల యందుగాని ఉన్నయెడల దుష్టునివల్ల పొందబడిన ధనముగలవాడును సర్పమువల్ల భయమున్ను మృత్యుభయమున్ను బంధనప్రాప్తియున్ను పరదారలవల్ల ఆపత్తును నేత్రరోగమును కలరా రోగమును విశేషకష్టమున్ను విశేషధనవ్యయమున్ను కలుగును.

కేతువులో రాహ్వంతర్దశాఫలం

శ్లో. కేతోరంతర్గతేరాహౌ తృతీయేషష్ఠలాభగే
ఉత్తమైస్సహసంవాసః స్త్రీపుత్రసుఖమేవచ
తీర్థస్నానం సాహసంచ స్వర్ణరత్నాదభూషణం.

రాహువు తృతీయమందుగాని షష్టమ మందుగాని లాభమందుగాని ఉన్నయెడల ఉత్తములతో సహవాసమున్ను దారాపుత్రాదిసౌఖ్యమున్ను తీర్థయాత్రలున్ను సాహసమున్ను సువర్ణరత్నాదిభూషణములున్ను కలుగును.

శ్లో. కేతోరంతర్గతే రాహౌ వ్యయేవాష్టమసంస్థితే
కేంద్రవాకోణసంస్థైవా పాపగ్రహయుతేక్షితే

ఉద్యోగభంగం దేహార్తిం నీచవృత్త్యానుజీవనం
శత్రువృద్ధిర్విశేషంచ కారాగృహనివేశనం.

రాహువు వ్యయమందుగాని అష్టమమందుగాని కేంద్ర కోణములయందుగాని ఉండి పాపగ్రహములతో కూడినను చూడబడినను ఉద్యోగభంగమున్ను దేహపీడయున్ను నీచ వ్యాపారమువల్ల జీవనమున్ను శత్రువృద్ధియు కారాగృహ ప్రవేశమున్ను కలుగును.

కేతువులో గుర్వంతర్దశాఫలం

శ్లో. కేతోరంతర్గతేజీవేస్వోచ్చవా కేంద్రకోణగే
ధనేవాలాభరాశిస్థె శుభగ్రహాయుతేక్షితే
వివాహోభూమిలాభశ్చ శత్రునాశశ్శివార్చనం
పుత్రోత్పత్తిశ్చకీర్తిశ్చ రాజసన్మానవైభవం.

గురుడు ఉచ్చయందుగాని కేంద్రకోణములయందున్నను ద్వితీయమందుగాని లాభమందుగాని ఉన్నను శుభగ్రహము లతో కలిసినను చూడబడినను వివాహమున్ను భూలాభమున్ను శత్రునాశనమున్ను శివార్చనమున్ను పుత్రోత్పత్తియున్ను విశేషకీర్తియున్ను రాజసన్మానమున్ను వైభవమున్ను కలుగును.

శ్లో. కేతోరంతర్గతేజీవే షష్ఠేవాష్టమ రిష్ఫగే
కర్మనాశం పదభ్రంశమకస్మాత్కలహం వదేత్
మాతృనాశం తదీయంవా దారాపుత్రాదిపీడనం.

గురుడు షష్టాష్టవ్యయములయందు గాని నీచయందు గాని ఉన్నయెడల కర్మనాశనమున్ను స్థానభ్రష్టతయున్ను మాతృనాశనమున్ను దారాపుత్రాది పీడయున్ను కలుగును.

శ్లో. కేతోరంతర్గతేమందే తృతీయేషష్టలాభగే
దేవభూసురభక్తించ సుతదారవివర్ధనం
వస్త్రవాహనసౌఖ్యంచ పుత్రస్త్రీధనసంపదః.

శని తృతీయమందుగాని షష్టమమందుగాని లాభమందు గాని ఉన్నయెడల దేవబ్రాహ్మణ భక్తియున్ను దారాపుత్రాది సౌఖ్యమున్ను వస్త్రవాహన సౌఖ్యమున్ను పుత్రులవల్లనుంచి స్త్రీలవల్లనుంచి ధనలాభమున్ను కలుగును.

శ్లో. కేతోరంతర్గతే మందే నీచేవాష్టమరిప్ఫగే
కేంద్రేవాకోణసంస్థితుపాపగ్రహాయుతేక్షితే
గుహ్యారోగం విషార్తించ జ్వరవహ్నిన్నృపాద్భయం
అత్యాప్తబంధుమరణం ఉద్యోగస్యవినాశనం
మనోదుఃఖం మహత్కష్టం స్థాననాశంధనక్షయం.

శని నీచయందుగాని అష్టమమందుగాని వ్యయమందు గాని కేంద్రకోణములయందుగాని పాపగ్రహములతో కలిసి ఉన్నయెడల మూలరోగము విషమువల్ల బాధ జ్వరమువల్లను అగ్నివల్లను రాజువల్లను భయము మిక్కిలి ఆప్తుడగు బంధువు యొక్క మరణము ఉద్యోగ భ్రష్టత్వము మనోదుఃఖము గొప్పకష్టము స్థానసష్టము ధనవ్యయము కలుగును.

కేతువులో బుధాంతర్దశాఫలం

శ్లో. కేతోరంతర్గతేసౌమ్యే స్వోచ్చేవా కేంద్రకోణగే
ఆరోగ్యమతిసౌఖ్యంచ వాణిజ్యేనధనాగమం
దారాపుత్రాదిసౌఖ్యంచ పురాణశ్రవణాదికం.

బుధుడు ఉచ్చయందుగాని కేంద్రకోణములయందు గాని ఉన్నయెడల ఆరోగ్యమున్ను విశేషసౌఖ్యమున్ను వర్తక వ్యాపారములవల్ల ధనలాభమున్ను దారాపుత్రాది సౌఖ్యమున్ను పురాణశ్రవణమున్ను కలుగును.

శ్లో. కేతోరంతర్గతేసౌమ్యే షష్టేవాష్టమరిష్ఫగే
విషార్తింబంధువిద్వేషం కృషిగోభూమినాశనం
శత్రువృద్ధిర్విశేషంచ నిజాచారవివర్జితం.

బుధుడు షష్టాష్ట వ్యయములయం దున్నయెడల విష మువల్ల భయమున్ను బంధు ద్వేషమున్ను వ్యవసాయ నష్టము భూనాశనము శత్రువృద్ధి స్వకీయాచారమును విడచిపెట్టుట యున్ను కలుగును.

అథశుక్ర మహాదశాఫలం

శ్లో. స్వోచ్చత్రికోణకేంద్రస్థే శుక్రదాయేమహత్సుఖం
కీర్తించరాజపూజ్యంచ సర్వేషాముపకారకం
యజ్ఞాదికర్మలాభంచ పుత్రప్రాప్తింవినిర్దిశేత్
దారాపుత్రాదిసౌఖ్యంచ ధనభాగ్యాధికంభవేత్.

శుక్రుడు ఉచ్చయందుగాని కేంద్ర త్రికోణములయందు

గాని ఉండి శుభగ్రహములతో కూడినను చూడబడుచుండి నను మహాసుఖమున్ను విశేషకీర్తియున్ను రాజ్యపూజ్యత యున్ను సర్వజన ఉపకారమున్ను యజ్ఞాదిక్రతువులు చేయుట యున్ను పుత్రప్రాప్తియున్ను దారాపుత్రాదిసౌఖ్యమున్ను ధనవంతుడున్ను భాగ్యవంతుడున్ను అగును.

శ్లో. నీచేవాష్టమరాశిస్థైవ్యయెవారిప్ఫసంస్థితే
శుక్రదాయెమహాకష్టంస్థాననాశమథాపివా.
ధర్మకర్మవినాశశ్చ దారాపుత్రాదిపీడనం
ఉద్యోగభంగందుఃఖంచ ఋణశత్రువివర్ధనం.

శుక్రుడు నీచయందుగాని అష్టమమందున్నను వ్యయ మందున్నను శుక్రమహాదశలో మహాకష్టమున్ను స్థాననాశన మున్ను ధర్మకార్యవినాశనమున్ను దారాపుత్రాది పీడయున్ను ఉద్యోగభంగమున్ను దుఃఖమున్ను శత్రువృద్ధియు ఋణవృద్ధి యు కలుగును.

శుక్రమహాదశలో శుక్రాంతర్దశాఫలం

శ్లో. శుక్రస్యాంతర్గతేశుక్రే స్వోచ్ఛేవా కేంద్రకోణగే
గజాశ్వాందోళికాలాభం ఛత్రచామరసంయుతం
సువర్ణరత్నాభరణం నృత్తగీతమహోత్సవం
సంగీతమపిసాహిత్యం కవిత్వంక్రీడనంతథా
ఉల్లాసారోగ్యభాగ్యాని తాంబూలవనితాసుఖం.

శుక్రుడు ఉచ్ఛయందు గాని కేంద్రకోణములయందు గాని ఉన్నయెడల శుక్రాంతర్దశలో ఏనుగ గుఱ్ఱము పల్లకీ

మొదలగు వాహనసౌఖ్యమున్ను ఛత్రచామరములున్ను సువ ర్ణరత్నాభరణములున్ను నాట్యము సంగీతము సాహిత్యము కవిత్వము తాంబూలము స్త్రీసౌఖ్యము మొదలైనవికలుగును.

శ్లో. శుక్రస్యాంతర్గతేశుక్రేనీచేషష్టాష్టరిష్ఫగే
అనారోగ్యమమర్యాదం దారాపుత్రాదిపీడనం
బంధుద్వేషంపితుర్నాశం స్వబంధుజననాశనం
ఉద్యోగభంగంక్లేశంచ ధర్మమూలాద్ధనవ్యయః.

శుక్రుడు నీచయందుగాని షష్టాష్టవ్యయములయందు గాని ఉన్నయెడల అనారోగ్యమున్ను అమర్యాదయున్ను దారాపుత్రాదిపీడయున్ను బంధుద్వేషమున్ను పితృనాశన మున్ను తనబంధునాశనమున్ను ఉద్యోగభంగమున్ను క్లేశ మున్ను ధర్మమూలకముగా ధనవ్యయమున్ను కలుగును.

శుక్రునిలో రవ్యంతర్దశాఫలం

శ్లో. శుక్రస్యాంతర్గతేభానౌతృతీయేషష్టలాభగే
కళత్రపుత్రసంపత్తిం వాహానాంబరభూషణం
రాజమూలాద్ధనాప్తించకీర్తిమాచంద్రతారకం.

రవి తృతీయమందుగాని షష్టమమందుగాని లాభమం దుగాని ఉన్నయెడల కళత్రపుత్రాదిసంపత్తున్ను వాహనము న్ను మంచివస్త్రములున్ను భూషణలాభమున్ను రాజమూల కముగాధనలాభమున్ను విశేషకీర్తియున్ను కలుగును.

శ్లో. శుక్రస్యాంతర్గతేభానౌ నీచేవాష్టమరిష్ఫగే
స్థానచ్యుతి ప్రవాసంచ నేత్రరోగంమహద్భయం
పితృనాశనం మనోదుఃఖం నృప చోరారిపీడనం.

రవి నీచయందుగాని, అష్టమమందుగాని వ్యయమందు గాని ఉన్నయెడల స్థానభ్రష్టత్వమున్ను ప్రవాసమున్ను నేత్ర రోగము విశేషభయమున్ను పితృనాశనమున్ను మనోదుఃఖ మున్ను రాజులవల్లనుంచి చోరులవల్లనుంచి శత్రువులవల్లనుంచి పీడయున్ను కలుగును.

శుక్రునిలో చంద్రాంతర్దశాలం

శ్లో. శుక్రస్యాంతర్గతేచంద్రే కేంద్రలాభత్రికోణగే
స్త్రీభూమివిద్యాలాభంచ వస్త్రవాహనవైభవం
దారసౌఖ్యాభివృద్ధించ కృషివాణిజ్యవర్ధనం.

చంద్రుడు కేంద్రకోణములయందుగాని లాభమందు గాని ఉన్నయెడల స్త్రీలాభమున్ను భూలాభమును విద్యా లాభమును వస్త్రవాహన వైభవమును దారాసౌఖ్యాభివృద్ధి యును వ్యవసాయమువల్లను వర్తకవ్యాపారములవల్లను విశే ష ధనలాభమున్ను అభివృద్ధియును కలుగును.

శ్లో. శుక్రస్యాంతర్గతే చంద్రే నీచేవష్టాష్టరిష్ఫగే
ధర్మకర్మవినాశశ్చ సర్వద్రవ్యవినాశనం
దేశాటన దుర్గతిర్వా పౌరోహిత్యంచ సేవనం
అజ్ఞాతవాసమాప్నోతి దుఃఖం నానావిధంతథా.

చంద్రుడు నీచయందున్నను షష్ఠమమందున్న అష్టమమందున్నను వ్యయమందున్నను ధర్మకార్యవినాశనమును సర్వద్రవ్యవినాశమున్ను దేశాటనమున్ను దుర్గతియున్ను పౌరోహిత్యమున్ను సేవకావృత్తియున్ను అజ్ఞాతవాసమున్ను నానావిధ దుఃఖములును కలుగును.

శుక్రునిలో కుజాంతర్దశాఫలం

శ్లో. శుక్రస్యాంతర్గతేభౌమే తృతీయేషష్ఠలాభగే
స్వోచ్ఛేవాశుభ రాశిస్థె శుభగ్రహాయుతేక్షితె
స్ఫోటకంవ్రణబాధశ్చ శీఘ్రమే మేనసివారణం
భూలాభంధనలాభంచ రాజమూలాద్విశేషతః.

కుజుడు తృతీయమందుగాని షష్ఠమమందుగాని లాభమందుగాని ఉచ్ఛయందుగాని శుభరాశియందుగాని ఉండి శుభగ్రహముతో కూడినను చూడపడుచుండినను స్ఫోటకమున్ను వ్రణబాధయున్ను శీఘ్రములో నివారణయగుటయున్ను భూలాభమున్ను ధనలాభమును రాజమూలకముగా ధనలాభము భూలాభము విశేషముగా కలుగును.

శ్లో. శుక్రస్యాంతర్గతేభౌమె నీచేవాష్టమరిష్ఫగే
కళత్రపుత్రహానిశ్చ పాపమూలాద్ధనవ్యయం
శత్రువృద్ధిర్విశేషంచ పితార్జితధనవ్యయం
స్థానచ్యుతింప్రవాసంచ గృహక్షేత్రవినాశనం.

కుజుడు నీచయందుగాని అష్టమమందుగాని వ్యయమందుగాని ఉన్నయెడల కళత్రపుత్ర హానియున్ను పాపమూలక

ముగా ధనవ్యయమున్ను విశేషశత్రువృద్ధియున్ను పిత్రార్జిత సంబంధమగు ధనవ్యయమున్ను స్థానభ్రష్టత్వమున్ను ప్రవాస మున్ను గృహక్షేత్రాదినాశనమున్ను కలుగును.

శుక్రునిలో రాహ్వంతర్దశాఫలం

శ్లో. శుక్రస్యాంతర్గతేరాహౌ తృతీయేషష్టలాభగే
ఉద్యోగలాభం సౌఖ్యంచ ధనధాన్యాభివర్ధనం
విదేశయానలాభంచ ధనవాణిజ్యవర్ధనం.

రాహువు తృతీయమందుగాని షష్టమమందు గాని లాభమందుగాని ఉన్నయెడల ఉద్యోగలాభమున్ను సౌఖ్య మున్ను ధనధాన్యాభివృద్ధియు విదేశప్రయాణమువల్ల ధనలాభ మును వర్తకవ్యాపారాభివృద్ధియును కలుగును.

శ్లో. శుక్రస్యాంతర్గతేరాహౌ వ్యయెవాష్టమసంయుతే
కేంద్రవాకోణసంస్థెచ పాపగ్రహాయుతేక్షితే
ఉద్యోగభంగం దేహార్తిం మాతృపితృవివర్ధనం
దారాపుత్రాదిపీడాచ ఋణశత్రువివర్ధనం.

రాహువు వ్యయమందుగాని అష్టమమందుగాని కేంద్ర కోణములయందుగాని ఉండి పాపగ్రహములతో కూడినను చూడబడినను ఉద్యోగభంగమున్ను దేహపీడయున్ను మాతృ పితృనాశనమున్ను దారాపుత్రాది పీడయున్ను ఋణవృద్ధియున్ను శత్రువృద్ధియున్ను కలుగును.

శుక్రునిలో గుర్వంతర్దశాఫలం

శ్లో. శుక్రస్యాంతర్గతేజీవే స్వోచ్చేవాకేంద్రకోణగే
ధనేవాలాభరాశిస్థె శుభగ్రహాయుతేక్షితే

వాహనంబంధుసన్మానంచ యజ్ఞం వై వాహికం శుభం
దారాపుత్రాదిసౌఖ్యంచ కుటుంబస్యాభివర్ధనం.

గురుడు ఉచ్ఛయందుగాని కేంద్రకోణముల యందుగాని ధనమందుగాని లాభమందుగాని శుభగ్రహములతో కూడినను చూడబడు చుండినను వాహనమున్ను బంధునాశనమున్ను యజ్ఞమున్ను వివాహమున్ను దారాపుత్రాది సౌఖ్యమున్ను కుటుంబాభివృద్ధియు కలుగును.

శ్లో. శుక్రస్యాంతర్గతేజీవే నీచేషష్టాష్టరిప్ఫగే
కృషిగోభూమినాశంచ విరోధం బంధుభిస్సహ
స్వకులాచారహీనంచ పరదారాభిమర్శనం
భూమివాదం మనోదుఃఖం ధర్మమూలాద్ధనవ్యయం.

గురుడు నీచయందుగాని షష్టాష్టవ్యయముల యందుగాని ఉన్నయెడల వ్యవసాయ నష్టమున్ను భూనాశనమున్ను బంధువిరోధమున్ను స్వకులాచారహీనుడును పరదారాసక్తుడును భూసంబంధమగు వ్యాపారచిక్కులున్ను మనోదుఃఖమున్ను ధర్మమూలకముగా ధనవ్యయమున్ను కలుగును.

శుక్రునిలో శన్యంతర్దశాఫలం

శ్లో. శుక్రస్యాంతర్గతేమందే తృతీయే షష్టలాభగే
శత్రునాశం మనోత్సాహం ధనధాన్యవివర్ధనం
స్వబంధుదారపుత్రాణా మారోగ్యం భూషణాదికం
భృత్యమిత్రార్థసంపత్తిర్లభతేకర్మసంగ్రహం.

శని తృతీయ షష్ఠలాభములయందున్నయెడల శత్రు నాశనమున్ను మనోత్సాహమును ధనధాన్యాభి వృద్ధియు బంధువులయొక్కయు భార్యాపుత్రులయొక్కయు ఆరోగ్యమున్ను అలంకారప్రాప్తియు మిత్రదాసదాసీజనవృద్ధియు శుభకర్మయు మొదలగు మంచిఫలములు కలుగును.

శ్లో. శుక్రస్యాంతర్గతేమందే నీచేవాష్టమరిప్ఫగే
కేంద్రేవాకోణసంస్థేచ పాపగ్రహాయుతేక్షితే
దారార్థసుతబంధూనాం మరణంకర్మనాశనం
పరప్రేష్యంమనోదుఃఖం గుల్మశూలాదిపీడనం
స్థానచ్యుతింప్రవాసంచ నీచమూలాద్ధనవ్యయం.

శని నీచయందుగాని అష్టమమందుగాని వ్యయమందుగాని ఉన్నను కేంద్రకోణములయందుగాని ఉండి పాపగ్రహములతో కలసినను చూడబడినను ధనము కళత్రము సంతానము బంధువులు వీరియొక్కనష్టమున్ను కర్మనాశనమున్ను సేవావృత్తియు మనోదుఃఖము గుల్మశూలలవల్లబాధయు స్థానభ్రష్టత్వము పరదేశనివాసము పాపమూలముగా ధనవ్యయము కలుగును.

శుక్రునిలో బుధాంతర్దశాఫలం

శ్లో. శుక్రస్యాంతర్గతేసౌమ్యే కేంద్రలాభత్రికోణగే
రాజపూజ్యంయశోవృద్ధిం వాణిజ్యేనధనాగమం
విద్యాజయంనృపాత్ప్రీతిం పురాణశ్రవణాదికం.

బుధుడు కేంద్రకోణములయందుగాని లాభములయందుగాని ఉన్నయెడల రాజపూజ్యతయున్ను కీర్తియున్ను వర్తక

వ్యాపారమువల్ల ధనలాభమున్ను విద్యవల్లజయమున్ను రాజానుగ్రహమున్ను పురాణశ్రవణమున్ను కలుగును.

శ్లో. శుక్రస్యాంతర్గతేసౌమ్యే నీచేవాష్టమరిప్ఫగే
శత్రువృద్ధిర్విశేషంచ జ్ఞాతిమూలాద్ధనవ్యయం
పదభ్రష్టంమహోద్వేషం వ్యాపారేణధనవ్యయం.

బుధుడు నీచయందుగాని అష్టమమందుగాని వ్యయమందుగాని ఉన్నయెడల విశేష శత్రువృద్ధియున్ను జ్ఞాతిమూలకముగా ధనవ్యయమున్ను స్థానభ్రష్టతయున్ను ద్వేషమున్ను వ్యాపారమువల్ల ధననష్టమున్ను కలుగును.

శ్లో. శుక్రస్యాంతర్గతేకేతౌ తృతీయే షష్టలాభగే
వాహనంభూమిలాభంచ స్వబంధుజనపూజ్యతా
పరోపకారంసర్వేషాం ధర్మచింతాభివర్ధనం. ॥

కేతువు తృతీయమందుగాని షష్టమమందుగాని లాభమందుగాని ఉన్నయెడల వాహనమున్ను భూలాభమున్ను తన బంధువులవల్ల పూజ్యత్వమున్ను పరోపకారమున్ను ధర్మకార్యములు చేయుటయందు ఇచ్ఛయున్ను కలుగును.

శ్లో. శుక్రస్యాంతర్గతేకేతౌ వ్యయేవాష్టమసంస్థితే
పుత్రమిత్రాదిపీడాచ దుస్సంగంప్రాప్నుయాత్క్వచిత్
ఉద్యోగభంగందుఃఖంచ ఋణశత్రువివర్ధనం.

కేతువు వ్యయమందుగాని అష్టమమందుగాని ఉన్నయెడల పుత్రమిత్రాదపీడయున్ను దుస్సహవాసమున్ను ఉద్యోగభంగమున్ను దుఃఖమున్ను ఋణశత్రువృద్ధియున్ను కలుగును.

మహాదశాంతర్దశాఫలస్సమాప్తః

## లగ్నస్ఫుటముచేయువిధము

లగ్నస్ఫుటమనగాజాతకుడు జననమైన జననలగ్నమం దు జాతకుడు జననమయ్యేసరికి యెన్నిభాగములుయెన్నిలిప్తలుగతించినవోఅవిసరిగాకనుగొనుటయె లగ్నస్ఫుటమనబడును.

దీనికి ముందుగా లగ్నభుక్తినికనుగొనవలెను. అటుపిమ్మట జాతకుడు ఏలగ్నమందుజననమయ్యెనో ఆలగ్నముయొక్క ప్రమాణమును ఒకచోటను చుకొనవలెను. లగ్నప్రమాణమును ఆయాపంచాంగములనుబట్టిచూచుకొనవలెను ప్రతి లగ్నమునకు 30 భాగములుండును. గనుకమొత్తముఈలగ్నప్రమాణమునకు 30 భాగలైనయెడల పైనవ్రాసిన లగ్నభుక్తికి ఎన్నిభాగలుఅగునో అదిత్రయరాశికమువలన కనుగొనవలెను.

అదిఎట్లనగా, లగ్నభుక్తియొక్క గడియ విఘడియలను 30భాగలచేత గుణించి లగ్నప్రమాణముయొక్క గడియ విఘడియలచేత భాగించగావచ్చిన లబ్ధము. భాగలిప్తలగును. దీనికే లగ్నస్ఫుటమనిపేరు. యీభాగలిప్తలయొక్క మొదటిస్థానమందు అనగా రాశిస్థానమందు మేషములగాయతు జన్మలగ్నమువరకు ఎన్నిరాసులుగతించినవో ఆరాశిసంఖ్యను పైనవ్రాసిన భాగాదిలిప్తలయొక్క మొదటిస్థానమందు చేర్చవలెను. అట్లుచేర్చగా రాసులు భాగలులిప్తలు ఏర్పడును అనగా జాతకునియొక్క జననకాలఘడియలకు మేషాది ఎన్నిరాసులు ఎన్నిభాగలు ఎన్నిలిప్తలుగతించినవో తెలియును. దీనికేలగ్న

స్ఫుటమనియు రాశ్యాదిలగ్నమనియు పేరు. దీనికే తనుభావమనిగూడ పేరు.

ఉదాహరణము.

దుందుభిసం॥ర చైత్రశుద్ధ పంచమిఆదివారం ఉదయాది 9-39 విఘడియలకు జాతకునియొక్క జననము, బ్రహ్మశ్రీ పిడపర్తి పెదపూర్ణయ్యసిద్ధాంతిగారిపంచాంగరీత్యా, ఆరోజున తిథిచివరవ్రాసిన ఉదయమీాన సంక్రమణ భుక్తి 2-31 విఘడియలు.

ముందుగా లగ్నభుక్తిని కనుగొనుచున్నాము.

| | |
|---|---|
| మీానలగ్న ప్రమాణము | 4-2 |
| ఉదయలగ్నభుక్తి | 2-31 |
| | 1-31 |
| మేషలగ్నప్రమాణం | 4-20 |
| ఉదయాదిమేష లగ్నాంతమువరకు | 5-51 |
| సూ జననకాలఘటికాః | 9-39 |
| | 5-51 |
| వృషభలగ్నభుక్తి | 3-48 |

వృషభలగ్నమందు జాతకుడు జననమయ్యెను గనుక వృషభలగ్నప్రమాణమును తెలిసికొనవలెను. వృషభలగ్నప్రమాణము 4-55 జననకాల వృషభలగ్నభుక్తి గ 3 వి 48 లు పైనవ్రాసిన లగ్నప్రమాణమునకు 30 భాగలు ఐనయెడల లగ్నభుక్తి కెన్నిభాగలగును అనిత్రయరాశికమువలన కనుగొనవలెను. అనగా లగ్నభుక్తిని 30 చేత గుణించి లగ్నప్రమాణముచేత భాగించవలెను.

| | గ. | వి. | | గ. | వి. |
|---|---|---|---|---|---|
| లగ్నప్రమాణము, | 4 | 55 | లగ్నభుక్తి | 3 | 48 |
| | 60 | | | 60 | |
| | 240 | | | 180 | |
| | 55 | | | 48 | |
| | 295 | | | 228 | |

228
30

295 ) 6840 ( 23-11
590

940
885

---

55
60

---

3300
295

---

350
295

---

55

భా 23 లి 11 లు

వృషభలగ్నములో 23 భాగల 11 లిప్తలకు జననము మేషరాసిలగాయతు ఈజన్మలగ్నమునకు 1 రాశి గతించినది. గనుక ఈభాగలిప్తలయొక్క రాశిస్థానమందు, 1 చేర్చగా 1 రాశి 23 భాగల 11 లిప్తలువచ్చినవి. అనగా జాతకుడు జననమయ్యేసరికి, మేషములగాయతు 1 రాశి 23 భాగల 11 లిప్తలు గతించినవి అని యర్థము. దీనికేరాశ్యాదిలగ్నమనియు లగ్నస్ఫుటమనియు పేరు.

## భావస్ఫుటము చేయువిధము

భావస్ఫుటమునకు ముందుగా నతమును కనుగొనవలెను.

### నతమనగా

జాతకుడు జననమైన రోజున అహఃప్రమాణ మెంత యున్నదో అది వ్రాసికొని అదినగముచేయగా దినార్ధమగును. ఆదినార్ధములో జాతకునియొక్క జననకాలఘుడియలను కలుపుటవలనగాని లేక తీసివేయుటవలనగాని వచ్చిన ఘుడియవిఘుడియలు నతమగును.

### ఇది 4 విధములు

1 పగటియందు 2 జాములకు లోపుగా జననమయ్యేనేని సూర్యోదయాది జననకాలఘుడియలను దినార్ధములో తీసివేయగా శేషించిన ఘుడియ విఘుడియలు నతమగును.

2 పగటియందు రెండుజాములు దాటిన తరువాతజననమయ్యేనేని జననకాలఘుడియలలో దినార్ధమును తీసివేయవలెను అట్లు తీసివేయగా శేషించిన ఘుడియలు నతమగును.

3 రాత్రియందు రెండుజాములకు లోపుగా జననమయ్యేనేని సూర్యాస్తమయాది జననకాల ఘుడియలను దినార్ధములో చేర్చవలెను.

4 రాత్రి 2 జాములు దాటిన తరువాత జననమయ్యేనేని రాత్రి శేషించిన ఘుడియలను అనగా రాత్రి జననకాల ఘుడియల లగాయతు మరునాడు ఉదయమువరకు మిగిలిన గడియ విఘుడియలను దినార్ధములో చేర్చవలెను. అట్లుచేర్చగా నతమగును.

పూర్వకపాలము పశ్చిమకపాలము అని రెండు విధములు

పూర్వకపాలమనగా రాత్రి 2 జాములు మొదలు మరు నాడు పగలు రెండుజాములవరకు అనగా దినార్ధమువరకు ఈ మధ్యకాలము. దీనికి ఇంగ్లీషుభాషలో ఎ. యమ్. అని పేరు.

పశ్చిమకపాలమనగా పగలు రెండుజాములు మొదలు రాత్రి 2 జాములవరకు ఈ మధ్యకాలము దీనికి పి. యమ్. అని పేరు.

పూర్వకపాలములో సాధించిన నతమునకు పూర్వక పాలనతమనియు పశ్చిమకపాలములో సాధించిన నతమునకు పశ్చిమకపాలనతమనియు సంజ్ఞగలదు.

ఇట్లు సాధించగా వచ్చిన నతము పూర్వకపాలనతమైన దియు పశ్చిమకపాలనతమైనదియు ముఖ్యముగా గమనించవల యును.

ఈప్రకారముగా నతమును సాధించి ఈనతముయొక్క గడియ విఘడియలను భాగలిప్తలలోనికి మార్చవలయును. 1 ఘడియకు 6 భాగలు గనుక ఈనతఘడియ విఘడియలను 6 చేత గుణించినయెడల భాగలిప్తలువచ్చును. అటుపిమ్మటజాత కునియొక్క జననకాలమునకు స్ఫుటరవిరాశ్యాదిని గనుగొని ఈస్ఫుటరవియొక్కరాశి భాగలిప్తలలో పైనసాధించగావచ్చిన భాగలిప్తలు పూర్వకపాలనతముయొక్క భాగలిప్తలైనచో తీసి వేయవలెను. పశ్చిమకపాలనతభాగలిప్తలైనచో కలుపవలెను. అట్లు చేయగా వచ్చినది దశమభావమగును. అనగా జాతకుని

యొక్క జన్మస్ఫుటలగ్నములగాయతు ఇదియే దశమభాగమని యర్థము. ఈదశమభావమునకు 6 రాసులు చేర్చగా చతుర్థ భావమగును.

జాతకునియొక్క జననకాలస్ఫుటలగ్నమే తనుభావ మగుచున్నది ఈతనుభావములో 6 రాసులు చేర్చగా సప్తమ భావమగును.

ఈవిధము7గా లగ్నచతుర్థసప్తమదశమ భావము లేర్ప డును.

ఇక ధనాదిభావములను సాధించవలెను

ఇంతవరకు వ్రాసినవిధమంతయు తెలియుటకై ముందుగా నుదాహరణమును వ్రాయుచున్నాము.

ఉదాహరణము.

దుందుభినామ సం॥ర చైత్రశుద్ధ పంచమి ఆదివారం రోజున సూర్యోదయాది ౫ 9-39 వి॥లకు జననము. రోజున అహఃప్రమాణము ౫ 30-30 లు.

ముందుగా నతమునుసాధించవలెను.

పైన వ్రాసిన అహఃప్రమాణముయొక్క ఘు 30-30 వి గడియలను సగముచేయగా దినార్థమగును. దినార్థము ౫ 15-15

పైన వ్రాసిన మొదటివిధము ప్రకారము జాతకుడు, పగలు రెండుజాములకు లోపుగా జననము గనుక దినార్థములో జననకాల ఘడియలను తీసివేయవలెను. అట్లు తీసివేయగా నతమగును.

| | ఘ॥ | వి॥ |
|---|---|---|
| దినార్థము | 15 | 15 |
| జననకాలఘడియలు | 9 | 39 |
| నతము | 5 | 36 |

ఈ జాతకుడు ఎ. యమ్. లో జననముగనుక ఈనతము పూర్వకపాలనతమని జ్ఞాపకముంచుకొనవలెను. ఈనతముయొక్క గడియ విగడియలను భాగలి ప్తలలోనికి మార్చవలెను. 1 ఘడియకు 6 భాగలని మానమొకటిగలదు. గనుక పైన వ్రాసిన నతముయొక్క గడియ విగడియలను అనగా 5-36 వి॥ గను 6 చేత గుణించగా 33 భాగల 36 లి ప్తలు వచ్చినవి. అటు పిమ్మట జననకాలస్ఫుట రవి రాశ్యాదిని కనుగొనవలెను. వెనుక గ్రహస్ఫుటములో సాధించిన ప్రకారము జననకాలస్ఫుట.

| | రా॥ భా॥ వి॥ |
|---|---|
| రవి రాశ్యాది | 11-19-1 |

పైన వ్రాసిన నతము పూర్వకపాల నతముగనుక, ఈ స్ఫుట రవి రాశ్యాదితో తిసివేయగా దశమ భావమగును.

| | రా॥ | భా॥ | వి॥ |
|---|---|---|---|
| స్ఫుటరాశ్యాది | 11 | 19 | 1 |
| నతరాశ్యాది | 1 | 3 | 36 |
| దశమభావము | 10 | 15 | 25 |

ఇది యేదశమభావము అనగా మేషరాశిలగాయతు 10 రాసుల 15 భాగల 25 లిప్తలకు దశమభావమని యర్థము అనగా కుంభరాశియైనది. జాతకుడు లగ్నస్ఫుటప్రకారము వృషభరాశియందుజననము గనుక వృషభలగ్నములగాయతు ఈకుంభరాశి పదియవదియైనది. ఇదియేదశమభావము అనగా ఇది దశమభావముమధ్యగాని దశమభావ ప్రారంభము కాదు. ఈసంగతి ముఖ్యముగా జ్ఞాపకముంచుకొనవలెను.

ఈదశమభావమునకు 6 రాసులుచేర్చగా చతుర్థభావమగును. అట్లుచేర్చగా 16 రాసుల 15 భాగల 25 లిప్తలు వచ్చినది. 16 రాసులు యుండవుగనుక 16 రాసులలో 12 రాసులు తీసివేయగా 4 రాసుల 15 భాగల 25 లిప్తలువచ్చును. ఇదియే చతుర్థభావము.

యిక సప్తమభావము కనుగొనవలెను.

వెనుకసాధించినలగ్నస్ఫుటము అనగా లగ్నరాశ్యాదియేతనుభావము. అనగా 1 రాశి 23 భాగల 11 లిప్తలు ఇదియే తనుభావమని యర్థము. ఇదితనుభావమధ్యముగాని తనుభావారంభముగాదు. ఈతనుభావమునకు 6 రాసులు చేర్చగా సప్తమభావమగును. అనగా 7 రాసుల 23 భాగల 11 లిప్తలు. ఇదియే సప్తమభావము.

| ఈప్రకారముగా | రా | భా | లి |
|---|---|---|---|
| తనుభావము | 1 | 23 | 11 |
| చతుర్థభావము | 4 | 15 | 25 |
| సప్తమభావము | 7 | 23 | 11 |
| దశమభావము | 10 | 15 | 25 |

4 భావములు వచ్చినవి.

ఇకధనాదిభావములను సాధించవలెను.

ఈవిధమెట్లనగా

చతుర్థభావములో తనుభావమును తీసివేసి ఆశేష మును 6 చేతభాగించగా షష్టాంశమువచ్చును. ఆషష్టాంశము ను తనుభావములో కలుపగావచ్చినలబ్ధము తనుభావమునకును ధనభావమునకు మధ్యనున్న సంధియగును. ఈసంధిలో తిరిగి ఆషష్టాంశమును కలుపగా ధనభావమగును. ఈధనభావ ములో తిరిగి ఆషష్టాంశమును కలుపగా ధనభావమునకు భ్రాతృభావమునకు మధ్యనున్న సంధియగును. ఈసంధిలో ఆషష్టాంశము కలుపగావచ్చిన లబ్ధభ్రాతృ భావమగును. ఈభ్రాతృభావములో తిరిగి ఆషష్టాంశమును కలుపగా భ్రాతృ భావమునకు మాతృభావమునకుమధ్యనున్న సంధియగును. చతుర్థభావము ఇదివరకే సాధింపబడినది. ఈప్రకారముగా తను భావములగాయతు చతుర్థభావమువరకు 3 భావములు 6 సం ధులు ఏర్పడును.

ఉదాహారణము.

| | రా. | భా. | లి. |
|---|---|---|---|
| చతుర్థభావము | 4 | 15 | 25 |
| తనుభావము | 1 | 23 | 11 |
| శేషము | 2 | 22 | 14 |

ఈ శేషమును 6 చేత భాగించగా రా. ०. భా 13 లి

42 వచ్చును. దీనికి షష్టాంశమని పేరు. ఈ షష్టాంశమును తనుభావములో చేర్చగా

| | రా | భా | లి | |
|---|---|---|---|---|
| తనుభావము | 1 | 23 | 11 | |
| | 0 | 13 | 42 | షష్టాంశము |
| తనుభావమునకు ధనభావమునకు మధ్యనున్న సంధి | 2 | 6 | 53 | |
| | 0 | 13 | 42 | షష్టాంశము |
| ధనభావము | 2 | 20 | 35 | |
| | | 13 | 42 | షష్టాంశము |
| ధనభ్రాతృసంధీ | 3 | 4 | 17 | |
| | | 13 | 42 | షష్టాంశము |
| భ్రాతృభావము | 3 | 17 | 59 | |
| | | 13 | 42 | షష్టాంశము |
| భ్రాతృమాతృసంధి | 4 | 1 | 41 | |
| మాతృభావము | 4 | 15 | 25 | |

ఈ ప్రకారముగా మాతృభావమువరకు 8 భావములు.

3 సంధులు ఏర్పడినవి. అటుపిమ్మట మాతృభావము లగాయతు సప్తమభావమువరకు భావములు సంధులు ఏర్పఱచవలెను. అవి యెట్లనగా, సప్తమభావములో చతుర్థభావమును తీసివేసి ఆ శేషమును 6 చేత భాగించగా వచ్చిన షష్ఠాంశమును చతుర్థభావము లగాయతు పైన వ్రాసిన విధముననే సప్తమభావమువరకు వరుసగా కలుపగా మాతృపుత్రశత్రు భావములును వాటి సంధులును ఏర్పడును.

ఉదాహరణము

| | రా | భా | లి | |
|---|---|---|---|---|
| సప్తమభావము | 7 | 23 | 11 | |
| మాతృభావము | 4 | 15 | 25 | |
| | 3 | 7 | 46 | శేషము |

ఈ శేషమును 6 చేత భాగించగా రా. ౦. భాగలు 16 లిప్తలు 18 వచ్చినది దీనికి షష్ఠాంశమని పేరు. ఈ షష్ఠాంశమును మాతృభావములో కలుపగా,

| | రా | భా | లి | |
|---|---|---|---|---|
| మాతృభావము | 4 | 15 | 25 | |
| | 0 | 16 | 18 | షష్ఠాంశము |
| మాతృసంధి | 5 | 1 | 43 | |
| | | 16 | 18 | షష్ఠాంశము |

| | | | | |
|---|---|---|---|---|
| పుత్రభావము | 5 | 18 | 1 | |
| | | 16 | 18 | షష్ఠాంశము. |
| పుత్రశత్రుసంధి | 6 | 4 | 19 | |
| | 0 | 16 | 18 | షష్టాంశము. |
| శత్రుభావము | 20 | 9 | 37 | |
| | 0 | 16 | 18 | షష్టాంశము. |
| శత్రుకళత్రసంధి | 7 | 6 | 55 | |
| కళత్రభావము | 7 | 23 | 11 | |

ఈ ప్రకారము కళత్రభావమువరకు 3 భావములు 3 సంధులు ఏర్పడినవి. తనుభావము లగాయతు సప్తమభావము వరకు 6 రాసులు సంధులు ఏర్పడినవి.

ఇక సప్తమభావము లగాయతు తను భావమువరకు భావములు సంధులు ఏర్పర్చవలెను. దీనికి వేరుగా గణితముచేయనక్కరలేదు. తను భావము లగాయతు సప్తమభావమువరకు వచ్చిన 6 భావములకు 6 సంధులకు రాశి స్థానమందు వరుసగా 6 రాసులు కలుపగా సమాష్టమనవమదశమ ఏకాదశ ద్వాదశ భావములును వాటియొక్క మధ్యనున్న సంధులును ఏర్పడును.

ఈ ప్రకారముగా తను భావములగాయతు ద్వాదశ

భావము ఆఖరువరకు 12 భావములును 12 సంధులు ఏర్పడును. ఇది పూర్తిగా తెలియునటుల 1 టేబిలు (Table గూడి ఈ దిగువ వ్రాయుచున్నాము.

తన్వాదిద్వాదశ భావములు సంధులు

| | | | | |
|---|---|---|---|---|
| 1 | 1 | 23 | 11 | తనుభావము |
| 2 | 2 | 6 | 53 | సంధి |
| 3 | 2 | 20 | 35 | ధనభావము |
| 4 | 3 | 4 | 17 | సంధి |
| 5 | 3 | 17 | 59 | భ్రాతృభావము |
| 6 | 4 | 1 | 41 | సంధి |
| 7 | 4 | 15 | 25 | మాతృభావము |
| 8 | 5 | 1 | 43 | సంధి |
| 9 | 5 | 18 | 1 | పుత్రభావము |
| 10 | 6 | 4 | 19 | సంధి |
| 11 | 6 | 20 | 37 | శత్రుభావము |
| 12 | 7 | 6 | 55 | సంధి |
| 13 | 7 | 23 | 11 | కళత్రభావము |
| 14 | 8 | 6 | 53 | సంధి |
| 15 | 8 | 20 | 35 | అష్టమభావము |
| 16 | 9 | 4 | 17 | సంధి |
| 17 | 9 | 17 | 59 | నవమభావము |
| 18 | 10 | 1 | 41 | సంధి |
| 19 | 10 | ~~25~~ 15 | ~~15~~ 25 | దశమభావము |
| 20 | 11 | 1 | 43 | సంధి |

| | | | | |
|---|---|---|---|---|
| 21 | 11 | 18 | 1 | ఏకాదశభావము |
| 22 | 0 | 4 | 19 | సంధి |
| 23 | 0 | 20 | 37 | ద్వాదశభావము |
| 24 | 1 | 6 | 55 | సంధి |

ఈ ప్రకారముగా ఇంతశ్రమపడి భావములు సంధులు విడదీయుటవలన ప్రయోజనమేమనగా ప్రతిభావమునకు పూర్వమున నొకసంధియు పరమున నొకసంధియుగలదు. పూర్వసంధి లగాయతు భావము ప్రారంభమై పరసంధితో ఆఖరగును. అనగా రెండుసంధులకు మధ్యమున్నది. భావమని యర్థము భావము అని వ్రాసినచోట భావమధ్యముగాని భావారంభము గాదు, భావముతో సరిగానుండు గ్రహము అనగా భావమధ్యమందుండు గ్రహము ఆభావఫలము పూర్ణముగా నిచ్చును. భావారంభమున అనగా భావముయొక్క పూర్వసంధియందు ఫలారంభమగును. అటు పిమ్మట భావమధ్యమువరకు క్రమక్రమముగా ఫలము హెచ్చి భావమధ్యమున పూర్ణఫలముల నిచ్చును భావమధ్యము లగాయతు భావాంత్యమువరకు అనగా పరసంధివరకు క్రమక్రమముగా ఫలము తగ్గుచువచ్చి భావాంత్యమున ఫలమేమియు నియ్యదు అనగా సంధులయందున్న గ్రహమేమియు ఫలమునియ్యదు. సంధికంటె నెక్కువగానుండు గ్రహము ఉత్తమభావఫలమును ఇచ్చును. రాశిచక్రమువలెనే ఈ పై విధముగా భావచక్రమొకటి ఏర్పరచుకొని భావఫలమును చెప్పవలెను. గాని రాశి చక్రమునుబట్టి భావఫలములను చెప్ప గూడదు.

పూర్వసంధికంటె తక్కువగానుండు గ్రహమును పూర్వభావములోను ఉత్తరసంధికంటె నెక్కువగానుండు గ్రహమును ఉత్తరభావములోను వేయవలెను. ఈఉదాహరణజాతకములో స్ఫుటరాశ్యాది జాతకునియొక్క జననకాలమునకు ర 11 భా 19 లి 1 గనుక ఈరవి మేషాది 11 రాసుల 19 భాగల 1 లిప్తయందుండెను. అనగా మీనరాశియందుండెను. ఈజాతకుడు వృషభలగ్నమందు జననముగనుక వృషభలగ్నములగాయతు మీనము 11 వ రాశిగనుక ఈరవి ఏకాదశస్థానమందున్నట్లు కనబడుచున్నది. ఈస్ఫుటరవిరాశ్యాదినిబట్టి పైన వ్రాసిన భావపట్టికలో చూడగా ఏకాదశభావమధ్యమము దాటి పైగా మరియొకభాగ నతిక్రమించి యున్నాడు. అనగా 1 భాగ మాత్రము దాటియుండుటచేతను ఈరవి కొంచె మించుమించుగా ఆఏకాదశభావఫలము పూర్తిగా నిచ్చుననియర్థము ఈ ప్రకారముగానే స్ఫుటముచేసిన అన్నిగ్రహములను జాగ్రతగా కనిపెట్టి భావచక్రమునందు వ్రాసుకొనవలెను. లగ్నమధ్యమందు జననమైన వారిని భావచక్రములోను రాశిచక్రములోను కూడ గ్రహములు సరిగా నుండును. లగ్నాదియందు లగ్నాంత్యమందును జననమైనవారికి ఈరెండు చక్రములలోని గ్రహములు భేదించును అప్పుడు రాశిచక్రమును బట్టి భావఫలము చెప్పుట వ్యర్థమని దీనివలన తెలియుచున్నది.